# ఉత్తరాలు

## సినిమా వ్యాసాలు

ఈవారంలోనే ప్రముఖ నటుడు శ్రీ రామారావు గారు సినిమా పరిశ్రమ ఆంధ్రరాజధానికి తరలించటంలోగల సాధక బాధకాలను చక్కగా వివరించారు. కానీ వ్యాసం చాలా తక్కువలోనే ముగించటం చాలా నిరాశ కలుగజేసింది. వారికి నా అభివందనలు. వారి రాబోయే వ్యాసాలకోసం ఎదురు చూస్తున్నాము.

కుమారి వెంకటలత (తెనాలి)

* * *

15—5—64 తేదీ వారపత్రికలో రామారావు వ్రాసిన "కళ— పరమార్థము— కళాకారుడు" అనే వ్యాసం చదివాను. చాలా బాగా చర్చించారు. కాని "మరి ఈ నాడు అందరిలో ఉన్న దేశభక్తిని శంకించ వలసిన అవసరం ఏమొచ్చింది?" అని ఒక చోట అన్నారు. ఇలా వ్రాయడానికి మాకు కారణం తెలియ రాలేదు. ఈ విషయం గురించి మీరు విపులంగా తెలియ జేయుగలరని ఆశిస్తున్నాను.

ఎ. వి. వెంకట్రావ్ నాయుడు (శివదేవునిచిక్కాల)

* * *

ఉత్తమ నటుడూ, ఉత్తమ రచయితా అని మాత్రమే ఇంతవరకూ అనుకుంటూన్న నాఅభిమాన నటుడు రామారావు అత్యంత మేధాసంపన్నుడని కూడా ఋజువు చేసుకున్నాడు మీ పత్రికలో వ్యాసముల ద్వారా. మొదటి, చివరి వ్యాసాలు చాలా గొప్పగా ఉన్నాయి. ప్రతిభావంతులు ఏమి చేసినా బాగానే ఉంటుందంటారు ఇదే కాబోలు.

కృష్ణ (విజయవాడ)

## ఇంటింటి పజ్యాలు

29—5—64 వారపత్రికలో ఇంటింటి పజ్యాలు శీర్షికలో 6 రుద్ర 7 డ్డు అనేది మాకు తప్పుగా తోచింది. దానిని విడదీసి చదివితే ఆరుద్ర ఏడుడ్డు అని వస్తోంది. దాని బదులు 6 ద్ర 7 వు అని గాని' 6 ద్ర 7ప్ప అని గాని ఉంటే సరైన అర్థం వచ్చేదని మా అభిప్రాయం.

వేణుగోపాలరావు మరియు సోదరులు (గుంటూరు)

## కథలు

ఇటీవల ఆంధ్ర సచిత్ర వారపత్రికలో కా. వి. గారు రచించిన 'వరహారి విజాయితీ' అను కథ చదివాను. అందులో పోస్టల్ డిపార్టుమెంటులోని ఎక్‌స్ట్రా డిపార్టుమెంట్ ఉద్యోగులు అనుభవించు కష్ట నష్టములు వరహారి పాత్ర ద్వారా చక్కగా చూపినారు. ప్రతి ఎక్‌స్ట్రా డిపార్టు మెంట్ ఉద్యోగికి, పోస్టుమన్‌కు ఎంత పని ఉంటుందో అంతఉంటుంది. కాని వీరికి దుస్తులు, పాదరక్షలు, మొదలగునవి ఇవ్వరు. సెలవు కావాలన్నా వీరి స్వంత బాధ్యతపై, వీరి ఖర్చుతోనే మరొకరిని నియమించుకొన వలసి ఉంటుంది. రచయితకు అభివందనములు. ఇట్టి కథలు ఇంకను ప్రచురింప ప్రార్థన.

కె వి. ఆర్. ప్రసాద్. (పాలకొల్లు)

* * *

మలికిపురం నుంచి శ్రీ ఆర్. ప్రసాదరావుగారు వ్రాసిన కార్డు మీరు పంపించగా చదివి సంగతి తెలుసుకున్నాను. ఈ మధ్య వారపత్రికలో ప్రచురింపబడిన నా రచన "మంచి అమ్మ" కథానికను గురించి వారి అభిప్రాయం నిర్మొహమాటంగా వెల్లడించారు. అది ప్రఖ్యాత రష్యన్ రచయిత చెకోవ్ రచన 'ఇన్సిడెండ్'కి కాపీ అని వెల్లడించారు.

దీనిని గురించి నేను చెప్పుకోగల జవాబు ఒక్కటే. ఇది దురదృష్టవశాత్తు వచ్చిపడిన నీలాపనింద. చెకోవ్ రష్యన్ రచయిత అన్న విషయం తప్పితే ఇక ఆ రచయిత గురించి నాకేమీ తెలియదు. "మంచి అమ్మ" వ్రాయక ముందు కనీసం అటువంటి కథానైనా నేను చదవలేదు. విదేశీ రచనలు గానీ స్వదేశీ రచనలుగానీ నాకెక్కువ పరిచయం లేదు.— చెకోవ్ 'ఇన్సిడెంట్" కథ ఏ భాషలో రాశాడో— ఏ విషయం మీద రాశాడో పిల్లిపిల్లనే పెట్టాడో— కుక్కపిల్లనే పెట్టాడో ఏ విధంగా ముగించాడో— ఇవేమీ నాకు తెలీదు.— ఈ ఉత్తరం చదివిన తర్వాతే ఆ విషయాలు తెలుసుకోవాలన్న కుతూహలం కల్గింది. తెలుసుకోటానికి ప్రయత్నిస్తాను.

నాలుగేళ్ల మా నానిగాడు అకస్మాత్తుగా మా ఇంటికి వచ్చిపడ్డ పిల్లిపిల్లతో ఆడుకున్న సంఘటనే నా రచనకు మూలాధారం— కథా చౌర్యం— భావ చౌర్యం వంటి నీచమైన పనులకు దిగజారే మనస్తత్వం రంగనాయకమ్మ జీవితంలో ఉండబోదు. భావ పరంపర కరువైనప్పుడు సంతోషంగా రచనా వ్యాసంగం మానుకోవచ్చునే ! ఈ విమర్శల ధాటికి తట్టుకుని తలఎత్తుకోలేని నీచమైన కార్యానికి రంగనాయకమ్మ పూనుకుంటుందని శ్రీ ప్రసాదరావుగారు తల్చటంతోనే వారికి ఈ రచయిత్రి మీద ఎంత ప్రత్యేకాభిమానమున్నదో తెలుస్తున్నది. నా బాధ్యతగా నేను చెప్ప వలసింది రాశాను. ఇంతకన్న నేనేమీ చెయ్యలేను— సంపాదకులు ఈ లేఖని తప్పక ప్రచురించగలరని ఆశిస్తాను.

ముప్పాళ రంగనాయకమ్మ.

* * *

ఒక చిన్న కుర్రాడికీ, ఒక చిన్న పిల్లిపిల్లకీ గల అల్లరిని వ్రాసి పంపిన కథను జాగ్రత్తగా ప్రచురించారు. ఇంతకన్నా బాగా వ్రాసి, వినూత్నంగా తయారుచేసిన మంచి హుషారైన కథలని తేలికగా తీసి చెత్త బుట్టలో వేస్తుంటే రచయితలకు ప్రోత్సాహ మెక్కడిది ? ఎలా వస్తుంది — !

టి. మారుతి ప్రసాద్ (కంకిపాడు)

## నెహ్రూజీకి శ్రద్ధాంజలి

5—6—64 తేదీ గల వార పత్రిక నిన్నటి దినం నాకు చేరినది. పోస్టాఫీసు ముద్రలను బట్టి చూడగా, ఆ పత్రిక 31—5—64 తేదీని పోస్టులో పడినది. చింతనీయ మేమనగా శ్రీ జవహర్ లాల్ నెహ్రూ 27—5—64 తేదీ మధ్యాహ్నం 2 గంటలకు పరమపదించేరు. కాని మీ పత్రిక విషయాలు ఆ సరికి ముద్రణకు వెళ్ళి వుండవు. ఒక వేళ వెళ్ళినా కథానికలు వగైరాలు మాత్రమే వెళ్ళి వుండ వచ్చును. సంపాదకీయం తయారయి వుండదు. కాని వారికి శ్రద్ధాంజలి ఏమీ మీ 5—6—64 తేదీ గల పత్రికలో ఇవ్వకపోవటం, ఇట్టి సమయంలో సాధారణంగా అనుసరించ వలసిన సదాచారలతో ముద్రించడం, వగైరావిధానములు మీరు అనుసరించకపోవటం చాలా చింతించ వలసిన విషయం. దయచేసి తగు కారణాలతో జవాబు ఇప్పించగలరా ?

యం. వి. యస్. ప్రసాద్ (మ్యాడిల్లి)

**అట్టమీద వేసే తేదీ కన్నా, కనీసం పది రోజులముందే సంచిక ముద్రణ అయిపోతుంది ముఖచిత్రం తయారు చెయ్యటం సాధారణంగా నెల రోజుల ముందు ప్రారంభం అవుతుంది.**

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రిక 12—6—64 సంచికలో ప్రచురితమైన ప్రియతమ ప్రధాని పండిట్ నెహ్రూ వివిధ ఛాయా చిత్రాలు పాఠకుల హృదయాలను దోచుకున్నవనుటలో సందేహం లేదు.

అట్లూరి శరత్‌బాబు (విజయవాడ)

* *

ఈ వారం (12—6—64) పత్రికలో నెహ్రూగారి జీవిత విశేషాలు, ఫోటోలు చాలా బాగున్నాయి. మా దుఃఖం తగ్గే బదులుగా పత్రిక మూసే సరికి ఎక్కువయింది.

అట్ట పైన " వియత్నాం వింతలు " అని వేశారు. కానీ లోపల ఎక్కడా ఏ వింతా కన్పించ లేదునమ్మండి ! ఇది గూడా ఒక వియత్నాం వింతే గాబోలు.

డి. వి. సత్యనారాయణ (సత్తెనపల్లె)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శుక్రవారం : 26—6—'64
క్రోధి నామ సం॥ జ్యేష్ఠ మాసం॥ బ॥ పాడ్యమి
సంపుటము 56 సంచిక : 43
స్థాపితము :
1908
*
సంయుక్త సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడ మీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 న.పై.
సంవత్సర చందా 15.60 న.పై.
6 మాసాలు చందా 7.80 న.పై.
*
ఆంధ్రపత్రిక కార్యాలయము
7 తంబుచెట్టి వీథి, మద్రాసు-1



"చూడు కామ్రేడ్; దొంగ నిల్వచేసిన ఖజానా మనం బట్టబయలు చేయాలి"
"అదెలా సాధ్యం కామ్రేడ్. మనం చేసిన పని అదేగా!"

## మనలో మాట

శ్రీ శ్రీకృష్ణ భారతరాజధానిలో లేనికారణంగా పోయిన రెండువారాలు న్యూఢిల్లీ లేఖను ప్రచురించలేక పోయాము. తిరిగి యీ వారమే ప్రచురించగలుగుతున్నాం.

* * *

కొన్నిమాసాలుగా మేము ప్రచురిస్తున్న 'రామచరిత మానస్' పైవారంతో ముగుస్తుంది. త్వరలో మరో చక్కటి 'సీరియల్'ను ప్రారంభించబోతున్నాం. వివరాలు పై సంచికలోనే......!

* * *

శ్రీ నెహ్రూ అస్తమయంపట్ల సంతాపం వెలిబుచ్చుతూ కొందరు కవితలను, మరికొందరు వ్యాసాలను మా కార్యాలయానికి పంపారు. స్థలాభావం వలన వాటన్నిటిని ప్రచురించలేకపోతున్నాం. కనుక మా పాఠకులు గమనించగోరుతున్నాం.

* * *

గత వారం సంచికలో 'మనలో మాట'లో 1961 అని అచ్చు కావడానికి బదులు 1946 అని అచ్చయింది. ఈ అచ్చు పొరపాటుకు మిక్కిలి చింతిస్తున్నాము.

## విషయానుక్రమణిక


నెహ్రూ అడుగు జాడల్లో...


బాధతో బాధ్యతల
అప్పగింత




కంట్రోళ్లు
ప్రభుత్వ
వ్యాపారం
అవినీతి
ఆధునిక సంసారం



నూతన ప్రధాని పరిచయం :

# అసలైన సిసలైన కాంగ్రెసు వాది శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి

ఖద్దరు పంచ, తెల్లని జుబ్బా ధరించి పదిమంది లోనూ సందడి కలిగిస్తూ, ఎప్పుడూ నవ్వుతూ, అప్పుడప్పుడు నవ్విస్తూ వుండే ఐదడుగులునిండని– ఈ మనిషికి ఇంత పెద్ద భవిష్యత్తు వున్నదనీ, భారతీయుల ప్రగతి రథంయొక్క సారథ్యం లభిస్తుందనీ ఎవరూహించారు ?

లాల్ బహదూర్ అన్న పేరులోనే వున్నాయి గాంభీర్యమూ, నిండుతనమూ. విగ్రహం 'బహదూర్'కు తగినది కాకపోయినా, వ్యక్తిత్వమూ, మేధస్సూ మాత్రం పేరుకు ఏ మాత్రం తీసిపోవని అనిపిస్తున్నది.

59 వసంతాలకు పూర్వం, మహాత్ముడు జన్మించిన అక్టోబరు రెండవ తేదీననే, శాస్త్రీజీ కూడా జన్మించటంలో కొంత ప్రత్యేకత లేకపోలేదు. లాల్ బహదూర్ తండ్రి వారణాసికి సమీపంలో అధ్యాపక వృత్తిలో వుండేవారట !

ఆయన అసలైన, సిసలైన కాంగ్రెసు వాది. మహాత్ముడు జన్మించిన తేదీన తానూ జన్మించాడు. జాతిపిత బోధనలలోనిమహత్యాన్ని గ్రహించి, దాన్నంతా తనలో జీర్ణింపచేసుకొన్నాడు. అలహాబాదును, ఇంకా ఉత్తరప్రదేశ్‌నూ తనదిగా చేసుకొన్నాడు. అక్కడి ప్రజల హృదయాలలో చిరస్థాయిగా నిలిచాడు. మహాత్ముడు సూచించిన నెహ్రూ నాయకత్వమే లాల్ బహదూర్‌కు శిరోధార్యమయింది. నెహ్రూజీ చెప్పిన మాటను వేదవాక్కుగా పరిపాలించాడు. — నిజమైన కాంగ్రెసు వాదినని నిరూపించుకొన్నాడు. — ఒకమారు కాదు, పలుమార్లు. కాశీ పీఠంలో డాక్టర్ సంపూర్ణానంద్, ఆచార్యా నరేంద్రదేవ్‌ల శిష్యరికం ఒక రకంగా వీరి రాజకీయపు జీవితానికి రహదారిని ఏర్పరచి వుందనటంలో అతిశయోక్తి లేదు. విచిత్రం అదికాదు–ఆచార్య నరేంద్రదేవ్ ప్రజా సోషలిస్టు పార్టీ ప్రారంభించినవారు; దానికి జనకులు కూడా. కాని శాస్త్రీజీ మాత్రం ఆ పార్టీ పతాకం క్రిందకు రాలేదు.

కాంగ్రెసు సంస్థలోచేరి, నడుం కట్టిన శ్రీశాస్త్రి సామర్థ్యం నెహ్రూను ఎక్కువగా ఆకర్షించింది. ఫలితంగా వారు ఏకమనస్కులయారు. అప్పటినుంచే శాస్త్రిగారి అదృష్టతార మరోవైపు మరలింది. ఆ సాన్నిహిత్యం శాస్త్రిజీని ఎంతో దూరం తీసుకెళ్ళింది.. 1951లో, లాల్‌బహదూర్‌కు కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి పదవి లభించింది. తన ప్రతిభను చూపుకొనే తొలిఅవకాశంకూడా అదేనేమో!

ఆనాటినుంచే అదృష్టం ఆయనజీవితంతో పెనవేసుకపోయింది. క్రమేణా ఒకటి తరువాత మరొకటిగా పదవులు సంక్రమించాయి. ఇంతలో గోవిందవల్లభపంత్ గారి నిర్యాణమూ, తరువాయి క్షణంలోనే శ్రీ లాల్ బహదూర్‌కు,—దేశానికి హృదయం లాంటి — దేశీయాంగ శాఖ లభించటం, వారి రాజకీయ జీవితంలో మరో ప్రముఖ సోపానం. అనతి కాలంలోనే కాల పరిణామాలవశాత్తు, శాస్త్రి గారికి రైల్వేల మంత్రి పదవి లభించటం జరిగింది. ఇక్కడ చెప్పుకో దగిన దృష్టాంత మొకటున్నది. ఆయన రైల్వే మంత్రిగా ఉండే రోజుల్లో, జరిగిన పెద్ద రైలు ప్రమాదానికి ఆయన హృదయం పరితపించి పోయింది. మృతుల పట్ల సానుభూతితో, తన శాఖ పనిచేస్తున్న తీరుపట్ల విచారంతో—ఆశాఖకు రాజీనామా ఇచ్చి కొద్దికాలం రాజకీయపు ప్రవాసాన్ని అనుభవించారు. రెండేళ్ల క్రితం జరిగిన సార్వత్రిక ఎన్నికలలో శ్రీశాస్త్రి గెలుపొందటం, ఆ మళ్లీ దేశీయాంగ శాఖ లభించటం జరిగినా........ కామరాజు గారు ప్రతిపాదించిన పథకాన్ని అనుసరించి, శ్రీ లాల్ బహదూర్ పార్టీ సేవలకై రాజీనామా చేయక తప్పలేదు. కాని, ఆయనకు నెహ్రూ అండదండలు చిరకాలంగా, చిరస్థాయిగా వుండటం వల్ల తిరిగి కేంద్రంలో "ఏ శాఖా లేని మంత్రి"గా చేరారు. ఇలాంటి స్థితిలో........

ప్రధాని నెహ్రూ అస్తమించడం, ఆ పదవికి మరో సమర్థుడైన వ్యక్తి అవసరం కావటం జరిగింది. ఈ అవసరమే లాల్‌బహదూర్ శాస్త్రి గారిని తిరిగి తెరమీదకు లాక్కొచ్చింది.

ఆయనే ప్రధాని అయారు ! నెహ్రూజీ వారసత్వం ఆయనకే లభించింది ! దీనికి వారి ప్రతిభావ్యుత్పత్తులకన్నా, శ్రీ నెహ్రూ ఆశీస్సులే ప్రముఖంగా తోడ్పడ్డాయి. లాల్‌బహదూర్ తన కుడిభుజం అని నెహ్రూ మొదటి నుంచి బహిరంగంగానే చెప్పుకొంటూ వచ్చారు. ఆ మధ్య, తన కోటునే లాల్‌బహదుర్‌కు ఇచ్చి, వారి వ్యక్తిత్వాన్ని పెద్దదిగా చేశారు. శ్రీ నెహ్రూ ఎలాంటి నిర్ణయం చేసే ముందైనా శ్రీ శాస్త్రిని సంప్రదించేవారని, ఆయన ఇచ్చే సలహాలకు విశేషమైన ప్రాముఖ్యత ఇచ్చే వారని ప్రతీతి. పైగా, ఆ మధ్య అంటే—చైనా మన మీద దండయాత్ర జరిపిన తరుణంలో శ్రీ కృష్ణమీనన్ నిష్క్రమణకు లాల్‌బహదూర్ ఇచ్చిన సలహాలే పునాద యని చెప్పుకోటం జరిగింది. ఆ మధ్య నెహ్రూ అస్వస్థులై ఉన్నప్పుడు ఆయనస్థానే శ్రీ లాల్‌బహదూర్ 'ప్రధాని' కార్యకలాపాలను పార్లమెంటులో నిర్వర్తించిన దృష్టాంతం కూడా, ఒక విధంగా వారిరువురి సాన్నిహిత్యాన్ని వ్యక్తీకరిస్తుంది. ఇలాంటి స్థితిలో నెహ్రూ వారసుడుగా శ్రీ శాస్త్రి ఎన్నిక కావటం వింత ఏమీ కాదు.

శ్రీ శాస్త్రి ఎన్నిక కూడా చడీ, చప్పుడూ లేకుండా జరిగింది. పోటీ చేద్దామని తహతహలాడిక ఇద్దరు, ముగ్గురు నాయకులూ శ్రీ శాస్త్రి నాయకత్వాన్నే అంగీకరించారు. ప్రధాని పదవి ఎన్నికకు పూర్వం, అభ్యర్థి విషయమై, శ్రీ కామరాజు జరిపిన అభిప్రాయ సేకరణ ప్రజాస్వామ్య సంప్రదాయంతో తులతూగుతూనే ఉన్నది. ★










**Why have millions changed over to**

# PANAMA BLADES?

**Because they are <u>most</u> economical!**















***why not try it out for yourself!***









# మంత్రివర్గం ఏర్పాటులో నూతన ప్రధాని చాకచక్యం:
# అధిక ధరల సమస్య సత్వరమే పరిష్కరింపబడాలి!

కొత్త శకం ప్రారంభమవుతున్నదీ వారంలో...!

అంతమాత్రాన గడిచిపోయిన శకానికీ, కొత్తగా ప్రారంభమయిన శకానికీ మధ్య ఏదో అంతరాయం కలిగిందని అనుకోనవసరంలేదు. ఇండియాలోని భాగ్యవంతమైన సత్సంప్రదాయాలు, భరత మాత అనుంగుపుత్రుడు పండిత జవహరుడు నెలకొల్పిన ఆదర్శాలూ కొనసాగుతాయి. ఆ కొన సాగింపే నవశకారంభం. . . . . !

పక్షం రోజుల క్రితం శ్రీ నెహ్రూ పరమపదించి ఉండ వచ్చును. . . కాని ఆయన ఇంకా తన ప్రధాని స్థానంలోనే ఉన్నట్లు, 'మూర్తిమార్గ'లోని తన ఇంటనే నివసిస్తున్నట్లు ఢిల్లీ అంతా భావిస్తున్నది. కారణం 'నెహ్రూజీ' అనే పేరు ఒక అనుభూతి. ఇండియాను ఎలా అభివృద్ధి చేయాలా అన్నదే ఆ 'అనుభూతి'కి ఏకైక లక్ష్యమూ, పరమ లక్ష్యమూ ! శ్రీ నెహ్రూ ప్రధానిగా ఉండే రోజుల్లో మన దేశాన్ని సందర్శించినంత మంది వ్యక్తులు అంతకు పూర్వం ఎన్నడూ దర్శించలేదు. చెప్పదగినంత సైనిక, ఆర్థిక స్తోమత లేకుండానే, 'ఇండియా'ను నలుగురూ ప్రముఖ దేశంగా గుర్తించే టట్లు చేసింది శ్రీ నెహ్రూగారే. తన దేశాన్ని కాపాడుకొనేందుకు ఆయన తన రక్తాన్ని ధార పోశారు. ఇండియా సమస్యలన్నింటిలో చాలా వరకు, శ్రీ నెహ్రూ పరిష్కరించే వెళ్ళారు. ఆయన ప్రారంభించిన కార్యక్రమాలు భవిష్యత్తులో ఏ కారణంచేతనైనా కొనసాగింప బడకపోతే ఆ బాధ్యత ప్రజలదే అవుతుంది.

నిజం !. . . . అందుకే నెహ్రూ శకం ముగి సిందని చెప్పుకొందాం. . . అంతేకాదు, కొత్త శకం కూడా ఈసరికే ఇండియాను ఆవరించింది. ఇక దేశపు బాగోగులను గమనిస్తూ, ఉత్తమ భవిష్యత్తును దేశానికి తీర్చిదిద్దవలసిన బాధ్యత ఇక ముందు ప్రజలదీ.. కాంగ్రెసు నాయకులదీ.

కొత్త మంత్రివర్గాన్ని ఏర్పరచిన సందర్భం లోనే శ్రీ లాల్‌బహదూర్ ధీరత్వమూ, ప్రతిభ వ్యక్త మయ్యాయి. అయినప్పటికీ ఢిల్లీలోని ఒక దినపత్రిక ఈ కొత్త మంత్రివర్గాన్ని "హాఫ్ వే హౌస్"గా అభివర్ణించింది. శ్రీశాస్త్రి ఎదుర్కొం టున్న కొన్ని సమస్యలను పరిశీలిద్దాం.

మొదటి అంశమేమంటే - శ్రీ శాస్త్రి, నెహ్రూజీ ప్రత్యర్థిగా గెలుపొందలేదు. అకస్మాత్తుగా జవహర్‌లాల్ మృతిచెందటంలో ఏర్పడ్డ ఖాళీలో శ్రీ శాస్త్రి ఎన్ని కయ్యారు. శ్రీ నెహ్రూ మరణంతో ఏర్పడే పరిస్థితుల వైపరీత్యాన్ని ఎదుర్కొనడానికి దేశం సిద్ధపడలేదు. అయినా, అది వేరే విషయం.

నన్నడిగితే తప్పంతా వైద్యులది. దేశం నెహ్రూ మరణం వలన ఏర్పడే పరిస్థితులను ఎదు ర్కొనటానికి తగినట్లుగా సిద్ధం కాలేదంటే, దానికి బాధ్యత వైద్యులది. బొంబాయి కాంగ్రెసు సభలకు హాజరయిన శ్రీ నెహ్రూ ఆరోగ్యం చెప్పదగినంత బాగాలేదు. మరొక విచిత్రం.. బొంబాయిలోని ఒక పత్రిక శ్రీ నెహ్రూను గురించి, కాంగ్రెసు సదస్సును గురించి వ్రాస్తూ, శ్రీ జవ హర్లాల్ మామూలు ఆరోగ్యాన్ని కోలుకొన్నారని వ్రాస్తూ, అదే సంచిక లోపలి పేజీలలో — శ్రీ నెహ్రూను ముగ్గురు లేవదీస్తున్న ఫోటో నొకదానిని వేశారు. పైగా, ఆయన ఆ మధ్య ఒకా నొక పత్రికా గోష్ఠిని కూడా కేవలం అనారోగ్యంగా ఉన్నందున వాయిదా వేశారు. చెప్పొచ్చేదేమంటే, ఈ కారణాలన్నింటి దృష్ట్యా, శ్రీ నెహ్రూ భువ నేశ్వర్‌లో తిన్న దెబ్బనుంచి తిరిగికోలుకోలేదు. ఆయన ఆరోగ్యం ఎలాఉండేదో, ఆయన అసలు ఏ స్థితిలో ఉండేవారో ఎవరికీ తెలిసేది కాదు. ఆయన అనా రోగ్యం నుంచి కోలుకొన్నారన్న వదంతిని వ్యాపింప చేయటం, అకస్మాత్తుగా ఒక రోజు మధ్యాహ్నం "శ్రీ నెహ్రూ ఇక మనకులేరు" అని చెప్పటం జరిగింది. ఎవరిదీ తప్పంతా ? వైద్యులది కాక మరెవరిది ?

ఇలాంటి అస్తవ్యస్తపు పరిస్థితిలో, "అక స్మాత్తు" అనే వాతావరణ దేశం నాలుగు చెరగులా దట్టంగా ముసురుకొని ఉన్నస్థితిలో శ్రీ లాల్ బహదూర్ ప్రధాని అయారు. ఆయన్నే మంత్రి వర్గం ఏర్పరచమన్నారు. ప్రధాని పదవికి, కాస్తో, కూస్తో ఎన్నిక జరిగినట్టే అని చెప్పాలి. లాల్ బహదూర్ మొదటి ప్రత్యర్థి శ్రీ మొరార్జీ. పూర్వంలో శ్రీ నెహ్రూ కూడా ఇలాంటి చిక్కునే ఎదుర్కొన్నారట. చివరకు రాజీపడి మంత్రి వర్గాన్ని ఏర్పరచుకోవటం, సర్దార్ పటేల్‌కు ఆ రోజుల్లో పెద్ద వాటాను ఇవ్వటం జరిగింది. కాని, కాలక్రమేణా శ్రీ నెహ్రూ బాగా బలాన్ని పుంజుకొని, 'ప్రత్యర్థి' అనేవాడే లేకుండా చేసి కొన్నారు. అందువల్లే, చివరి రోజుల్లో కూడా, చాలా జాగ్రత్తగా ఉండవలసింది వచ్చింది శ్రీ నెహ్రూకు సైతం. 'కామరాజ్' పథకం అనే ఆయుధాన్ని 'వూచ'గా తీసికొనే, ఆయన మొరార్జీని, జగజీవన్ రామ్‌ను బయటకు పంపివేయ గలిగారు.

ఆ అంశాన్ని దృష్టిలో వుంచు కునే, శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి కూడా జాగ్రత్తగా మెలిగారు. మంత్రివర్గంలోని సభ్యులను ఎంతో మెళకువతో ఎన్నిక చేసుకున్నారు.

దీనిని విపులీకరించటానికి శ్రీ దాసప్ప ఉదా హరణ చాలు. ఆయన్ను ఈ మారు తగ్గించటం జరిగింది. పూర్వపు రైల్వేశాఖ నుంచి తొలగించి, రాష్ట్రాలూ—కేంద్రమూ కలిసి ఆధిపత్యం వహించే నీటిపనరుల శాఖకు పంపటం జరిగింది. పరిశ్రమల మంత్రి శ్రీ కనుంగోకు సాంస్కృతిక వ్యవహా రాల శాఖను ఇవ్వటం జరిగింది. రక్షణ శాఖలో ఉన్న శ్రీ రఘురామయ్య హోదాను కూడా తగ్గిం చారు. సి. సుబ్రహ్మణ్యం గారి రాజ్యం కూడా కూలి పోవటం, ఆయనకు ఆహార వ్యవసాయాలను అప్పగించటం జరిగింది. ఛీఫ్‌విప్ సత్యనారాయణ సిన్హా సమాచార, బ్రాడ్ కాస్టింగ్ శాఖల మంత్రిగా ఉన్నప్పటికీ— ఆయనకు పౌర విమానయాన శాఖను అప్పగించటం; ఒకప్పుడు తాను తిరస్క రించి, అదే కారణాన రాజీనామా చేసిన రైల్వేలే మళ్ళీ శ్రీ పాటిల్‌కూ లభించాయి. అంతేకాదు, ఇన్ని పనులు చేసిన శ్రీలాల్‌బహదూర్‌ను, మరొకం దుకు అభినందించాలి. ఎందుకంటే ఆయన జగ్జీ వనరాంను వెలుపలనే ఉంచగలిగారు. శ్రీ జగజీవన్ రాం ఈ పదిహేను సంవత్సరాల కాలంలో తనకు లభించిన ప్రతి శాఖలోను ఎంత 'రసాభాసం' చేసిందీ చరిత్రే చెప్పాలి. పైగా, షెడ్యూలు కులాలను అనవసరంగా రెచ్చగొట్టించిన మహానుభావుడతను. ఎవరూ ప్రశంసించని పాత్ర నొక దానిని శ్రీ జగ్జీవన్‌రాం నిర్వహించి, ప్రధాని పద వికి పోటీ చేయటానికి విఫలయత్నాలన్నీ చేశారు. మొదట్లో దేశాయ్‌ను బలపరుస్తున్నట్లు కనుపించి, చివర కొచ్చేసరికి, తానే ఒక ముఠాగా తయా రయ్యాడు.

శ్రీ మొరార్జీ దేశాయ్‌కి పున్న స్థానం వేరు. శ్రీ శాస్త్రికి ప్రధానమైన ప్రత్యర్థి అతను. అయి నప్పటికీ, అతనికి కేంద్ర మంత్రి వర్గంలో ఒక స్థానాన్ని ఇస్తా మన్నారు; అన్ని పత్రికలు ప్రక టించినట్లు శ్రీ మొరార్జీ పోర్టు ఫోలియో కోసం కాక హోదా మీద వచ్చిన భేదాభిప్రాయాలను అనుస రించి మంత్రివర్గంలో చేరలేదు.

ఆయన ప్రధాని తరువాతి స్థానం కావాలన్నారు. తనకు పార్టీలో శ్రీ నందాకంటె ఎక్కువ పలుకుబడి ఉన్నదని శ్రీ మొరార్జీ వాదన. శ్రీ లాల్ బహాదూర్ అంగీకరించలేదు— శ్రీ నందా అందరిలో "సీనియర్" సభ్యుడయి ఉండటం, దాని వల్లనే శ్రీ నందా తాత్కాలిక ప్రధాని కావటం ఒక కారణం అయి ఉండవచ్చును.

ఒకనాటి మంగళవారం ఉదయాన— మంత్రి వర్గపు నౌక ప్రయాణాన్ని ప్రారంభించింది. కరువుతో కొట్టుమిట్టాడుతున్న బికనీర్ పట్టణంలో మంచివర్షాలు అదే రోజున పడటం, ఒకరకంగా శుభసూచకం. ఈ నౌకాయానాన్ని జయప్రదం చేయటమన్నది భారతీయుల చేతులో ఉన్నది. శ్రీ నెహ్రూ బోధించిన ఆశయాలను అమలు జరపగలమని దేశమంతటా ప్రమాణాలు చేస్తున్న రోజులివి. శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి ప్రభుత్వం కూడా అదే కృతనిశ్చయంతో సాగిపోనున్నది. ప్రజల ప్రమాణాలే నిజమైనవి అయితే, శ్రీశాస్త్రికి అన్ని వైపుల నుంచి సహకారం తప్పక లభిస్తుంది.

ఆశావాదమూ, అనుభూతుల నుంచి నిజజీవితపు క్లిష్ట సమస్యలలోకి వద్దాం. శ్రీ శాస్త్రి చెప్పనే చెప్పారు— అధిక ధరల సమస్యను పరిష్కరించటం చాలా అవసరమని. చక్కెర, బియ్యం మొదలైన వస్తువుల కొరత ఉన్నమాట నిజం. ఆహార విధానాల్లో మార్పులు రావాలనే ఆలోచనే ఎంతో దారుణమైనది, దురూహ్యమూ. ఇంత కాలంగా అన్నం తిన్న ప్రజలను ఒక్క రోజు గోధుమలు తినమనటం హాస్యాస్పదంగా ఉంది. ఢిల్లీ హోటల్లో 'అన్నం' తగ్గించటం జరుగుతున్నది.

# న్యూఢిల్లీ లేఖ

బియ్యపు అన్నం కాక రొట్టెలకే ఎక్కువ అలవాటు పడ్డ ఉత్తరాదివారు బియ్యపు అన్నం బదులు రొట్టెలనేతినవచ్చు.అందువల్ల ఉత్తరాదిలో బియ్యానికి కంట్రోలు పెడితే, కేవలం బియ్యపు అన్నం తినే వారు 'బియ్యం' కోసం అష్ట కష్టాలు పడవలసిన అగత్యం ఉండదు.

చక్కెర సమస్యను పరిష్కరించటం ఇంకా తేలిక. ఇక్కడి గ్రామీణ, ప్రాంతాలలోని ప్రజలు తెల్లచక్కెర, బెల్లమూ ప్రతిరోజూ వాడరు. అందువల్ల వాడకందార్లు పొదుపుచేసికొంటే, దానివల్ల చాలా ప్రయోజనం ఉంటుంది.

**అసలు యీ చక్కెర పరిశ్రమను జాతీయం చేస్తే ఏ బాధ వుండదు. లేదా ఎగుమతుళ్ళను నిలిపి వేయాలి. చక్కెరకు నిర్ణీతమైన ధరను తొలగించండి. అప్పుడు మార్కెట్టులో 'వ్యాపారమే' వర్తకులకు లక్ష్యమవుతుంది. ధరలు వాటంతట అవే తగ్గుతాయి.**

మరో విషాదమేమంటే, పార్లమెంటు చుట్టూ కూడా చక్కెరను గురించి చెప్పుకోనివారు లేరు. పైగా, కాంగ్రెసు పార్టీ నిర్వహణకు ఈ చక్కెర పరిశ్రమ తోడ్పడింది. (ఎలా అని అడగద్దు) ప్రయోజన వోటింగు పద్ధతి ప్రకారం ఎన్నికలకోసం కోట్ల రూపాయలు అవసరమవుతున్నాయి. పార్టీకోసం, ఎన్నికలకోసం, ప్రతి చక్కెర బస్తా నుంచి కొంత చందా వెళ్ళేపద్ధతికి స్వస్తి చెప్పటం జరగాలి. ఇదంతా ఎందుకు ? ఈ పరిశ్రమను జాతీయం చేస్తే, ఏ బాధా ఉండదు !

చక్కెర పారిశ్రామికులు, అధిక ధరలకుగాను వర్తకాన్నే నిందిస్తుంటారు అప్పుడప్పుడు. చాలా మందికి తెలియకే పోవచ్చును— ప్రతి చక్కెర ఫ్యాక్టరీ కేవలం హోల్‌సేల్ దుకాణమే కాదు చిల్లర అంగడి కూడా ! అంటే, పరిశ్రమ, వ్యాపారమూ ఏకమయి పోయాయన్నమాట.

అసలు సమస్యకు వద్దాం. ధరల సమస్య పరిష్కారం కావాలి. ప్రమాణాలు చేసే పెద్దలంతా చక్కెరను అమ్మవలసింది 'బ్లాక్' మార్కెట్టులో కాదు ! 'వైట్' మార్కెట్టులోనే. అలా చేయని పక్షంలో ప్రభుత్వం వాళ్ళను సాధించటం తధ్యం. ఆర్థిక మంత్రి ఈ విషయమై ఏ నాడో హెచ్చరిక చేశారు.

**ఈనాడు నిజాయితీతో వ్యవహరించి తమ సత్యనిరతిని వ్యక్తీకరించుకోవలసిన బాధ్యత వర్తకుల మీద ఎంతైనా ఉంది.**

శ్రీకృష్ణ ★

# ఎక్కడ మా నెహ్రూ?

ఐపోయింది. అస్థికల నిమజ్జనం కూడా అయిపోయింది. మన ప్రియతమనాయకుని కోల్పోయామంటే ఇంకా నమ్మటానికి మనసొప్పటం లేదు. జరగదనుకున్నది జరిగిపోయింది. ఇంకా మిగిలిందల్లా మధురస్మృతులే ! ఎంతమంది ఎన్నివిధాల పొగడినా, తరగని ఆవేశంతో వింటూనే ఉంటాం. ఆయన చరిత్ర అలాంటిది. ఆయనకు శ్రద్ధాంజలి ఘటించటానికి జంట నగరాల్లో అనేక చోట్ల సమావేశాలు జరిగినాయి. జవహర్‌లాల్ నెహ్రూ, విశాల హైదరాబాద్ ప్రజలకు చిరపరిచితులే. ఎన్నోసార్లు ఇక్కడికి వారు రావటం, ప్రజలు తండోపతండాలుగా ఆయనకు ఘనస్వాగతం ఇవ్వటం అందరి కళ్ళల్లో మెదులుతూనే ఉంది. రాష్ట్రపతి రోడ్డున పండిత నెహ్రూ, కార్లో నిదానంగా వెళ్ళుతూ చిరునవ్వుతో, ముకుళిత హస్తాలతో, అశేష ప్రజానీకంయొక్క ప్రేమాభిమానాలు చూరగొన్న దృశ్యాలు, కళ్ళకు కట్టినట్టుగా కనిపిస్తూనే ఉన్నాయి. ఆయన వస్తున్నాడని తెలియగానే, విమానాశ్రయం దగ్గర్నుంచి, ముఖ్యవీధుల నిండా, బారులు తీర్చి ప్రజలు, పూలదండలు విసురుతూ ఉండేవారు. మరి ఈ నాడు కూడా ప్రజలు వేలకు వేలు, బేగంపేట విమానాశ్రయం దగ్గరకు వెళ్ళారు. ఆకాశంలోకి ఆవేశంగా చూస్తున్నారు. విమానం యెప్పుడొస్తుందా అని ఆదుర్దా వెళ్ళబుచ్చుతున్నారు. అయితే ఆ విమానంలో పండిత నెహ్రూ లేడు ! ఆయన అస్థికల పాత్ర ! ఇది తలుచుకుంటుంటేనే, గుండె బ్రద్దలయి పోతోంది. ముఖ్యమంత్రి, గవర్నరు, ఇతర ప్రముఖులు అందరూ విచ్చేసి, ఆ పాత్రను, ముఖ్య వీధులగుండా ఊరేగింపుతో, తీసుకుని వెళ్ళి, చివరకు జూబిలీహాలులో ఉంచారు. వేలకు వేలు ప్రజలు, ఆ పవిత్రమైన పాత్రను సందర్శించి, తమకున్న భక్తి, విశ్వాసాలను ప్రకటించుకున్నారు.

నిలువెత్తున, నెహ్రూ చిత్రపటంతో, ఊరేగింపు సాగిపోయింది. అస్థికల పవిత్ర పాత్రను, ముఖ్యమంత్రి తీసుకు వెళుతున్నారు. సైనిక దళాలు దారి పొడుగునా కలశానికి కాపలాగా నిల్చాయి. నాంపల్లి, నయాపూల్‌మీదుగా సంగం చేరుకొన్నారు. గవర్నరుకూడా వెంటఉన్నారు. వేలాది ప్రజలు సంగం దగ్గర గుమికూడారు. పండిత నెహ్రూ జిందాబాద్, అమర్ హై అనే నినాదాల మధ్య అస్థినిమజ్జనం జరిగిపోయింది. ఆ నాటితో, పన్నెండు రోజులపాటు

## సంగంలో అస్థికల నిమజ్జనం: రాజధాని వాసుల శ్రద్ధాంజలి!

దేశవ్యాప్తంగా, పరిగణించిన, దుఃఖభారం, శోకభావన ముగిసినాయి. ఇది కేవలం, అధికారపూర్వమైన లాంఛన మాత్రమే ! కాని భారతీయుల మనస్సుల్లో, ఇది చెప్పలేని బాధ. నెహ్రూ ఇక లేడనుకోవటంలోనే ఉంది ఆవేదన.

నిలువెత్తున ఆయన చిత్రాన్ని, వీధుల్లో వూరేగింపుతో తీసుకు వెళుతూ ఉంటే, దూరాన్నుంచి చూస్తున్న వాళ్ళకు నిజంగా నెహ్రూయే వచ్చాడా అనిపించింది. ఆయన గొంతుక ప్రతిధ్వనిస్తున్నట్లనిపిస్తోంది. నిజాం కళాశాల ఆవరణలో ఆయన ఠీవిగా నిలబడి లక్షలాది ప్రజలనుద్దేశించి గంభీరంగా ఉపన్యాసం చేసిన దృశ్యం గుర్తుకొస్తోంది. ఆయన అన్నారు ఆనాడు, "కార్లలో వెళ్ళటం ప్రగతి అభివృద్ధికి చిహ్నంకాదు. ఆ కార్లు తయారు చెయ్యటంలోనే ఉంది ప్రగతి" అని. పారిశ్రామికంగా మన దేశం అభివృద్ధి చెందాలని ఆయన కనపర్చిన తహతహ ఈ ఒక్క ముక్కలో ద్యోతకమవుతుంది. హైదరాబాదును మిగతా దేశంలో చేర్చటమయిన తర్వాత ప్రజలకు అభయమిస్తూ, వారి ప్రత్యేక సౌకర్యాలకు భంగం రాకుండా కాపాడతామన్న హామీలిస్తూ ఆయన చేసిన అలనాటి ఉపన్యాసం, విశాలాంధ్ర యేర్పడాలని ఆయన వెలుబుచ్చిన అభిప్రాయాలు చెవుల్లో గింగురుమంటూనే ఉన్నాయి.

అలాంటి వ్యక్తికి ఈ నాడు శ్రద్ధాంజలి ఘటించటానికి ఎన్నో సమావేశాలు సభలు జరిగినాయి. ప్రజలంతా చీలిపోయారు — వర్గాలుగా. రాజకీయ పార్టీలుగా, కవులుగా, కార్మికులుగా కర్షకులుగా, మహిళలుగా, మరి అందరు సభలు వేరువేరుగా జరుపుకున్నారు. దేనికి ! అందరికీ ఒకటే లక్ష్యం ! పండిత నెహ్రూకు శ్రద్ధాంజలి ఘటించటానికే ! మహమ్మదీయులందరూ తమ ఆప్తమిత్రుడు చనిపోయాడని శోకించారు. క్రైస్తవులంతా, దేవుని అనుచరుడు, మరణించాడని బాధపడ్డారు. జవహర్‌లాల్ ఒక విరాట్ స్వరూపం ! ఆయనలోనే భారతీయుల విభిన్న మతాలు, దృక్పథాలు ఇమిడి ఉన్నాయి. ఆయన వాటన్నిటికి ప్రాతినిధ్యం వహిస్తూ, ప్రతి ఒక్క వ్యక్తికి, తన యొక్క ఆత్మీయుడుగా సాక్షాత్కరిస్తూ వచ్చాడు. ఆయన జాతీయ సమైక్యతా చిహ్నం. ఈ నాడు, అందరూ ముక్త కంఠంతో విలపించటానికి అదే కారణం !

ఆంధ్రప్రదేశ్ మహిళల సంతాప సభ, గవర్నరుగారి సతీమణి శ్రీమతి పొన్నమా అధ్యక్షతన రవీంద్ర భారతిలో జరిగింది. వివిధ మహిళల సంస్థల తరపున జరిగిన ఈ సభకు, ఆయా సంస్థలకు ప్రాతినిధ్యం వహిస్తూ, ప్రముఖులు ఉపన్యాసాలు చేశారు. ఈ నాడు, భారత దేశంలో స్త్రీలకు కూడా, పురుషులతో సమానంగా అవకాశాలు, అన్ని రంగాల్లోనూ కల్పించబడ్డాయంటే, అది కేవలం పండిట్జీ యొక్క అసమానమైన కృషే అన్నారు. మహిళల పట్ల, ఆయనకు యెప్పుడూ కూడా సానుభూతి ఉందని, యెవ్వరికీ కూడా, యేవిధమైన అన్యాయం జరిగినా, సహించి, వూరుకునేవారుకారని, అందువలనే స్త్రీలకు కూడా సమాన ప్రతిపత్తి ఇవ్వటానికి, ఆయన పూనుకోవటం వలనే, ఈ నాడు మహిళలకు ఇలాంటి గౌరవప్రదమైన స్థానం భారతదేశంలో కలిగిందని, దీనివలన నెహ్రూ, మహిళల ప్రియతమ నాయకుడయ్యాడని, తమ కృతజ్ఞతలను చెప్పుకున్నారు.

బి. ఎల్. ఎన్. ★

---

### ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

**రాగం తానం పల్లవి**

కాళిదాసు గారింట్లో మాట్లాడే చిలుక<br>
కవిత్వాన్ని గ్రోలిన నిరక్షర కుక్షి !<br>
భోజరాజు పెంపకంలో భోంచేసే శునకం<br>
భూమికల్ని కాక తింటుందా కనకం ?<br>
త్యాగరాజు గారింట్లో దోమలు మాత్రం<br>
బాగా అభ్యసించాయి సంగీత శాస్త్రం.

"అమ్మాయ్! అన్నయ్య ఈ సాయంత్రం వస్తున్నాడే" అన్న వాయువ సందేశం వినగానే సునీతి ఎగిరి గంతులేసినంత పనిచేసింది. ఇంతకీ ఆ సునీతి ఎవరో అనుకోనేరు...... నేనే......ఆ సునీతిని......మరి మా అన్నయ్య...... అదీ ఒక్కగా నొక్క అన్నయ్య వస్తున్నాడూ అంటే సంతోషం కాదూ మరి......అయితే ముందు మా అన్నయ్యను మీకు పరిచయం చేయాలా? అయితే వినండి......పేరు రాజశేఖరం—బి. యి. ఆఖరి సంవత్సరం విశాఖపట్నంలో చదువుతున్నాడు. క్రిస్మస్ సెలవలకుగాను వస్తున్నట్లు 'వైర్' ఇచ్చాడు......ఇదీ సంగతి.

ఆరోజు సాయంత్రం చీకటి పడేవేళకు అన్నయ్య రావడం, తర్వాత కుశల ప్రశ్నలు వగైరా తతంగం పూర్తి కావడం జరిగిపోయింది......

ఆ మరుసటిరోజు ఉదయాన్నే......

"అన్నయ్యా, ......అన్నయ్యా" "అబ్బ! ఎంత పిలిచినా పలకడేం. ఎనిమిది కావస్తున్నా ఇంకా లేవలేదా ఏంటి?" అనుకుంటూ గబగబా మెట్లు ఎక్కి పైకి వచ్చి అన్నయ్య గదిలో అడుగు పెట్టి చూద్దునుగదా. . . . .

తదేక దీక్షతో అన్నయ్య ప్రక్క ఇంటివైపు కిటికిలోంచి చూస్తున్నాడు.

తలుపు దగ్గరే నిలబడి......అలా అన్నయ్య చూడడానిక్కి కారణమేంటా అని ఆలోచించ...... ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా తోచి చావందే!

'అన్నయ్యా' మళ్ళీ పిలిచా.

అబ్బే! లాభంలేదు! మనిషి ఈ లోకంలో ఉన్నట్లులేడు. . . . .ఇక కోపం ఆపుకోలేక భుజం మీద ఒక్క చరుపు చరుచుదామని దగ్గరకువెళ్ళి చెయ్యెత్తేటప్పటికి. . . . .ఎత్తిన చెయ్యి ఎత్తినట్టే ఉండగా......ఆశ్చర్యానికి నోరు తెరువవలసి వచ్చింది......

అసలు సంగతి......

శశి, అంటే మా కాలేజీ అమ్మాయి—ఇంకా ప్రక్కింటి అమ్మాయి అంతకంటె ముఖ్యంగా నా ప్రాణానికి రెండింతలయిన నా స్నేహితురాలు.... వాళ్ళ పెరటిలో నిలబడి విరజాజులు కోసుకూంటూంది......ఓహో! ఇదన్నమాట అబ్బాయిగారు నిర్విరామంగా తిలకించేది......పాపం ఇంకా వివరాలు ఏమి తెలియవనుకుంటాను......అపుడే చెప్పకుండా నాటక మాడదామన్న 'ఐడియా' తట్టింది! 'ఎక్స్‌క్యూజుమి డిస్టర్బ్ చేస్తున్నా' అన్నా.

ఒక్కసారి ఉలిక్కిపడి వెనక్కు తిరిగి నే నెక్కడ గ్రహించానో అని తడబడుతూ, "ఏంటి చెల్లాయ్! విశేషాలు? రాత్రి ప్రయాణ బడలికవల్ల త్వరగా నిద్రపోయా కదూ' అన్నాడు......తడబాటు కప్పిపుచ్చుకోడానికేనే ఈ ఖబుర్లు అని తెలుస్తూనే ఉంది. నేను కూడా ఏమీ తెలియనిదానిలా "అది సరేగాని అన్నాయ్! అమ్మ స్నానానికి రమ్మంటుంది ముందు అంతా పూర్తి చేసుకుని తర్వాత తీరుబడిగా మాట్లాడుకుందాంలే" అనేసి క్రిందకు వచ్చేసా!

మాకూ సెలవలే గనుక తీరుబడిగా ఆ సాయంత్రం అన్నయ్యా, నేనూ అలా కాలువగట్టుకి బయలుదేరాం......అలా ప్రశాంత వాతావరణంలో నడుస్తూంటే ఎంతో హాయిగాఉంది........

ఎప్పుడూ ప్రకృతిని వర్ణిస్తూ.....ఇంత చక్కని సృష్టిని చేసినందుకుగాను దేవుణ్ణి తెగ పొగుడుతూ ఉండే అన్నయ్య ఈసారి ఇంత మౌనంగా నడుస్తూంటే నాకే ఆశ్చర్యంగా ఉంది......అయినా సంగతి కొస్త ఊహించ కలిగాను. . . . . .

"పాపం! చాల దీర్ఘంగా ఎవరి గురించి ఆలోచిస్తున్నావు? ఆ అదృష్టవంతురాలు ఎవరో నేను తెలుసుకోకూడదా అన్నయ్యా?" ఎంత సీరియస్‌గా అడుగుదామనుకొన్నా శశి జ్ఞాపకం వచ్చేటప్పటికి నవ్వు వచ్చింది.

"అబ్బ ఊరుకోవే! మహ కనుక్కున్నావుగాని! నోరు మూసుకుని కూర్చో"

అబ్బో శృతిమించి రాగాన పడుతుంది! వ్యవహారం......ఈ మాత్రానికి అలా తిరిగివద్దామని పిలవడం ఎందుకో......కోపం వచ్చింది......కానీలే నా సహాయం అడక్కపోడులే అని మౌనంగా ఊరుకున్నా. . . . . .

ఉదయం ఎనిమిది గంటలు దాటుతూన్నా ఇంకా క్రిందకు దిగలేదు. అమ్మా, నాన్నా, నేనూ 'టిఫిన్' తినడానికని కూర్చుని అన్నయ్య వస్తాడని ఎదురు చూస్తున్నాంగాని ఇంకా రాకపోవడంతో నేనే పైకి వెళ్ళవలసి వచ్చింది. సంగతి కొస్త ముందుగానే ఊహించ కలిగాను గనుక నెమ్మదిగా తలుపుచాటునుండి తొంగిచూచా. అనుకున్నదే..... కిటికీ దగ్గరే తిష్ట........మరీ ఇంత అన్యాయమా?

నాగపూర్ ఆంధ్రవిద్యార్థి సంఘంవారు నిర్వహించినపోటీలో మూడవ బహుమతి పొందిన కథ

ఇంతకీ అవతల ఏం జరుగుతుందోనన్న కుతూహలం! ప్రక్క గదిలోకి వెళ్ళి కిటికీగుండా చూద్దునుగదా! నా కళ్ళను నేనే నమ్మలేకపోయాను...... శశి......అబ్బ......ఎంతో అమాయికంగా కన్పించే శశి కిటికి దగ్గరలో కూర్చుని ఏదో పుస్తకం చదువుతూ (అలా నటిస్తూ) మధ్య మధ్య ఇటువైపు దృష్టి సారిస్తుంది......

ఇదా సంగతి... ప్రోత్సాహం బాగానే ఉందన్నమాట!! నాకూ ఓ మాంచి కథా వస్తువు దొరుకుతుంది... ఇద్దర్నీ ఏడ్పించాలి!!

ఏమీ ఎరగనట్లు అన్నయ్య గదికి వెళ్ళి 'టిఫిన్'కి రమ్మంటూ క్రిందకు తీసుకొని వెళ్ళాను.

ఆ రోజే.....

"అన్నయా! ఈ రోజే 'అశోక్‌'లో మాంఛి పిక్చరు వచ్చింది! 'మ్యాటినీ' కి వెళ్దామా"అని అడిగా.

"అబ్బ! నాకేం పని లేదనుకున్నావా? చెల్లీ.. ఇక నిన్ను తీసుకుని బయలు దేరాలి సినిమాకి"

"అవునులే నన్నెందుకు తీసుకుని వెళ్తావు! ఆ ప్రక్కింటి అమ్మాయిని అయితే తీసుకెళ్తావుగాని"

"ఊరుకో తల్లీ నీకో దండం పెడ్తాగాని.. నాన్న వినగలరు...ఇవన్నీ ఎప్పుడు గమనించావో?"

"అవును పాపం నీవు చెప్తే గాని తెలియదు గదూ ఇంతకీ నన్ను సినిమాకి తీసుకెళ్తున్నట్లేనా?"

ఇద్దరమూ హాలు దగ్గరికి వెళ్ళేటప్పటికి శశి, వాళ్ళ చిన్న తమ్ముడు కన్పించారు. ఇక అన్నయ్య ఈ ప్రపంచంలో లేడు...

'తనెంతో అదృష్టవంతుడనని, లేకపోతే తను వచ్చినప్పుడు ఆ ప్రక్కింటి అమ్మాయి రావాలా, తన అదృష్టం కాకపోతే, అనుకుంటున్నాడు గాని నేనే శశిని వాళ్ళ తమ్ముణ్ని వెంట బెట్టుకుని రమ్మన్నానని ఏం తెలుసు? ఇంతకీ శశికి కూడా తెలియదు నేను అన్నయ్యతో వస్తానని.. అసలు నేను చెప్పిన కట్టు కథ నేను చుట్టాలింటికి వెళ్తున్నానని అక్కడినుండి తిన్నగా సినిమా హాలుకి వచ్చేస్తానని, అక్కడ కలుసుకుందామని చెప్పాను..

శశిని చూడగానే "హల్లో శశి" అంటూ దగ్గరకు వెళ్ళటంతో అన్నయ్య ఆశ్చర్యానికి అవధులు లేకపోయాయి.. "ఆ అమ్మాయితో పరిచయముందా చెల్లాయికి" అని అనుకొని ఉంటాడు.

ఇటు శశికి నామీద కోపం... చెప్పింది ఒకటి చేసింది ఒకటని కాబోలు! అయినా నా పథకం అమలు పర్చాలి కదా!

ఇద్దర్నీ ఒకరినొకరికి పరిచయం చేయాలి.

"మా అన్నయ్య రాజశేఖరం బి.ఇ. ఫైనల్"

"మా ఫ్రెండ్ శశి బి.ఏ. ఫస్ట్"

"నమస్తే"

"నమస్తే"

ఇద్దరి బిడియమూ చూస్తూంటే నవ్వు వచ్చింది. గదులనుండి కిటికీల ద్వారా చూపుల ప్రసారాలు చేసినపుడుమరి ఈ బిడియం ఎక్కడకు పోయిందో?!

టికెట్లు కొనుక్కొని లోపలికి వెళ్ళాం... సినిమా మొదలయింది.

"అన్నయ్యా! అసలు సినిమా చూడటానికి వచ్చావా? లేక.... అసలు మీతోబాటు హాల్లోకి రాకుండా ఇంటికి వెళ్ళవలసింది. నాదే బుద్ధి తక్కువ... ఇద్దరికిద్దరు ఇలా తయారయ్యి నా ప్రాణం తీస్తున్నారు. మీ కామెంటరీ కాస్త కట్టి పెట్టండి.."

"సునీ ఏంటి బాబూ మరీ అలా మాట్లాడుతావు" నెమ్మదిగా గొణిగింది శశి.

అన్నయ్య అసలు విన్నాడో లేక జవాబివ్వకూడదనుకున్నాడో గాని ఏమీ మాట్లాడలేదు..

సినిమా కంటే వీళ్ళిద్దరి 'ఫార్స్' బాగుంది అనుకున్నా.. ఆ పిక్చరు గురించి ఒకటే విమర్శలు ప్రారంభించారు....

సినిమా అయి పోయింది.. గాని వాళ్ళు కబుర్లలో పడి ఇదేమీ గుర్తించినట్లు లేరు....

ఇక నవ్వు ఆపుకో లేక గట్టిగా నవ్వేసా... ఒక్కసారి ఉలిక్కిపడి అటు ఇటూ చూచి హాలు ఖాళీ అయ్యిందని గ్రహించుకున్నారు...

"ఇక లేవండి! లేకపోతే ఫస్ట్ షో కూడా చూద్దామనుకుంటున్నారా?"

ఆ రాత్రి ఇద్దరికీ నిద్ర పట్టి ఉండదనీ.. మరీ ముఖ్యంగా అన్నయ్యకి గ్యారంటీగా చెప్ప గల్ను.

ఎందుకంటే .... ఆ మరునటి రోజు ప్రొద్దున 9 గంటలు అవుతున్నా అన్నయ్య ఇంకా నిద్రావస్థలోనే ఉన్నాడు. నాన్నగారు కోప్పడ్డంతో లేపుదామని వెళ్ళా.

"అన్నయ్యా లే అన్నయ్యా తొమ్మిది అయి పోయింది!"

ఎంతకూ లేవడే ఖర్మ...

"ఏమండోయి రాజశేఖరంగారూ కాస్త లేస్తారా" నిద్ర దులుపుకొని ఉలిక్కిపడిలేచాడు..

పాపం శశి పిలుస్తున్నట్లు కలగని ఉంటాడేమో.

# విరిసిన విరజాజులు

నేను కనబడేటప్పటికి ఉసూరుమన్పించింది—అలవాటు ప్రకారం కిటికీ వైపు దృష్టి సారించి .. ఫలితం లేక పోగా మరీ నీరు కారి పోయి.. ఆ విసుగంతా నా మీద కనబరుస్తూ "ఏంటీ కొంపలంటుకు పోయినట్లు అరుస్తున్నావని?" తిట్టుకుంటూ 'బాత్‌రూం' కి బయలు దేరాడు అన్నయ్య.

ఆ రోజు సాయంత్రం గంటన్నర మేకప్ అయిన తర్వాత... అన్నయ్య నా దగ్గరకు వచ్చి "చెల్లీ నేనలా బజారు వైపు వెళ్తున్నా.. నీకేమన్నా కావాలా"

ఓహో ఎప్పుడూ లేంది క్రొత్తగా అడుగు తున్నాడే.. అంచమన్న మాట అనుకొని పైకి:

"అన్నయ్యా! ఓ జార్జెట్టు చీర కావాలి. ఎంత కాలంనుంచో ఆశగా ఉంది" అన్నా.

పాపం.. కళ్ళు తేలవేసి ఏదో అనబోయేలోగా,

"వట్టిదేలే.. ఎందుకంత భయపడతావు... ఏమీ అక్కర్లేదు కాని నీ ప్లాన్ పాపం నాకు తెలియదను కుంటున్నావా నాయనా వెళ్ళిరా! నీవు కోరినట్లుగానే శశిని ఈ సాయంత్రం అయిదు గంటలకు రమ్మని చెప్పి వచ్చా... తప్పక వస్తానంది."

అన్నయ్య మొహం వెలిగి పోయింది.

అన్నయ్యకు నాకూ ఇంత సన్నిహితత్వం చూస్తే ఆశ్చర్యంగానే ఉండొచ్చు గాని దానికి కారణం ఉంది. ఇంట్లో అమ్మ నాన్న, నేను అన్నయ్య తప్ప ఇంకెవరూ లేరు.. ఇక కబుర్లు చెప్పుకోవాలంటే చిన్నప్పటి నుండి మేమిద్దరమే ఉన్నాము. అదే విధంగా అన్నా చెల్లెళ్ళ కంటే ఎక్కువగా స్నేహితుల్లా, సరదాగా కబుర్లు చెప్పుకొనే వాళ్ళం ... అందుకనే అన్నయ్య అంటే నాకు భయంకంటే ప్రేమా, అభిమానమూను!

ఎక్కడికయినా వెళ్తే రాత్రి ఏడున్నరకు గాని రాని అన్నయ్య ఆ రోజు అయిదు గంటలకే వచ్చేసాడు. అదీ పూల పొట్లంతో సహా..

"అన్నయ్యా ఈ మధ్య క్రొత్త అలవాట్లు అబ్బు తున్నాయే! పువ్వులు తెమ్మని ఎన్ని సార్లు చెప్పినా మర్చి పోయేవాడివి.. ఈ సారి అడగకుండానే తెచ్చావే"

"ఆ... కనిపిస్తే కొనాలన్పించింది కొన్నా"

పొట్లం విప్పి చూస్తే రెండు విరజాజి దండలు న్నాయి....

"ఇదా సంగతి. శశికి విరజాజులు యిష్టమని పట్టుకొచ్చావు కదూ! అవునులే! నా యిష్టాయిష్టా లతో నీకేం? రెండూ శశికే యిద్దువుగానిలే! గాని యింతకీ నీ శ్రమ దండుగ శశి రావడం లేదు.." ఏడ్పించాలని అన్నా ఇక అన్నయ్య మొహం చూడాలి ట్రాజెడి సినిమా ఆఖరు సీనులోని 'హీరో' గుర్తుకు వచ్చాడు.

అదే సమయానికి శశి అడుగు పెట్టింది.

ముగ్గురమూ కలిసి పైకి వెళ్ళి అన్నయ్య గదిలో కూర్చున్నాము. ఇక నా ఉనికిని కూడ గమనించకుండ కబుర్లలోకి దిగారు... నిజం చెప్పొద్దూ నాకు భలే చిరాకేసింది "శశి నాతో మాట్లాడడానికా—లేక కేవలం మా అన్నయ్యతో మాట్లాడడానికేనా నీవు వస్తు!"

రాజకీయాలు, సినిమావార్తలు, కాలేజీ చదువులతో ఇలా సాగుతున్నాయి వాళ్ళ సంభాషణలు.. నేను అక్కడ కూర్చున్నందుకు గాను ప్రొముక్కుబడిలా అప్పుడప్పుడూ నాతో మాట్లాడారు... అంతే..

నా హెచ్చరిక అదీ పది సార్లు చేయగా ఇక చీకటి

పడి పోతుందన్న సంగతి గమనించి "అరే! ఎంత త్వరగా సమయం గడిచి పోయిందే" అనుకుంటూ ఇద్దరూ ఒకరినొకరు చూచుకున్నారు!

"వెళ్ళి వస్తానండీ" అంటూ శశి వెళ్ళి పోయింది. ఉదయం లేస్తూనే "సొపాల్ పహళే ముఝే తుంసే ప్యార్ థా"

అన్నయ్య గదినుండి కూనిరాగం విన్పిస్తుంది. ఆశ్చర్యం... హిందీ పాటలంటే ఇష్టం లేని (అసలు సంగతి అర్థం కాక) అన్నయ్య ఆ పాట పాడుతున్నాడంటే (పాడడమేంటో గాని ఖూని అంటే బాగుంటుంది) క్రితం రోజు శశి మాటల సందర్భంలో తనకు హిందీ పాటలు ఇష్టమని చెప్పడమే కారణం!

'ఎక్సలెంట్' అంటూ అన్నయ్య గదిలో అడుగు పెట్టా— పాట తక్కున ఆగింది.

'నాయనా! నీ ప్రావీణ్యతకు మెచ్చాంగాని ఆ తప్పుడు రాగాలు కట్టబెట్టి కాస్త రక్షించు బాబూ మమ్మల్ని"

ఇక ఆ రోజు 'ఇంగ్లీష్' పాటలకు బదులు దాదాపు దినమంతా హిందీ పాటలే వచ్చాయి మా రేడియోలో. కథ మహా జోరుగా నడుస్తూందే....

ఇక చెప్పాలంటే ఇటువంటి విశేషాలు ఆ పదిహేను రోజుల్లో ఎన్నో జరిగాయి!

సెలవలు అయిపోవడంతో అన్నయ్య దిగాలు పడి పోయాడు.. ఇల్లు వదలలేక వెళ్తున్నట్లు... అసలు సంగతి శశిని వదలలేక..

ఇక శశి సంగతీ అలాగే ఉంది...

అన్నయ్య వూరికెళ్ళిన మూడు రోజులకే నాకో ఉత్తరం వ్రాసాడు. ఎన్నడూ లేంది ఇంత ప్రత్యేకంగా నాకు.. అదీ వెళ్ళిన మూడు రోజులకే ఉత్తరం రావటం అంటే ఎలా ఉంటుంది? అయినా నా అనుమానం దృఢం అయ్యింది. ఉత్తరం అంతా శశి గురించే ... పాపం శశికి వ్రాసే ధైర్యం లేక ఇలా సతమత మవుతున్నాడా అన్నాయ్! శశి అభిప్రాయమేంటో నేను కనుక్కొని వ్రాయాలట! బాగుంది.. పిరికి వేషం..

శశి కూడ నన్ను అడగడానికి తటపటాయిస్తూనే "మీ అన్నయ్య నీకు ఉత్తరం వ్రాశారా మరి" అని అడిగింది.

"ఏమ్మా తల్లీ ఎప్పుడూలేంది ఇంత శ్రద్ధగా ఆరాలు తీస్తున్నావు? కొంపదీసి ఏమయినా...... ఆ......జాడ్యం పట్టుకుందేంటి?" ఎగతాళి చేసా.

"పోదూ! నీకంతా అలాగే ఉంటుంది" బుంగ మూతి పెట్టింది.

"అహ పాపం అలాగా అయితే ఉత్తరం వచ్చింది చూపించమంటావా? అంతా తమరి గురించేలే!"

"నాకేం అక్కర్లే! నీ ఉత్తరం నా కెందుకు?" కోపం ప్రకటించింది శశి.

"ఏం నీకు వ్రాయలేదనా ఈ కోపం—మరి అమ్మాయిగారి అనుజ్ఞ అయితే ఇంక అన్నయ్య కేనా అభ్యంతరం?" ఆరాలుతీసి దాని మనస్సు కనుక్కోగలిగా......

"అబ్బ వూరుకుందూ! అన్నీ నీకే కావాలి" నవ్వు దాచుకోడానికి ప్రయత్నిస్తూ అంది...... గాని దాని కళ్ళల్లోని అర్థం ఇట్టే గ్రహించుకున్నా.....

అన్నయ్యకు టూకీగా విషయాలన్నీ వ్రాశా...... నాలుగు రోజులు తిరగకముందే ఇంకో ఉత్తరం అన్నయ్య దగ్గిరినుండి వచ్చింది. విప్పిచూస్తే నా కవరులో ఇంకొక కవరు. . . . ఇంకెవరికి? పెద్ద సస్పెన్స్ మీకుకాని, నాకుకాని లేదనుకోండి.

శశి ఇంటికి ఏదో వంకపెట్టుకుని వెళ్ళి నెమ్మదిగా కవరు అందించాను.

ఇక దాని మొహం చూడాలి. సిగ్గుతో కందిపోయింది......అక్కడనుండి పరుగెత్తుకొని తన గదిలోకిపోయి తలుపు వేసుకుంది......

"హారనీ ఆఖర్కి నన్ను కూడ మర్చిపోయి— అక్కడే వదిలేసి పారిపోయిందే......చివర్కి నేనే నన్నుమాట పరాయి దాన్నవుతా......

నవ్వుకుంటూ ఇంటికి వచ్చేసా!

మరి తర్వాత కథ ఎలా జరుగుతుందోనని కని పెడ్తున్న నాకు ఏమీ తెలియలేదు!!

"జవాబిచ్చావా" శశిని అడిగా.

"వూ" అంది అంతే!

ఏంటీ అమ్మాయి అపుడే ఇలా తయారయ్యింది! అపుడే సరభ్యాసమా? ఇంతకీ చూద్దాం అన్నయ్య రిప్లై నా చేతిలో పడదా అనుకున్నా కాని ఎన్ని రోజులయినా ఆ జాడ కనబడలేదు......

---

అతను : బుక్కింగు క్లార్కు గారూ! మీరు చిల్లర యివ్వటంలో పొరబాటు యిచ్చారండీ ?

బు. క్లార్కు: ఏయ్! టిక్కట్టు తీసుకున్నప్పుడు చూచుకోలేక పోయావా! యిప్పుడు వీలు లేదు. వెళ్లు. వెళ్లు.

అతను : అయితే పోతానండీ! యీ వేళ పావలా డబ్బులు మిగిలాయనుకొంటూ.

గాలిబీబి (పొన్నూరు)

---

శశి చెప్తుందిలే అసలు విషయం అనుకుంటే లాభం శూన్యం అయ్యింది. అపుడే గుంభనంగా తయ్యారింది......ఎంత యిటు 'ఫ్రెండ్'నయినా అటు చెల్లినయినా నాతో అంత 'ఫ్రీగా' ఎలా చెప్తారులే! కాస్త 'సీక్రెసీ ఎండ్ ప్రైవెసీ' ఉండాలి గాబోలు ప్రేమికులకు!!

అయినా వూరుకొనే రకాన్నా! ఆరా తీసా! కరెస్పాండెన్స్ ఎలా సాగుతూందోనని!! ప్రేక్టికల్స్ వల్ల ఈమధ్య శశిని—సరిగ్గా కలుసుకోలేకపోయా! ఆఖర్కి పట్టేసా......

శశి క్లాసుమేటు మరి ఫ్రెండూ అయిన జయ హాస్టల్లో ఉంటుంది. ఆ అమ్మాయికి ఏం కల్లబొల్లి ఖబుర్లు చెప్పిందోగాని ఆ అమ్మాయి కేరాఫ్‌ని నడుస్తుంది కథంతా......

అదీ ఎలా పట్టగలిగానంటే......

ఓ రోజు మా క్లాసుమేటు భారతిని కలుసుకుందామని హాస్టల్‌కి వెళ్ళాను. సరిగ్గా అదే సమయానికి 'పోస్ట్‌మేన్' రావడంతో హాస్టల్ అమ్మాయిలంతా 'లెటరు బోర్డు' మీద ఉత్తరాల కోసం సిద్ధంగా ఉన్నారు.....భారతి అక్కడే ఉండడంతో నేనూ అక్కడికే వెళ్ళా. జయ కూడ అక్కడే ఉంది. సరిగ్గా జయ ఏదో కవరు తీసుకోబోయే టప్పటికి ఆ కవరుమీద వ్రాతను సులభంగా పోల్చుకోగలిగాను. అన్నయ్య చేతివ్రాత......అదీగాక శశిపేరు కేరాఫ్ జయ అని ఉండడంతో నా కింకా ఏ అనుమానమూ మిగలలేదు......

కాస్సేపు అయిన తర్వాత ఏమీ తెలియని దానిలా జయ 'రూమ్'కి వెళ్ళి "జయా! శశికేదయినా ఉత్తరం వచ్చిందా? ఎక్స్‌పెక్ట్ చేస్తున్నానంది?" వచ్చిందని జయ సమాధానం విని......

"అయితే ఇలా ఇవ్వు తనకు ఒంట్లో బాగో లేక ఈరోజు కాలేజీకి రావడంలేదు. ఇంటికి వెళ్ళి నపుడు ఇచ్చేస్తాను" అన్నా.

మేమిద్దరమూ గాఢ స్నేహితులమని జయకు తెలుసు గనుక మాట్లాడకుండా ఇచ్చేసింది.

ఇంతవరకూ సవ్యంగానే జరిగిపోయింది కదా అనుకున్నా......

కాలేజి గేటు కన్పించేలా చెట్టుక్రింద స్థలం చూచుకుని శశికోసం ...... ఎలుకకోసం పిల్లిలా......కుందేలుకోసం సింహంలా ఎదురు చూస్తున్నా......

శశి రావడం గమనించా.....

"శశీ......శశీ" పిలిచా.... వచ్చింది.

"ఏమండీ తమరి దర్శనం ఈ మధ్య మరీ కరువైపోయింది ...... అంతరాచ కార్యాలేంవెలగబెడుతున్నారో తెలుసుకోవచ్చా"

"మొదలు పెట్టడమే ముష్టి యుద్ధంలా ఉందే" అంది ఏదో పెద్ద విట్టులా.

"అది సరేగాని మర్చిపోయావే అనుకో.....పాపం, మా అన్నయ్యను అన్యాయం చేస్తున్నావే?"

ఏమీ మాట్లాడకుండా మౌనం దాల్చింది వంగనాచిలా......

"శశీ! ఈరోజు నీకోటి తెచ్చా కావాలా?" అన్నా.

"ఏంటి?"

"చెప్పుకోచూద్దాం?"

"ఏమో బాబు నాకెలా తెలుస్తుంది?"

"అవును! మరి చాల అమాయకురాలివిగా!"

"అబ్బ! విసిగించక చెబ్దూ!"

పుస్తకంలో పెట్టిన కవరు తీసి చూపా......

దానిమొహం రంగులు మారిపోతూంది...... కనీసం నాకు కవిత్వం వచ్చినా ఆ ఘట్టంమీద ఓ పద్యం వ్రాసిపారెద్దును.

ఆఖరికి ఆశ్చర్యం వగైరా. . . . . ల నుండి తేరుకుని "ఎలా వచ్చింది నీ చేతికి?" అంటూ కవరు లాక్కుంది. . . . సంగతంతా వివరించా....

ఉత్తరం చదువుకోడం పూర్తయిన తర్వాత అసలు సంగతి చెప్పింది......

వీళ్ళిద్దరూ కలసి తమాషాచేసి నన్ను ఆశ్చర్య పరుద్దామనుకున్నారట......అసలు సంగతి—వాగుడు పిట్టనుకదా ఇక్కడ ఇంట్లో చెప్పేస్తానని భయపడ్డారో......మొత్తానికి వాళ్ళ సంగతి పట్టేసా.... వీళ్ళనే ఆడించి చూడాలన్న ఉబలాటం!!

38వ పేజీ చూడండి

# వనితాలోకం 'ప్రత్యేక వ్యాసావళి'లో ఆరవ వ్యాసం




కావ్యనాయికలలోని లక్షణాలన్నీ 'ఆవిడ'లో వున్నాయి. పొడుగు, పొడవుకు తగిన లావూ అందుకు తగిన అవయవ సౌష్ఠవం, తెల్లని శరీరచ్ఛాయ, వీటన్నింటికీ తగిన ముఖమూ, మంచి కళ్లు, చక్కటి ముక్కు కూడా వుండటమే ఆవిడ ప్రత్యేకత.

సాధారణంగా స్త్రీలలో అంత అందమూ, వర్చస్సు కలిగి ఉండేవారు బహు కొద్ది మందే ఉంటారని పించింది నాకాక్షణంలో. కానీ ఆవిడనాకు దగ్గరగా వస్తువృకొద్దీ, ఏదో చెప్పలేని బాధ వన్నావే శించింది.

అంత చక్కటి విగ్రహమూ, మరింత అందంగా కన్పించాలనే తాపత్రయంతో, చేసుకున్న విపరీత అలంకరణవల్ల, సహజ సౌందర్యాన్ని కోల్పోయిందని పించింది! తెల్లటి ముఖాన్ని, మరింత తెల్లగా చేస్తూ పౌడర్, చెంపలు లేత గులాబీ రంగులో మెరవటానికి రోజ్ పౌడర్, ఇవి రెండూ చాలవన్నట్లు కనబడ్తూ పెదవులకు లిప్‌స్టిక్!

చటుక్కున చూస్తే ఏ సినిమా తారో, లేక నాటకంలో వేషం వేసుకున్న వ్యక్తో, మేకప్ తీసెయ్యకుండా వచ్చినట్లుందా అలంకరణ. అంతవరకూ ఆవిడ సౌందర్యానికి ముగ్ధురాలినైపోతున్న నాకు ఆ కృత్రిమ అలంకరణ పైపైనేగాక, ఆవిడమీద కూడా చిరాకు కలిగింది. ఒక్కసారిగా ఆలోచనలు పరిపరి విధాలుగా పరుగులెట్టాయి.

అనాదినుంచి భారతీయ సంస్కృతీ సంప్రదాయాలలో, స్త్రీల అందానికీ, అలంకరణకు ప్రత్యేకత, గౌరవమూ ఉండనే ఉంది. ఆ కాలంలో స్త్రీలు తమ అందాన్ని ఇనుమడింపజేయటానికి, మరికొన్ని కృత్రిమ సౌందర్య సాధనాలు ఉపయోగించేవారు. కానీ అవన్నీ వారి అందాన్ని పెంపొందింపడమే కాకుండా, సహజత్వానికి భిన్నంగా కన్పించేవి కావు. గోళ్లకు గోరంటాకు, కాళ్లకు పారాణి, (అత్తుక) శరీరానికి చందనపు మైపూత, కళ్లకు కాటుక, నుదుట ఎర్రని సింధూరం (కుంకుమ) లేక తిలకం మొదలైవి ఆనాటి స్త్రీల అలంకరణ సాధనాలు. వాటిల్లో, అన్నీ వాడకున్నా ముఖ్యంగా బొట్టు, కాటుక స్త్రీలకు అలంకరణలేగాక, పవిత్రతా చిహ్నలుగా కూడా నిలిచిపోయాయి.

కాలం మారింది. మనుషులూ, మనస్తత్వాలతో బాటు నాగరికతా, ఫాషన్లూ. నాగరికతా ప్రభావం మాత్రం మనల్నింకా వదల్లేదు. ముఖ్యంగా స్త్రీల అలంకరణలో పాశ్చాత్య నాగరికతా ప్రభావం చాలా ఎక్కువగానే పడిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

గోరంటాకు, పారాణి వగైరాలు మరుగునపడి వాటిస్థానే నెయిల్ పాలిష్, ఫేస్ పౌడరు (రకరకాల టాల్కమ్ పౌడర్లు) రోజ్ పౌడరు, లిప్‌స్టిక్, ఇంకా కనుబొమ్మలకు రంగు వగైరా రకరకాల కృత్రిమ సౌందర్య సాధనాలు వచ్చాయి.

## పౌడర్ మానేయడం ఛాందసమా?

పౌడర్ వేసుకోని వనితలంటూ ఈ రోజుల్లో ఉన్నారంటే, వాళ్లు ఎవరో ఛాందసులుగానూ, అలంకరణను గురించి, అందాన్ని గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోనివారుగానూ పరిగణింపబడుతున్నారు. వయసు మీరిన వృద్ధ స్త్రీల దగ్గర్నుంచి, పుట్టిన పాపల వరకూ, పౌడర్ వాడబడుతోంది. కానీ శరీరపు రంగుకు కలిసిపోయేలా, పౌడర్ ఉపయోగిస్తే, నిజంగానే అందం కొంత ఎక్కువవటమే కాకుండా, చెమట బారినుంచి కూడా కొంతవరకూ రక్షిస్తుంది. ఇక కాటుకను గురించి ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. ఎంత చిన్న కళ్లున్న వాళ్లయినా కాటుక చక్కగా పెట్టుకుంటే (అంటే కంటి కొనల దగ్గర్నుంచీ కణత వరకూ లాగకుండా, కనుబొమలతో కలపకుండా, పొందికగా) కళ్లు విశాలమై, అందాన్నిస్తాయి. "కాటుక కంటినీరు చనుకట్టుపయింపబడనేల ఏడ్చెదో!" అనే పద్యంవల్ల, దేవతా స్త్రీలు కూడా కాటుక వాడేవారని మనకు తెలుస్తోంది.

ఎటొచ్చీ, వచ్చిన చిక్కల్లా, పౌడర్, కాటుకా, వగైరా కృత్రిమ సౌందర్య సాధనాలు వాడగా, పెదవులకు లిప్‌స్టిక్ వాడితే ఏం? అంటూ లిప్‌స్టిక్ కూడా విపరీతంగా వాడుతున్నారు వనితలు కొందరు. "స్త్రీలకు దొండపండులాంటి పెదవులు అందం, లేక అందానికి చిహ్నమని" అందరికీ తెలిసిన విషయమే! కానీ ఈ కృత్రిమంగా తయారుచేసుకుంటున్న ఎర్రటి పెదవులు, లక్కతో చేసిన దొండపండ్లలాటి పెదవుల్ని మాత్రమే చూపుతున్నాయనేది చాలామంది గుర్తించటంలేదు. ఈ లిప్‌స్టిక్‌లలో రెండు రకాలు ఉన్నాయి. ఒక రకం కాస్త లేత ఎరుపు, రెండో రకం ఎర్రని ఎరుపు. పెదవులకు సహజంగా ఉండే దానికంటే మరింత ఎరుపుదనం తేవాలనే తాపత్రయంతో లిప్‌స్టిక్ వాడతారు.

సిటీలలో, టౌన్లలో, (ఇంకా పల్లెటూళ్లకు ప్రాకలేదు.) ఉద్యోగం చేసే వనితలూ, సొసైటీలో చలాకీగా తిరిగే స్త్రీలూ, మరికొందరు ఇళ్లలోనే ఉండే మహిళలూ కూడా, చాలామంది లిప్‌స్టిక్ వాడుతున్నారు.

ఎవరో బ్రిటిష్‌రాజుగారి కొకాయనకు మెడ నొప్పెట్టిందట. రాజుగారి మెడ చుట్టూ, అందంగా కట్టు కట్టారట రాజవైద్యులు. అదే కాలాంతరంలో "నెక్ టై"గా మారి ఇప్పుడు మన దేశంలో చాలా మంది పురుషుల మెడల చుట్టూరా, ఉరి త్రాడులా వ్రేలాడుతోంది! లిప్‌స్టిక్‌కు అలాటి కథే నామటుకు నాకు కారణంగా కనిపిస్తుంది.

సీతల ప్రదేశంలో చలి ఎక్కువగా ఉండటం వల్లనో, లేక కొందరి శరీరతత్వం వల్లనో, కొందరికి పెదవులు పగిలి, ఆ పగిలిన చోట చర్మం లేచి పోయి, ఒక్కోసారి వల్లగా పుండు పడుతుంది. ఆ పగుళ్ల ఉపశమనానికిగాను ఏ ఆయింట్‌మెంటో వాడుతూ, మెల్లిగా అదీ మారిపోయి రంగు మార్చుకుని 'లిప్‌స్టిక్'గా తయారయి, ఎర్రగా పెదవులు కన్పించేందుకు, అందానికీ, అలంకరణకూ, సాధనంగా రూపాంతరం చెంది ఉండొచ్చునని తోస్తుంది నాకు. దీనికి ఆధారాలంటూ ఏమీ లేవు. కేవలం నా ఊహే! కానీ ఎలాగైతేనేం మొత్తానికి లిప్‌స్టిక్ స్త్రీల సౌందర్య సాధనాలలో ఒకటిగా ప్రముఖ స్థానం వహించిందీ రోజుల్లో.

సహజంగా శరీరపు వర్ణాన్నిబట్టి పెదవులు కూడా ఉంటాయి. తెల్లగా లేక, పచ్చగా, లేక గోధుమ గులాబిరంగు శరీరచ్ఛాయగలవారికి స్వతస్సిద్ధంగానే పెదవులు ఎర్రగా (అంటే ఎవ్వరికీ డేంజర్ లైట్ల రంగులో పెదవులుండవు.) ఉంటాయి. శరీరపు ఛాయ తగ్గే కొద్దీ పెదవుల రంగుకూడా తగ్గి ఉంటుంది. అలాంటప్పుడు లేని అందాన్ని కల్పించాలనే ఉద్దేశ్యంతో లిప్‌స్టిక్ వేసుకుంటే, శరీరపు వర్ణంతో కలవని ఆ ఎరుపుదనం, అనవ్యాన్నే కల్గించటమే కాకుండా, అక్కడేదో అతికించినట్లు అనాకారిత్వాన్నికూడా ప్రసాదిస్తుంటుం దొక్కొక్కసారి.

ఈ పాశ్చాత్య కృత్రిమ సౌందర్య సాధనాలు ఎక్కువయ్యే కొద్దీ, మన స్వదేశ సహజ సౌందర్య సాధనాలు రానురాను మరుగునపడి పోతున్నాయి. బాబ్‌డ్ హేర్‌తో, లిప్‌స్టిక్, పౌడర్స్ (రోజ్ పౌడర్, ఫేస్ పౌడరూ) వేసుకుని, ఇక కళ్లకు కాటుక, నుదుట బొట్టు (బొట్టు పెట్టుకునేవారిసంగతినే వ్రాస్తూంట) ఫాషన్ కాదని మానేస్తున్నారు కొందరు స్త్రీలు. చక్కగా స్త్రీ పరిపూర్ణత్వానికీ అందానికి ఉదహారణలుగా ఉండే కేశ సంపదను, చేతులారా కత్తిరించుకోవటమే అనుచితమైన పని. అది చాలదన్నట్టు బొట్టు, కాటుక మానెయ్యటంతో, ఎన్ని రంగులు వేసుకున్నా, ఎంత పౌడరు పూసుకుని, అలంకరణలో ఎంత ప్రత్యేకత శ్రద్ధ చూపినా, ఆ అందానికి, అలంకరణకూ పరిపూర్ణత్వం సిద్ధించటంలేదు.సరిగదా,ఎబ్బెట్టుగా, ఏదో వెలితిగాకూడా కన్పిస్తుంటుంది.

ముందు నేను ఉదహరించినఆవిడ చూడండి. కాటుకలేని ఆ కళ్లు ఎంత చక్కగా ఉన్నా, ఏదో బోసిగా ఉన్నాయి. దానికి తోడు లిప్‌స్టిక్ వేసుకున్న ఆ పెదాలు విడిపడ్డప్పుడల్లా, ఆమె మాటల్లో, నవ్వుల్లో పెదవుల కదలికలో సహజత్వం లోపించి, ఏదో తెలియని కృత్రిమత్వం నిండి ఉన్నట్లు నాకే కాదు, చూపరులెవరికేనా ఇట్టే తోస్తుంది. అంత చక్కటి మనిషి ఈ కృత్రిమ అలంకరణ సాధనాలతో, సహజ సౌందర్యాన్ని కోల్పోయిందికూడా.

ఇక రోజ్ పౌడర్, కనుబొమ్మలకు రంగు వాడే వారు, ఒక్కసారి తమనుతాము అద్దంలో పరీక్షగా చూచుకోవటం మంచిది. స్త్రీలు ఎక్కువగా సిగ్గుపడినపుడు, 'చెంపల్లో కెంపులు పూయుటం' వగైరా ఉపమానాలు కవులు వారి కళాత్మక హృదయంలో వూహించి చెబుతారు. అలాగని అస్తమానూ చెంపలు ఎరుపెక్కేంతటి సిగ్గు ఏ స్త్రీకి కలగదు. అలాంటప్పుడు ప్రత్యేకంగా చెంపలు ఎర్రగా (లేత గులాబి రంగులో) కన్పించాలనే ఉద్దేశ్యం ఎందుకు? అందుకీ కృత్రిమ ప్రయత్నం ఎందుకు?

ఇలా పైచెప్పిన రకరకాల రంగులతో అందాన్ని పోగొట్టుకుని, పగటి వేషాలలా తయారవుతున్నారు కొందరు. ఇంతరవకూ చదివి, పాశ్చాత్య విధానాలు మంచివే. బహుశా నేను పాశ్చాత్యులు అలంకరణలనూ వారి అలంకరణ సాధనాలనూ, సౌందర్యాన్ని పెంపొందించుకోవటానికి వారు కనిపెట్టిన నూతన విధానాలనూ నేను పూర్తిగా నిరసిస్తున్నాననీ, వ్యతిరేకిస్తున్నానని, చాలామంది వనితలు అపార్థం చేసుకుంటారేమో! వివరంగా చెబుతాను. ఏకాలంలో అయినా, ఏ స్త్రీకయినా, అందానికి తగిన అలంకరణలేనిదే రాణింపు ఉండదు. పాశ్చాత్యులు ఈ అలంకరణ విషయంలో చాలా శ్రద్ధ చూపుతారు. అంతవరకూ బావుంది.

కానీ వచ్చిన చిక్కల్లా, పాశ్చాత్యులను గుడ్డిగా అనుకరించటమే మన తప్పు. వారి వేష భాష, సాంప్రదాయాలకు తగ్గట్లు, వారు గౌన్లు వేసుకు, జుట్టు మెడలవరకూ రానివ్వరు. అలాగని మనంకూడా గౌన్లు వేసుకొనగలమా? వేసుకుంటే మనకు నప్పుతుందా? పూర్తిగా వారిని అనుసరించలేక, అనుసరించాలనే తాపత్రయంతో, చీరెలు కట్టుకుంటూ జుట్టు కత్తిరించుకుని, చేతుల్లేని జాకెట్లు వేసుకుని, ముఖం నిండా రంగులు పులుముకున్న కొందరు స్త్రీలు లేకపోలేదు. కాని ఇంత వికృతం చేసుకున్నా, వారు పాశ్చాత్య మహిళల సౌందర్యంలో, వారికి నప్పిన ఆ వేష భాషలలో వెయ్యో వంతుకూడా, స్వంతం చేసుకోలేక పోతున్నారు. కారణం పులిని చూచి నక్క వాతలు పెట్టుకోవటమే!

పాశ్చాత్యుల పద్ధతులలో, అనుకరణ యోగ్యమైనవి మాత్రమే మనం అనుసరించాలి. పౌడర్ తగు మోతాదులో వాడితే తప్పులేదు. అదయినా విపరీతంగా రాచుకుంటే ఉన్న అందం పోతుంది. చెమట పట్టి చిరాకు కలుగకుండా ఉపయోగిస్తుంది పౌడర్. అల్లాగే నెయిల్ పాలిష్ (గోళ్లకు రంగు) వల్ల అట్టే నష్టమూ, లాభమూకూడా లేవు. కానీ రోజ్ పౌడర్, లిప్‌స్టిక్, కనుబొమ్మల రంగు వగైరా ఇతర కృత్రిమ సౌందర్య సాధనాలతో ఉన్న అందం చెడుతుంది. సినిమా తారలు, నాటకాలలో నటించే నటీనటులు మొదలైనవారు, ప్రత్యేకంగా ప్రేక్షకులందరికీ తమ అందాన్ని ప్రదర్శించాల్సిన అగత్యం ఉన్నందువల్ల, వాళ్లు రంగులు వాడటంలో అర్థం ఉంది. కానీ మామూలు స్త్రీలు (ఉద్యోగాలు చేసేవారు కానిండి, మామూలు గృహిణులు కానిండి, ఎవరైనా సరే) పై రంగులు వాడి, నిజానికి అందాన్ని చేజేతులా పాడుచేసుకుంటూన్నారనే నా ఉద్దేశ్యం.

ముఖాన్నిబట్టి, మనిషి మనస్తత్వాన్ని అంచనా వేసే మన భారతదేశంలో, మన సంస్కృతీ సంప్రదాయాలకు ఎక్కువ భిన్నంకాని అలంకరణకే గౌరవమూ, మన్ననా లభిస్తాయి. చక్కగా బొట్టు కాటుక పెట్టుకుని, (పౌడర్ మితిమించకుండా రాచుకున్నా పర్వాలేదు) జుట్టు తగిన రీతిలో జడో, చుట్టో వేసుకున్న స్త్రీలపై కలిగే గౌరవ భావం, లిప్‌స్టిక్ వేసుకున్న వనితను చూచినప్పుడు కలగదనటంలో సందేహం లేదు. అంతేకాదు, అంతగా పెదవులు ఎర్రగా కన్పించాలని తాపత్రయపడే స్త్రీలు, తాంబూలం వేసుకుని నోరూ, పళ్లూ శుభ్రం చేసుకుని ఆ తర్వాత బయటికివెడితే, సహజంగా కల్గిన పెదవుల ఎర్రదనం, జుగుప్సనూ, తగ్గు భావాన్నీ చూచే



వ్యాసరచయిత్రి శ్రీమతి వనని.నిర్మల ప్రబావతి మొగిలిచర్లలో జన్మించారు ఒంగోలులో విద్యాభ్యాసం చేశారు. 1954 లో వివాహం అయింది. ప్రస్తుతం ఇద్దరు మగపిల్లలు, ఒక ఆడపిల్ల; చిన్ననాటనే లభించిన తండ్రిగారి ప్రోత్సాహమూ, వివాహానంతరం లభించిన శ్రీవారి సహకారమూ కలిసి ప్రభావతిగారి రచనా వ్యాసంగానికి దోహదమిచ్చాయి. "గృహిణిగా నా కర్తవ్యాన్ని నిర్వర్తించుకుంటూ నాభర్తతో గ్రామీణ అభివృద్ధి కార్యక్రమాల్లో పాల్గొంటూ వుంటాను. పత్రికలకు కథలు, వ్యాసాలూ తీరిక సమయాల్లో వ్రాస్తుంటాను" అనే వీరు మా పాఠకులకు పరిచితులే.

వారికి కళ్గరవము వెరికదా, అందాన్ని వెరవా-డిస్తుంది కూడా. ఇక రోజ్ పౌడర్. కనుబొమ్మలకు రంగూ వగైరాలు పూర్తిగా నిషేధించడమే మంచిది.

ఏదేలా ఉన్నా, మన సాంప్రదాయాలకూ, సంస్కృతికీ, వాతావరణానికీ అతికే అలంకరణ, అందాన్నీ, ఆహ్లాదాన్నీ కలిగిస్తుంది. గుడ్డిగా అనుకరించే అలంకరణలు, అందంకంటే అనాకారిత్వాన్ని,

## వనితాలోకం

ఆసహ్యాన్ని రేకెత్తిస్తాయి. అంతటితో ఆగక, గౌరవ భావాన్నికూడా తగ్గిస్తాయి. అందుకనే, నేటి నవ నాగరిక స్త్రీలు అలంకరణ విషయంలో, గుడ్డిగా పాశ్చాత్యులనూ, వారి సౌందర్య కృతిమ సాధనాలనూ ఉపయోగించి, అనుకరించటం మాని సహజ సౌందర్యానికి కొద్దిగా మెరుగులు దిద్దుకునే ఏర్పాటు చేసుకోవటం, అందుకుపకరించే కృత్రిమ సౌందర్య సాధనాలను మాత్రం ఉపయోగించటం శ్రేయస్కరమూ, గౌరవ ప్రదమే కాకుండా, నేటి మన దేశ క్షేమం దృష్ట్యాకూడా, అనుస మార్గమని, నా అభిప్రాయం.....ఏమం





## జరిగిన కథ

అదృష్టం వున్నా, ఆనందానికి నోచుకోని వృద్ధ మూర్తి సుబ్బయ్య. బదిలీ అయిన వ్యవసాయ డెమాన్‌స్ట్రేటర్ రామారావుకు వాళ్లయింట్లో గది అద్దెకు దొరుకుతుంది. విపరీత పరిస్థితుల్లో తారసపడిన ప్రసాద్‌ను దుర్గయ్య ఆదరిస్తాడు. అనుకోకుండా అతనికి విమల, కమలలతో పరిచయం మౌతుంది. రామారావు గీసిన చిత్రాలను విమల మెచ్చుకొంటుంది. కమలను చూచిన ప్రసాద్, ఆమెమీదనే తన దృష్టిని లగ్నం చేస్తాడు.

గ్రీన్ రూములో మనుష్యులు ఎక్కువవడం వల్ల, ప్రసాద్ కమలా ఒక మూలకు చేరి సంభా షిస్తున్నారు. గిరిబాబుగారు మరొకవైపు పచారు చేస్తున్నారు. కాని, ప్రసాద్ కమల మీద చూపిస్తున్న శ్రద్ధ ఆయనకు నచ్చలేదు. వాళ్లు అంత సరదాగా ఉండడం, ఆమె అతనితో మాట్లాడుతున్నప్పుడు ఆమె మొహంలో కన్పించే వెలుగూ, అలాగు ఆమె యందు కన్పరుస్తున్న అనురాగ దృక్కులూ ఆయనను చాలా కలవర పడేట్లు చేస్తున్నాయి. మరొక మూల కొంత మంది విద్యార్థులు మేకప్ చేసుకుంటూ సరదాగా ఛలోక్తులు విసురుకుంటు న్నారు.

బయట మీటింగులో ప్రేక్షకుల కోలాహలం హెచ్చుగా ఉంది. హెడ్మాస్టారి రిపోర్టు అవుతూంటే, అందరికీ మీటింగు ఎప్పుడు పూర్తవుతుందా ? ప్రదర్శన లెప్పుడు ప్రారంభ మవుతాయా ? అని ఆతృతగా ఉంది. వాళ్లల్లో వాళ్లు మాట్లాడు కోవడం ఎక్కువైంది. వెనక బెంచీలలో చేరిన కుర్రాళ్లు ఎలా అల్లరి చేద్దామా ? అని ఆలోచిస్తూ, టీచర్లమీద తమ అభిప్రాయాల్ని విరోధా మాటంగా వ్యక్తపరుస్తూ, హెడ్మాష్టరుగారు చదువుతున్న రిపోర్టు మీద తమ అనుమానాల్ని, అపనమ్మకాల్ని బయట పెడుతూ చెప్పుకుంటున్నారు. అప్పుడప్పుడు టీచర్లు ఆయివైపు చూస్తూంటే మట్టుకు నిశ్శబ్దాన్ని పాటిస్తున్నారు.

ఆటల పోటీలలో గెలుపొందిన వారికి బహుమతి లిచ్చినప్పుడు మాత్రం మళ్లీ అందరికీ కొంత ఆసక్తి కలిగింది. ఒక్కొక్కరి పేరే చదువుతూ, వారికి బహుమానాలిస్తూంటే, ప్రతి విద్యార్థీ బహుమతి స్వీకరించడానికి వెళ్తున్నప్పుడూ అందరూ చప్పట్లు కొట్టడం, ఆ విద్యార్థి స్టేజి ఎక్కాక సోమనాథంగారతనికి సబ్బుపెట్టెగాని, పుస్తకం గాని, అద్దంగానీ, మరేదైనా వస్తువుగాని ఇస్తే స్వీకరించి, నమస్కరించి దిగిరావడం. మళ్లీ "చెడుగుడూ— విన్నర్సు— అయిదవ ఫారం జట్టు" అని టీచరు అనడం, ఆ కెప్టెన్ వస్తూంటే— ఢ్లాప్ ఢ్లాప్—ఢ్లాప్—అన్న శబ్దంతో పిల్లలంతా చప్పట్లు కొడుతూంటే, అతను స్టేజి ఎక్కి బహుమతిని స్వీకరించి రావడం, మళ్లీ టీచరు "చెడుగుడూ రన్నర్సు— ఆరవఫారం జట్టు"

# మీ చర్మానికి తగినది

# నివియా




# ఇదే మీ చర్మానికి కావలసినది

నివియా క్రీమ్‌లో "యుసిరైట్" — అద్వితీయమైన, సహజ ప్రకృతి పదార్థము వంటిది ఉన్నది. రోజూ స్నానం వల్లను, ఎండ, వాన, గాలిలో తిరుగుచుండుట వల్లను గోల్పోవునట్టి మీ చర్మమందలి చమురులను అది సమకూర్చుతుంది. నివియా మీ చర్మాన్ని మృదువుగాను, యౌవనయుతమైన ఆరోగ్యవంతంగాను వుంచుతుంది. మీ చర్మానికి వాడదగినది. నివియా. ఇప్పుడే!

నివియా - వివిధోపయుక్తమైన క్రీమ్.




Lintas C-248-TEL

ఇండియాలో సోల్ డిస్ట్రిబ్యూటర్లు. జె. ఎల్. మారిసన్, సన్ & జోన్స్ (ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్, పోస్టు బాక్సు నెం. 1746, బొంబాయి-1

# మనసున మల్లెలు

అని అరవడం, మళ్లీ చప్పట్లూ ఈ విధంగా కొంతసేపు హంగామా జరిగింది.

గ్రీన్‌రూములో కమలతో ప్రసాద్ దీర్ఘ సంభాషణ చేస్తూండగా నృత్య ప్రదర్శనకు సిద్ధమైన బాలికలు వచ్చి "అక్కయ్యా, మీటింగు అయిపోయిందని" చెప్పారు. బయట మైకులో, ప్రదర్శనలు ప్రారంభమవుతాయనీ, మొట్టమొదట శ్రీ నటశేఖర గిరిబాబుగారి— దుర్యోధన ఏకపాత్రాభినయం— ఉంటుందని చెప్పారు. అదే సమయంలో ఒక బాలిక వచ్చి, కమలను, తన కాలి గజ్జెలు చాలా బిగుతుగా ఉన్నాయనీ, త్రాడు ముడి విప్పి కొంచెం వదులు చెయ్యమనీ, తను ప్రయత్నిస్తే ఆ ముడి విడలేదని చెప్పింది.

కమల ఆ ముడితో చాలాసేపు ప్రయత్నించి తంటాలు పడిందిగాని లాభం లేక పోయింది. ఆమె దృష్టి అక్కడ బల్లమీద ఉన్న చిన్న బ్లేడు మీద పడింది. ఆ త్రాడు కోసేస్తే మంచిదని పించింది.

గిరిబాబుగారు, ప్రసాద్‌ను తీసుకుని వెళ్లి స్టేజియొక్క ప్రక్క తెరలలో ప్రవేశించారు. ప్రసాద్‌కు, తనకు ప్రాంప్టింగ్ ఎలా ఇవ్వాలో ఆఖరుసారి చెప్పి, ప్రసాద్ పుస్తకం చేతిలో పట్టుకొని ప్రక్క తెరలలో నిలబడి ఉండగా, రంగస్థలం యొక్క తెరలాగమని సన్న చేశారు. తెర తియ్యగా రాజరాజుయొక్క ఠీవితో రంగస్థలం మీద ప్రవేశించారు.

చాలా మందికి, దుర్యోధన ఏకపాత్రాభినయం ఎలా ఉంటుందో తెలిసిన సంగతే. అది చాలా సమాసాలతో, కఠిన పదాలతో కూడి ఉంటుంది. విశ్వకర్మ నిర్మించిన మయ సభలో చిత్ర విచిత్రాలు అమర్చబడి ఉంటాయి. దుర్యోధనుడు ఆ సభను చూసి, పాండవులకు ఇంత మంచి సభ ఉందికదా అని ఈర్ష్యాసూయల్లో మగ్గిపోతాడు. నీళ్లు లేని చోట నీరుఉన్నట్లూ, ద్వారం లేనిచోట ద్వారం ఉన్నట్లూ భ్రాంతిని కల్పించేట్లున్న చోటులలో దుర్యోధనుడు ఆ భ్రాంతికి లోనై పాంచాలి చేత పరిహసింపబడతాడు. ఆ పరిహాసం అతనిలో క్రోధ జ్వాలను రెచ్చగొట్టుంది. పాంచాలినీ, పాండవులనూ ఎలాగైనా పరాభవించాలని నిశ్చయించుకుంటాడు. ఈ నటన అంతా ఈ ఏకపాత్రాభినయంలో చూపించాలి. గిరిబాబుగారు రంగస్థలం మీదకు ప్రవేశిస్తూనే ప్రేక్షకుల వంక ఒకసారి చూశారు. ఆయన అప్పటికి అనేక రంగస్థలాలు ఎక్కి ఉన్నప్పటికీ స్టేజి మీదకు వచ్చిన కొద్ది నిముషాల వరకూ ఒక విధమైన 'కొత్త' ననుభవిస్తారు.

ఒకసారి ప్రేక్షకులనందరినీ ఆయన కలయజూచారు. వెనక బెంచీలలోని అల్లరి కుర్రాళ్లకు, ఇంతసేపూ అల్లరిచేసే అవకాశం తక్కువ. ఎందువల్లనంటే టీచర్లూ, హెడ్మాస్టరూ తమని బాగా కనిపెట్టుంటారు మీటింగులో, కాని, ప్రదర్శనలలో అంత పట్టింపు ఉండదు. కాబట్టి వాళ్లు, తమకు దొరికిన స్వేచ్ఛను ఎప్పుడు సద్వినియోగం చేద్దామా ? అని కాచుకొన్నారు.

రెండుసార్లు రంగస్థలం అంతా పచారు చేశారు. 'ఆయన నోటివెంట ఏం మాట వస్తుందా ?' అని జనం ఎదురు చూస్తున్నారు. మూడు నిముషాలు గడిచింది. దుర్యోధనుడు తన పోర్షను ప్రారంభించి నటించడానికి బదులు, మాటిమాటికీ ప్రక్క తెరలోకి చూడడం చూసేసరికి ప్రజలకు చిరాకనిపించింది. ఎంత మహా రాజయినా, కాస్త నోరువిప్పి మాటాడకూడదా ? అని నొచ్చుకున్నారు ప్రేక్షకులు. అంతేగాని గిరిబాబుగారు ఏ అవస్థలో ఉన్నారో వారికి తెలియదు.

ఆయన ఎన్నిసార్లు ప్రక్క తెరలవైపు చూసినా ఆయనకు ప్రసాద్ కన్పించలేదు. అంటే 'ప్రాంప్టరు' పుస్తకంతో సహా ఉడాయించాడన్న మాట. ఎంత దురవస్థ ! అందులోనూ మొదటి వాక్యాలు ఆయనకి ఎంత గింజుకున్నా జ్ఞాపకం రాలేదు. అప్పటికీ ఒకసారి ప్రక్క తెరల వద్దకు వచ్చి "ప్రసాద్" అని పిల్చారు. గాని, అక్కడెవరూ లేరు. మళ్లీ వెంటనే రంగస్థలం మీదకు వచ్చారు. అప్పుడే ఆయన అవస్థ గ్రహించిన, వెనక బెంచీ కుర్రాళ్లు "ప్రాంప్టర్" "ప్రాంప్టర్" అని అరవడం మొదలెట్టి, అంతా ఒక్కసారి ఘొల్లు మని నవ్వారు.

ఇహ వూరుకుని లాభం లేదని గిరిబాబుగారు గ్రహించారు. ఏ కారణం వల్లనో ప్రసాద్ అదృశ్యుడయ్యాడు. తను 'ప్రాంప్టింగ్' లేకుండానే తన కార్యక్రమం నడిపించాలి. అలా అనుకోగానే, ఒక్కసారి హఠాత్తుగా ఆయన బుర్ర చురుకుగా పని చెయ్యనారంభించింది. తనకు తోచిన వాక్యాలనెయ్యడం ప్రారంభించారు. ప్రజలు శ్రద్ధగా వినసాగారు. గిరిబాబుగారి నటనలో భావాలు సహజంగా రావడం మొదలెట్టాయి. ఆనాడు దుర్యోధనుడు పాండవుల మీద మండి పడ్డాడు. ఈనాడు ఈ దుర్యోధనుడు 'ప్రాంప్టరు' మీద మంటతో ఉడికి పోతున్నాడు. పాంచాలీ పరాభవకృత పరిహాసానికి ఆ కౌరవ సార్వభౌముడు ఎంత బాధ పడ్డాడో, ఈ ఈ రంగస్థల సార్వభౌముడు, ప్రాంప్టరు తనను హఠాత్తుగా వదిలి అదృశ్యుడైనందుకు విపరీతంగా బాధ పడ్డాడు., పాండవుల సంపదను చూసి ఆ రారాజు ఏవిధంగా అసూయ జ్వాలలలో దగ్ధ మనస్కుడయ్యాడో, అదే విధంగా అందమైన కమల యొక్క స్నేహాన్ని అతి సులభంగా సంపాదించిన ప్రసాద్ యొక్క అదృష్టానికి ఈ నటక శిఖామణి అసూయతో క్రుంగి పోసాగాడు. అందువల్ల కోపం, అవమానం, అసూయా అనే భావాలు, గిరిబాబుగారి నటనలో సహజంగా ప్రతి ఫలించాయి. ప్రేక్షకులు రెండుసార్లు చప్పట్లు కొట్టడం కూడా జరిగింది. చివరికి పాండవుల మీద దుర్యోధనుడు ప్రతీకారం సాధించాలని ఏ విధంగా నిర్ణయానికి వచ్చాడో, అదే విధంగా గిరిబాబు గారి మనసులో, ప్రసాద్‌పై ప్రతీకారం తీర్చుకోవాలనే వాంఛ గిరిబాబుగారికి ఉదయించక పోలేదు. చివరికి ఆయన అభినయం ముగియడం, తెర లాగడం, జరిగి ఆయన గ్రీన్ రూములోకి, వెళ్లేసరికి ప్రసాద్ కనిపించాడు.

"సారీ, గిరిబాబు గారూ ! ఆమె వ్రేలు తెగడం వల్ల డ్రెస్సింగ్ చేస్తూ వుండి పోయాము, పాపం చాలా ధైర్యం కల వ్యక్తి. తన వల్ల ప్రోగ్రాము ఆగి



"ఈ లోకంలో నన్నర్థంచేసుకొనే వారేరీరా?...."
"పిచ్చాసుపత్రి వుంది బ్రదర్!"

[illegible], చిరునవ్వుతో బాధనంతా మోస్తోంది. ఆమెకు సాయం చెయ్యాలి. వస్తా " అని కమలతో కలిసి రంగస్థలం మీదకు, ప్రక్క తెరలలోకి వెళ్ళి పోయాడు.

అసలు జరిగిన విషయ మేమిటంటే, సరిగ్గా గిరి బాబుగారు రంగస్థలం ఎక్కిన వేళకు, కమల తన వేలు బ్లేడుతో కోసుకుని " అబ్బ ! " అనుకుంటూ గ్రీన్ రూము బయటికి వచ్చింది. అది చూసిన ప్రసాద్, ఆమెకు ఏదో పెద్ద అపద జరిగిందని గ్రీన్ రూము వద్దకు పరిగెత్తాడు. వెంటనే ఆమె వ్రేలు నుంచి కారిపోతున్న రక్త ప్రవాహం చూసి, "అరెరె!" అంటూ అయిడిన్ కోసం, బేండేజి కోసం పరిగెత్తాడు. ఆమె వేలు కోసుకుందని తెలిసి, రవి కుమార్ విమలా కూడా గ్రీన్ రూములోకి పరిగెత్తు కొచ్చారు. " ఏం జరిగింది ? " " ఏం జరిగింది ? " " అయ్యో ! ఎంత రక్తమో ! " అని ఖంగారు పడ సాగారు. వాళ్ళను తోసుకుంటూ, ఒక చేతిలో అయిడిన్ సీసా, మరొక చేతిలో కాటన్, బేండేజ్ వగైరాలతో ప్రసాద్ వచ్చి, "ఏదీ మీ చెయ్యి ఇలా తేండి." అని ఆమె కోమల హస్తాన్ని తన చేతిలోకి తీసుకుని, ' స్వాబ్ ' తో అయిడిన్ రాసి, ఆమె బాధకు ' ఉస్సు ' అని అంటూంటే, "ఫరవాలేదు. కొంచెం ఓర్చుకుంటే తగ్గిపోతుంది" అని ధైర్యం చెప్తూ, ఆమె వేలి చుట్టూ బేండేజి కట్టేసి. "ఇహ భయం లేదు" అన్నాడు. కాని మరి రెండు నిముషాలు ఆమె చెయ్యి, అతని చేతిలో వున్నాక, విమల " ఇహ బేండేజి కట్టడం అయిందిగా." అన్న తరువాత కమల తన చెయ్యి తీసేసుకుంది. అప్పుడామె బుగ్గలు ఎరుపెక్కాయి.

" ఇప్పుడు ప్రోగ్రాం ఎలా జరుగుతుంది ? " అని అడిగాడు రవి కుమార్.

"నొప్పి తగ్గింది. ఫరవాలేదు. పాడగల్ను " అంది కమల.

" అయన బాండేజి కట్టారుగా. ఇహనొప్పి వుండదులే " అంది విమల.

" అయితే నేను వస్తా." అని రవికుమార్ వెళ్ళి పోయాడు.

" నన్నుండమంటావా ? " అంది విమల. "ఫరవాలేదక్కయ్యా. నువ్వు ఆడియన్సులో కూచో" అంది కమల. విమల వెళ్ళిపోయింది.

కుమారి కమల నిర్వహణలో స్కూలు బాలికల

# మనసున మల్లెలు

చేత పంచవర్ష ప్రణాళికా నృత్యం జరుగుతుందని మైకు ద్వారా ప్రకటించగానే జనం అంతా నిశ్శబ్దంగా రంగస్థలం వైపు ఆతృతగా ఎదురు చూడ సాగారు. కమల ప్రక్క తెరలలో నుల్చుంది. మైకు ఆమెవద్ద వుంచారు. తెర మీద నాలుగు బారులుగా ఆడపిల్లలు నిలబడ్డారు. నేపథ్యంలో కమల పాడుతూండగా, రంగస్థలం మీద పిల్లలు అభినయం చేస్తారన్నమాట. కమల ప్రక్కనే ఆమెకు ప్రోత్సాహమిస్తూ ప్రసాద్ నిలబడ్డాడు. ఆమె పాట ప్రారంభించగానే తెర లాగారు.

పిల్లలు అభినయం ప్రారంభించారు. ఈ నృత్యంలో దేశంలో అభ్యుదయం, ప్రగతి ఎలా సాగిపోతున్నాయో, ప్రజలు వుత్సాహంతో అభ్యుదయ రథాన్ని ఎలా ముందుకు తోస్తున్నారో, గొప్ప గొప్ప పథకాలు ఎలా అమలు పరచబడి ప్రజానీకానికి నవజీవన నిర్మాణానికి తోడ్పడుతున్నాయో, దేశంలో ఈ ప్రణాళికల ద్వారా నిరుద్యోగం, లంచగొండితనం మొదలైనవన్నీ ఎలా నిర్మూలింప బడి, గ్రామ పునర్నిర్మాణం ఎలా జరుగుతుందో వివరింప బడుతాయి. తగిన క్రమ శిక్షణతో, స్కూలు బాలికలు, ఈ నృత్యాన్ని చక్కగా చెయ్యడం, మధురమైన కంఠంతో కమల నేపథ్య గానం చెయ్యడం, ప్రేక్షకులు విపరీతంగా మెచ్చుకోవడం మొదలెట్టారు.

ఈ ప్రదర్శన జరుగుతున్న సమయంలో, ముందు వరుసలలో కూర్చున్న సుబ్బయ్య గారికి, ప్రక్క తెరలు బాగా కన్పిస్తూండడం వలన, కమల మైకు వద్ద నుల్చొని పాడడం కన్పిస్తోంది. ఆమె ప్రక్కన నిల్చున్న క్రొత్త యువకుడు కూడా ఆయన కంట పడ్డాడు. అతను కమలను తెగ మెచ్చుకోవడం, ఆమె కూడా అతనితో సరదాగా మాట్లాడడం కూడా ఆయన కంట పడింది. మొదట అతను క్రొత్తగా వచ్చిన స్కూలు టీచరేమో ? నను కున్నారు. కాని అతను స్కూలు టీచరులా లేడు. అతనెవరైనదీ తరువాత కనుక్కుందామనుకున్నారు.

నృత్య ప్రదర్శన విజయవంతంగా ముగియగానే ప్రేక్షకుల హర్షధ్వనాల మధ్య, హెడ్మిస్ట్రెసుగారు నృత్యం చేసిన బాలికలలో ఇద్దరు బాలికలకు బహుమతి లిస్తామనీ, కుమారి కమలకు వెండి కప్పు ఇస్తున్నామనీ ప్రకటించారు. కమలా, బాలికలూ గ్రీన్ రూములోకి వచ్చేశారు. ప్రసాద్ ఆమెను తెగపొగడడం, ఆమె చిరునవ్వు నవ్వడం గమనించిన గిరిబాబుకు, వేషం తీసేసినా, దుర్యోధనుడి భావాలు లాంటి భావాలే మనసులో పరిగెట్ట సాగాయి.

రంగస్థలం మీద విద్యార్థులు ఒక నాటిక ప్రదర్శిస్తుండగా, కమల బాలికలను తమ తరువాతి కార్యక్రమమైన భరతమాత (టాబ్లో) కు తయారు చేయసాగింది. ఇందులో ఒకొక్క ప్రాంతానికి సంబంధించిన దుస్తులు వేసుకుని ఒక్కొక్క బాలిక కన్పిస్తుంది. గుజరాత్, పంజాబ్, తమిళ, ఆంధ్ర, కర్నాటక, కేరళ, బెంగాల్, ఒరియా, అస్సాము, మహారాష్ట్ర మొదలగు వివిధ ప్రాంతాల దుస్తులను ధరించిన విద్యార్థినులు భరతమాతను స్తుతిస్తున్నట్లు కన్పిస్తారు. వెనుకగా హిందూ దేశపు ఆకారం, అందులో త్రివర్ణ పతాక, భరతమాతల్లా ఒక స్త్రీ నుంచోడం మొదలైనవన్నీ ఉంటాయి.

నాటిక కాగానే, ప్రసాద్, రవికుమార్, కమలా కలిసి గబగబ రంగస్థలాన్ని సిద్ధం చేసారు. రంగు రంగుల బల్బులతో హిందూ దేశపు పటం, చరఖా చక్రం తిరుగుతున్నట్లూ, ఏర్పాటు చేశారు. తెర తియ్యగానే ప్రేక్షకులు తమకు కనిపించిన దృశ్యం చూసి చాలా ఆనందించారు.

తరువాత కమలకూ, బాలికలకూ బహుమతీ ప్రదానం జరిగింది. జనగణమన అయ్యాక కమల, విమలా, రవికుమార్‌లతో వెళ్ళిపోయే ముందు, ప్రసాద్ ఆమెను మర్నాడు తప్పక కలుస్తానని చెప్పాడు. మొత్తానికి వార్షికోత్సవ ప్రదర్శనలు బాగున్నాయని అంతా మెచ్చుకున్నారు. ప్రసాద్‌కూ, కమలకూ వీటివల్ల మరింత సన్నిహితత్వం ఏర్పడింది.

## 6

వార్షికోత్సవం జరిగిన తరువాత ఒక పదిహేను రోజులు గడిచాయి గాని, సుబ్బయ్యగారు రోజా కమలను, ఆ కొత్త యువకుడెవరో అడుగుదామనుకుంటూనే మర్చిపోతున్నారు. ఆయనకు రోజా సాయంకాలం పూట, కమలా, ప్రసాద్ కొద్ది సేపు కలుసుకుని మాట్లాడుతున్నారని తెలియదు. అప్పుడే ప్రసాద్ తన మొదటి ప్రేమలేఖని కమలకు అందజేశాడనీ, ఆ లేఖను ఆమె రాత్రంతా పద్నిసారు చదువుకుందనీ, దానికి ఒక తియ్యని జవాబు తయారు చేసే ప్రయత్నంలో ఉందనీ కూడా ఎంతమాత్రమూ తెలియదు.

ఆ రోజు ప్రొద్దున్నే కాఫీ, టిఫిన్, కానిచ్చి, బట్టలు వేసుకుని బయటకు వచ్చాడు రవికుమార్. పుట్టిన రోజు కావటం వల్ల, అవాళ అతన్ని తలంటు పోసుకోడానికి రమ్మంటోంది విమల. ఇంట్లో విందుకు అంతా సన్నద్ధం అవుతోంది. రామారావుని తమ ఇంటికి భోజనానికి పిలవాలని నిశ్చయించి, సుబ్బయ్యగారు మెల్లిగా అతను ఉంటున్న మేడమీదికి ప్రవేశించారు. తలుపు తోసుకుని గదిలోకి ప్రవేశించారు.

అప్పుడే హిందీ పుస్తకం, చదువుదామని తీసిన రామారావు దానిని టేబిల్‌మీద పెట్టి, సుబ్బయ్యగారిని లోపలికి రమ్మని ఆహ్వానించాడు. ఆయన వచ్చి కుర్చీ మీద కూర్చుని, "ఇవాళ మా అబ్బాయి పుట్టిన రోజు. అందుకని మీరు మా ఇంట్లో



భోజనం చెయ్యాలి" అన్నారు సుబ్బయ్యగారు. ఆయన తన యందు చూపిస్తున్న వాత్సల్యానికి రామారావుకి చాలా సంతోషం కలిగింది. "అలాగే" అన్నాడు.

"మీరు మంచి చిత్రకారులని తెలిసింది. చిత్ర కళ మీరు నేర్చుకున్నారా ? లేక స్వయంగా అభి వృద్ధి చేశారా ?" అని అడిగారు సుబ్బయ్యగారు.

"ఎక్కడా నేర్చుకోలేదండి. ఏదో సరదాకి గీస్తూ, గీస్తూనే అభ్యాసం చేశాను. ఏమంత చెప్పుకోవలసింది కాదులెండి."

"నాకు ఈ కళల గురించి అంతగా తెలియదు కాని, మా పిల్లలకు అన్నీ తెలుసు. వాళ్ళు ఎప్పుడూ మీ చిత్రాల్ని పొగుడ్తూంటారు."

"అదంతా వాళ్ల సహృదయత. అసలు ఇలాంటి పల్లెటూరులో, ఇంత సంస్కారం, విజ్ఞానం ఉన్న కుటుంబాన్ని చూడగల్గుతానని నే నెన్నటికీ అనుకోలేదు. అన్ని రంగాలలోనూ మీరు చాలా పురోగాములు."

"మీరన్నట్లు మా కుటుంబంలో ఉన్న సరదాలు అన్నీ ఇన్నీ కాదు. ఆడపిల్లల్ని చదివించావని నా మీద మా బంధువులందరికీ గుర్రు. మా పెద్ద మ్మాయి విమల చాలా తెలివైనది. ఇంట్లో వూరికే కూచోడం ఎందుకని వరుసగా హిందీ పరిక్షలకు కట్టి పాసవడం మొదలెట్టింది. అదికాక ఇప్పుడు ప్రయివేటుగా మెట్రిక్ పరిక్షకు కట్టాలని చూస్తోంది. మా చిన్నమ్మాయి కాలేజీ చదువుతానని పట్టు బట్టింది కాని, మంచి పెళ్లి సంబంధం ఒకటి కలిసివచ్చే సూచనలు కన్పించటం వల్ల మరి చదివించ దల్చుగోలేదు. మా అబ్బా యికి ఫొటోగ్రఫీ అంటే చాలా ఇష్టం. బొంబాయి వెళ్లి నేర్చుకుంటానంటాడు. కాని నాకు వ్యాపారానికి తోడు కావాలని ఉంచేశాను."

"అవును మరి మీ వ్యాపారం బాగా అభివృద్ధిలో ఉంది కాబట్టి ఒక్కరూ చూసుకోవడం కష్టం." అన్నాడు రామారావు. అతనికి సుబ్బయ్యగారితో మాట్లాడడం అంటే సరదా. ఎందుకంటే ఆయన మంచి కబుర్ల పోగు, ఎప్పటెప్పటి విషయాలు చెప్తూంటారు. అందులో వ్యాపారం గురించి ప్రసక్తి వచ్చిందో, ఇహ గత పాతికేళ్ల రామనగరం చరిత్రంతా కళ్లకు కట్టినట్లు చెప్తారు.

"ఇప్పుడు అభివృద్ధిలో ఉన్నమాట నిజమే. కాని ఒకప్పుడు నేనెన్ని కష్టాలు పడ్డానో, ఎలా పనిచేశానో మీరెరుగరు. మొట్ట మొదట ఒక చిన్న కంపెనీలో గుమాస్తాగా ఉండేవాణ్ణి. వూరూరా తిరిగి సరుకులు — ఖరీదు చేస్తూండేవాణ్ణి. ఆ రోజుల్లో కిరసనాయిలు వాడటం జనానికి తెలియదు. ఆయిల్ కంపెనీలు కొత్తగా వచ్చాయి. మేము పల్లెటూళ్ళకి వెళ్లి ప్రజలకు కిరసనాయిలు వాడటం నేర్పుతూండేవాళ్లం. నేను నాలుగేళ్లు గుమాస్తాగా పనిచేశాక యజమానితో మాట పట్టింపు వచ్చి ఉద్యోగం మానేశాను. రెండు రోజులు రోడ్ల వెంట నిద్రాహారాలు లేక పిచ్చివాడిలా తిరిగాను. మళ్లీ ఉద్యోగంలో జేరడం ఇష్టం లేదు. స్వంత వ్యాపారం చెయ్యాలని ఉద్దేశం. కాని డబ్బులేదు. మూడోనాడు రైల్వే స్టేషనులో కూర్చొని మాస్టరుగారితో మాట్లాడుతూ

45 వ పేజీ చూడండి

## 26-6-1964 శుక్రవారము మొదలు 2-7-1964 గురువారము వరకు

### మేషం :

(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)

గడచిన కొద్ది వారాలకంటే ఈ వారం బాగా ఉంటుంది. ఇంతవరకు ఆర్థికంగా ఉన్న ఇబ్బంది చాల వరకు తీరిపోతుంది. వారం మధ్యలో వ్యాపారంలో అనుకూలత యేర్పడి లాభిస్తుంది. వృత్తి ఉద్యోగాల్లో కూడా బాగా ఉంటుంది. మీ ఆలోచనలు, అభిప్రాయాలు అధికారుల ఆమోదాన్ని పొందుతాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో జయం లభించగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఇదివరకటి కంటే బాగా ఉన్నా ముఖ్యకార్యక్రమాలు ఇంకా నెరవేరలేక పోవచ్చును. సాహిత్య వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణించుటకు తగిన అవకాశం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

### వృషభం :

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

ఈ వారం సామాన్యంగా ఉంటుంది. వ్యాపారంలో క్రమాభివృద్ధిని సాధిస్తారు. ప్రతి వ్యవహారమూ ఆదర్శవంతంగా నిర్వహించడానికి ప్రయత్నం చేయడం వలన మీరు ప్రయాసలకు సర్దుకపోవడం మంచిది. అధికారులతో అభిప్రాయ భేదాలు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు బలహీనత చేయవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో ఇంకా కుదురుపాటు ఉండదు. ప్రయాణం ద్వారా కార్యసాధన జరుగవచ్చును. బంధు వ్యవహారాలు మీరు శ్రమపడి ఒకదారికి తెచ్చినా చివరకు నిష్ఫూరమే లభించవచ్చును. సత్పురుషుల పరిచయం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు. కుటుంబ కార్యక్రమాల్లో కార్యభారం పెరుగుతుంది.

### మిధునం :

(మృగశిర 3. 4 పా ఆరుద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

వృత్తి వ్యాపారాల్లో యెన్నో అవకాశాలు కన్పిస్తూ ఉంటాయి కాని ఫలితం పూర్తిగా చేతికి చిక్కే వరకూ దేనినీ నమ్మడానికి నిలుతేదు. వ్యాపారంలో స్వల్పంగా ఆదాయం పెరగవచ్చును. కాని సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. అధికారులవలన జరుగవలసిన పనులు నెరవేరి లాభం కలుగుతుంది. వృత్తి ఉద్యోగాలు సామాన్యంగా ఉంటాయి. వారం ప్రారంభంలో ఆరోగ్యం అంతబాగా ఉండదు. రాజకీయ వ్యవహారాల్లో ప్రతి పక్షాల మధ్య కొన్ని చీలికలు రావడం వలన మీ అభివృద్ధికి అవకాశం

| మీ | మే | వృ | మి |
|---|---|---|---|
| | గు | కు | ర బు శు రా |
| ● | వారఫలం మహేష్ | | |
| | | | |
| చం కే | | | |

లభిస్తుంది. శుభమూలంగా ధన వ్యయం జరుగుతుంది. 29, 30 తేదీల్లో గౌరవం, సంతోషం.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. సాంఘిక కార్యక్రమాలు సంతృప్తికరంగా ఉంటాయి. అలంకార వస్తువులు కొంటారు.

### కర్కాటకం :

(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)

నమ్మినవారే కొంతమంది మిమ్మల్ని మోసం చేయడం వలన మీవారెవరో పైవారెవరో తెలిసికొనలేని పరిస్థితి యేర్పడుతుంది. మీకు రాబోయే సహాయాన్ని నమ్మి వాగ్దానాలు చేయడం మంచిది కాదు. సులభంగా నెరవేరే వ్యవహారాలకు కూడా అనవసరంగా వ్యయం చేయవలసి వస్తుంది. వ్యాపారం సామాన్యంగా ఉంటుంది. వృత్తి ఉద్యోగాలు గత వారంలోకంటే బాగా ఉంటాయి. అన్ని వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా సాగిపోతాయి. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. వారాంతంలో మానసికాందోళన కలుగుతుంది. బంధువుల వ్యవహారాల్లో విజయాన్ని సాధిస్తారు. పుణ్యకార్యాలు చేస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో ఉన్న చిక్కులు తొలగిపోతాయి.

### సింహం :

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

గ్రహ బలం అనుకూలంగా ఉంది. మీ ఆశయాలు కార్యరూపాన్ని ధరిస్తాయి. వ్యాపారం బాగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. నూతన వ్యాపారాల్లో ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. వృత్తిలో కొత్తవారితో పరిచయం కలుగుతుంది. దానివల్ల భవిష్యత్తులో ప్రయోజనం ఉంటుంది. ఉద్యోగంలో మీరు కోరే మార్పుల కోసం ప్రయత్నం చేయడానికి మంచి సమయం. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో మార్పులు రావు. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వచ్చే సూచనలు ఉన్నాయి. అన్ని విధాలా అనుకూలమైన సమయం. వారాంతంలో ప్రేమ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం అంత బాగా ఉండదు. కుటుంబ వ్యవహారాలు క్రమంగా చక్కబడతాయి. సాంఘిక కార్యక్రమాల్లో వ్యయం జరుగుతుంది.

### ఈ వారము ధరలు

ధాన్యం ధర కొంచెం తగ్గవచ్చును. అపరాల ధరలు వారం ప్రారంభంలో కొంచెం పెరిగి వారం ఆఖరున తగ్గుతాయి. బెల్లంధర పెరుగుతుంది. మిర్చి ధర కొంచెం తగ్గుతుంది. నువ్వులు, నూనె ధరల్లో పెద్ద మార్పులు రాకపోవచ్చును.

### కన్య :

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా.)

గతవారంకంటే ఈ వారం కొంచెం బాగా ఉంటుంది. వ్యాపారంలో కొంచెం శ్రమ మీద అభివృద్ధిని సాధిస్తారు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాల్లో పెద్ద మార్పులు రావు. కోర్టు వ్యవహారాల్లో ఉన్న వ్యతిరేకత క్రమంగా తగ్గుతుంది. సమయానికి కొంత డబ్బు అందడం వలన ఆర్థికంగా ఒడుదుడుకులు లేకుండా గడచిపోతుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధు వ్యవహారాల్లో మీరు ముక్కుకు సూటిగా పోవడం వలన కొంత మందికి అసంతృప్తిని కలిగిస్తారు. శుభ కార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది. సాహిత్యరంగంలో మీ కృషికి ఆటంకాలు రావచ్చును.

స్త్రీలకు—అనారోగ్య సూచనలు ఉన్నాయి. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు. బంధువులకు సహాయం చేస్తారు.

### తులా :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

ఈ వారం కూడా గతవారం వలెనే ఉంటుంది. వ్యాపారం వారం మధ్యలో చురుకుగా సాగుతుంది. ఆదాయం పెరగక పోయినా యేదో ఒక విధంగా డబ్బు చేతికి అందుతుంది. నూతన వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాల్లో మీకు అనుకూలంగా చిన్నచిన్న మార్పులు రావచ్చును. లోగడ జరిపిన వ్యవహారాల్లో కొన్ని చిక్కులు రాగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు ఇది వరకటికంటే బాగా ఉంటాయి. సంతానానికి సౌఖ్యం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. వృత్తి రీత్యా ప్రయాణం చేయవలసి వస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం అంతబాగా ఉండదు. బంధువుల వ్యవహారాల్లో చికాకులు రావడం వలన మనశ్శాంతి ఉండదు.

### వృశ్చికం :

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఈ వారం కూడా మీరు విశేషమైన ఫలితాన్ని ఆశించలేక పోయినా గతవారం కంటే బాగా ఉంటుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాలు అంత ప్రోత్సాహకరంగా ఉండవు. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

వృత్తి ఉద్యోగాల్లో మీ పరిస్థితి క్రమంగా అభివృద్ధి చెందుతుంది. దూరప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కాని శరీర శ్రమతో కూడిన వ్యవహారాలకు పూను కోవడం మంచిది కాదు. కుటుంబ వ్యవహారాల్లో కొన్ని చిక్కులు వచ్చి సర్దుకొంటాయి. ప్రేమ

# వారఫలాలు

వ్యవహారాల్లో యెదురు చూడని ప్రోత్సాహం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. సంతానానికి స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. సాంఘిక కార్యక్రమాలు నిరాటంకంగా సాగుతాయి.



## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

ఈ వారం సామాన్యంగా ఉంటుంది. వ్యాపారంలో పెద్ద మార్పులు రావు. అన్ని వ్యవహారాలు ఒడుదుడుకులు లేకుండా సాగిపోతాయి. అప్పుడప్పుడు ఆర్థికంగా ఒత్తిడి రావచ్చును. వృత్తిలో ప్రయోజనం గల శ్రమ పెరుగుతుంది. ఉద్యోగం సామాన్యంగా ఉంటుంది. కోర్టు వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు రాగల సూచనలు ఉన్నాయి. సాహసించి యే వ్యవహారమూ ప్రారంభించుటకు సమయం కాదు. ఆరోగ్యం గత వారంలో వలెనే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. శుభకార్యాలోచనలలో బంధువుల తోడ్పాటు లభిస్తుంది. శుభ మూలంగా ధనవ్యయం జరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం గతవారంలో కంటె బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు క్రమంగా చక్కబడతాయి. ప్రయాణాలోచనలు రావచ్చును.

## మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)

ఈ వారం ప్రారంభంలో సామాన్యంగా ఉన్నా రానురాను అన్ని వ్యవహారాలు అనుకూలంగా మారతాయి. వ్యాపారంలో ప్రయత్నం చేసిన పనులు నెరవేరి ఆదాయం పెరుగుతుంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. వృత్తి ఉద్యోగాలు గడచిన కొద్ది వారాల కంటే బాగా ఉంటాయి. ఇంతవరకు మిమ్ములను చులకనగా చూసిన వారు కూడా మీ ఔన్నత్యాన్ని గుర్తిస్తారు. అన్ని వ్యవహారాల్లో ధైర్యం, చొరవ చూపవలసిన సమయం. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యథాతథంగా ఉంటాయి. రాజకీయాల్లో మీకు అనుకూలమైన మార్పులు రావచ్చును.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధు మిత్రుల సమావేశాల్లో పాల్గొంటారు. పుణ్య కార్యాలు నెరవేరతాయి.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1,2,3 పా.)

ఈ వారం గతవారంకంటే కొంచెం బాగా ఉంటుంది. వ్యాపారంలో శ్రమకు తగిన ప్రయోజనం ఉంటుంది. వారం ప్రారంభంలో సాహసముతో కూడిన వ్యాపారాలు లాభించ వచ్చును. ఇంతవరకు భాగస్వాములతో యేర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోయి వ్యాపారం చురుకుగా సాగుతుంది. వృత్తి ఉద్యోగాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆదాయం అంతగా పెరగడానికి అవకాశం లేదు. ఇదివరకు మీరు రాదనుకొన్న డబ్బు అందగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి అనారోగ్యం చేయడం వలన ఆందోళన కలగవచ్చును. బంధు సమావేశాల్లో పాల్గొంటారు.

స్త్రీలకు ఆరోగ్యం బాగా ఉన్నా బలహీనత ఉంటుంది. బంధు వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. విలువైన వస్తువులు కొంటారు.

**మీనం :**

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ఈ వారం అంతబాగా ఉంటుందని చెప్పడానికి అవకాశం లేదు. వ్యాపారంలో అనవసరంగా ఒడుదుడుకులు రావచ్చును. ఎన్నో అవకాశాలు వ్యాపారంలో కన్పిస్తాయి గాని చేతికి అందవు. వృత్తి ఉద్యోగాల్లో ఆదాయం పెరగక పోయినా అనుకూలత పెరుగుతుంది. ఇదివరకు మీరు చేసిన డబ్బుకు సంబంధించిన వాగ్దానాలు ఇప్పుడు నెరవేర్చవలసిన అవసరం యేర్పడడం వలన కొంత ఇబ్బంది వస్తుంది. ఆరోగ్యం విషయంలో జాగ్రత్త అవసరం. వారాంతంలో స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాలు బాగా ఉంటాయి. మీరు యెంత పొదుపుగా ఉందామనుకొన్నా అనవసరమైన వ్యయం చేయవలసి వస్తుంది.

స్త్రీలకు — ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. సంతానానికి సౌఖ్యం, సంతోషం లభిస్తాయి. బంధువులకు సహాయం చేస్తారు.

# జన్మదినఫలం

## జూన్-26

ఈ సంవత్సరం సామాన్యంగా ఉంటుంది. వ్యాపారంలో మామూలుగా జరిగే వ్యవహారాలకు కూడా కొన్ని ఆటంకాలు రావడం వలన ప్రయాస, ఆందోళన పొందుతారు. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సంవత్సరాంతంలో అనుకూలంగా ఉంటాయి. వృత్తిలో క్రమాభివృద్ధిని సాధిస్తారు. సాటివారితో ఉండే పోటీ చాలవరకు తగ్గగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో పెద్ద మార్పులేమీ రావు. మొత్తం మీద ఆదాయం పెరగడానికి అవకాశం ఉన్నది. స్థిరాస్తి వ్యవహారాల్లో యేర్పడిన చిక్కులు ఇంకా ఒక దారికి రావు. అప్పుడప్పుడు స్వల్ప అనారోగ్యం చేయవచ్చును. సంతానానికి కూడా అనారోగ్యం చేస్తుంది. కుటుంబ వ్యవహారాలు మామూలుగా జరిగిపోతాయి. శుభ కార్యాల విషయంలో బంధువుల మూలంగా అనుకూలత జరగవచ్చును. దూర ప్రయాణం చేయగల సూచనలు ఉన్నాయి. విద్యార్థులు చాలా శ్రమమీద కృతార్థులు కాగలరు.

## జూన్-27

ఈ సంవత్సరం అంతబాగా ఉంటుందని చెప్పడానికి అవకాశం లేదు. వ్యాపారంలో అనుకోని ఇబ్బందులు రావడం వలన మీరు లాభం పొందవలసిన వ్యవహారాల్లో తిరిగి నష్టం పొందే పరిస్థితి కూడా యేర్పడవచ్చును. ఆదాయం పెరగక పోయినా యేదో విధంగా కొంత డబ్బు చేతికి రావడం వలన ఇబ్బంది లేకుండా గడచి పోతుంది. వృత్తిలో కూడా పోటీ పెరిగి, ఉన్నదానిని నిలబెట్టుకొంటే చాలుననే స్థితి యేర్పడుతుంది. ఉద్యోగస్థులు అననుకూలమైన స్థానమునకు మార్పుబడగల సూచనలు ఉన్నాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటిగా ఉంటుంది. సాంఘిక వ్యవహారాల్లో మీ స్థానాన్ని నిలబెట్టుకొంటారు. సంవత్సరాంతానికి అన్ని వ్యవహారాలు సానుకూల పడతాయి. విద్యార్థులకు ఏప్రిల్ పరీక్షలు బాగా ఉండవచ్చును.

## జూన్-28

ఇంట్లోకి ఇత్తడి పూస బయటకు బంగారపు పూస వలె ఈ సంవత్సరం మీ పరిస్థితి ఉంటుంది. ఎప్పుడూ పదిమందితో కలసి తిరగడం ఇతరుల పనులు నెరవేర్చడం జరుగుతుంది కాని మీ స్వంత వ్యవహారాల విషయంలో యెన్నో చిక్కులు వస్తూ ఉంటాయి. వృత్తి వ్యాపారాల్లో గౌరవం పెరుగుతుంది. మీ అభిప్రాయాలను అందరూ గౌరవిస్తారు కాని ఆర్థికంగా విశేషమైన ప్రయోజనం ఉండదు. ఉద్యోగంలో మీ పరిస్థితి సాధారణంగా ఉంటుంది. మీరు ఇదివరకు చేసిన డబ్బుకు సంబంధించిన వాగ్దానాలవల్ల కొంత ఇబ్బంది రావచ్చును. వృత్తి రీత్యా ప్రయోజనం లేని ప్రయాణాలు చేస్తారు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది గాని మానసిక శాంతి లభించే అవకాశం తక్కువ. కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమ మీద నెరవేరతాయి. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కావచ్చును. ఆగస్టు సెప్టెంబరు నెలల్లో అధికాదాయం.

## జూన్-29

ఈ సంవత్సరం బాగా ఉంటుంది. వ్యాపారం ప్రోత్సాహకరంగా ఉంటుంది. కొంతమంది నూతన వ్యక్తుల పరిచయం వల్ల వ్యాపారం అభివృద్ధి అయి ఆదాయం పెరుగుతుంది. వృత్తిలో ఉన్న పోటీ కొంచెం హెచ్చు అయినప్పటికీ మీ అంతస్తు, ఆదాయము పెరుగుటకు అవకాశం ఉన్నది. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్పు బడగల సూచనలు ఉన్నాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో ఇంతవరకు ఉన్న చిక్కులు తొలగిపోతాయి. గృహ నిర్మాణాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది గాని అప్పుడప్పుడు శీత వాతాదుల వల్ల అనారోగ్యం చేయవచ్చును. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. సంతానానికి అనారోగ్యం చేయవచ్చును. రాజకీయాల్లో అనుకూలతా, అభివృద్ధి ఉంటాయి. ధైర్యంగా ముందుకు వెళ్ళవలసిన సమయం. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## జూన్-30

గడచిన కొద్ది సంవత్సరాలకంటే ఈ సంవత్సరం బాగా అనుకూలంగా ఉంటుంది. వ్యాపారంలో మీ ఆలోచనలు కార్యరూపం ధరిస్తాయి. వ్యాపారం భారీ యెత్తున చేయడం వలన పెట్టుబడి చాలక కొంత ఇబ్బంది కలుగుతుంది గాని మీ సమయోచిత ప్రజ్ఞ వలన యేదో ఒక విధంగా సరి పుచ్చుకుంటూ పురోగమిస్తారు. భాగస్వాములతో భేదాభిప్రాయాలు రావచ్చును. వృత్తిలో పూర్తిగా అనుకూల పరిస్థితి యేర్పడుతుంది. ఉద్యోగంలో ఉన్నత స్థానం లభించడానికి అవకాశం ఉన్నది. పై అధికారుల ఆదరణ లభిస్తుంది. కోర్టు వ్యవహారాల్లో సంవత్సరాంతానికి అనుకూలత లభిస్తుంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో కొన్ని చికాకులు రావచ్చును. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యార్థులు క్లాసు సంపాదించుటకు అవకాశం ఉన్నది. పారిశ్రామిక వేత్తలకు మంచి సమయం.

## జూలై-1

ఈ సంవత్సరం మొత్తం మీద బాగా ఉంటుంది. మీరు వూహించ నటువంటి చిత్రమైన సంఘటనలు జరుగుతాయి. ఇంతవరకు మీకు సన్నిహితులుగా ఉన్నవారితో భేదాభిప్రాయాలు రావడం, వ్యతిరేకులు సన్నిహితులు కావడం జరుగుతుంది. అన్ని వ్యవహారాల్లోను జాగ్రత్త చాలా అవసరం. వ్యాపారం అనుకూలంగా ఉంటుంది. వ్యాపారం అభివృద్ధి అయి ఆదాయం పెరుగుతుంది. వృత్తిలో ముఖ్యమైన మార్పులు రావచ్చును. వాటివల్ల మున్ముందు ప్రయోజనం ఉంటుంది. ఉద్యోగంలో అన్ని వ్యవహారాలు జయప్రదంగా జరుగుతాయి. స్థిరాస్తి వ్యవహారాల్లో కొత్త సమస్యలు రావచ్చును. ఆరోగ్యం బాగా ఉంటుంది కాని కాలడం, జారిపడడం వంటి ప్రమాదాలు కలగవచ్చును. కుటుంబ వ్యవహారాలు కొంచెం శ్రమ మీద నెరవేరతాయి. శుభ కార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది. విద్యార్థులకు సెప్టెంబరు పరీక్షలు అనుకూలంగా ఉంటాయి.

## జూలై-2

ఈ సంవత్సరం అనుకూలంగా ఉంటుంది. మీరు వృత్తి వ్యాపారాల్లో చేసిన ప్రయత్నాలు ఫలించి ఫలితం చేతికి వస్తుంది. నూతన వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తిలో సమయానికి స్నేహితుల అండదండలు లభిస్తాయి. ఉద్యోగంలో కొంచెం శ్రమ మీద ఉన్నతస్థానం లభించవచ్చును. మీ అభిప్రాయాలు ఆచరణలో సరియైనవిగా రుజువు కావడం వలన సాటివారిలో మేటితనాన్ని పొందగల్గుతారు. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు నిరాటంకంగా నెరవేరతాయి. బంధువులకు సంబంధించిన సమస్యలవల్ల మీకు మనశ్శాంతి లేకపోవచ్చును. సంతానానికి సౌఖ్యం, సంతోషం లభిస్తాయి. రాజకీయాలు అనుకూలంగా ఉంటాయి. సంవత్సరాంతంలో కొన్ని చికాకులు రావచ్చును. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు. ★

# మెత్తని పులి



మధురాంతకం రాజారాం

ఇంట్లో చండశాసనుడుగా, ఉద్యోగ జీవితంలో సుగ్రీవుడుగా, వూళ్లో సర్వ సమర్థుడుగా బల రామయ్య కెలాంటి పేరైతే ఉందో అతని తమ్ముడు గోపాలానికి అగస్త్యభ్రాతగా అంతటి ప్రఖ్యాతి ఉంది.

సహోదరులలో ఇలాంటి తేడా కొట్టవచ్చినట్లు కనిపించడం ఆశ్చర్యకరమైన విషయమే! కానీ ఇందుకొక్క సమాధానం లేకపోలేదు. చేతి వేళ్లన్నీ సమానంగా ఉన్నాయా మరి!......ఐతే ఆలోచించిన కొద్దీ ఇదికూడా కుంటి జవాబుగా స్ఫురించక పోదు. సమానంగా లేకపోతే మానె, చేతి వేళ్లు ఒకదాని కొకటి పోలి ఉన్నాయి గదా! అన్నగారు ఇంట్లో పులిలా రొప్పుతుంటే తమ్ముడు పిల్లిలాగా గదిలో నక్కి కూర్చోడమేమిటి? అగ్రజుడు విడిచిపెట్టిన బాణంలా వీధివెంట నడచివస్తూ, అల్లంత దూరాన కనిపిస్తే 'మా అన్నయ్య, మా అన్నయ్య' అంటూ అనుజుడు ప్రక్క సందులోకిగానీ, లేక చెత్త డబ్బా చాటుకుగానీ తప్పుకోడమేమిటి? అన్నదమ్ముల జీవన లక్షణాలలోనే ఇంత వైరుధ్యమా?

బలరామయ్యకు సంఘంలో అంతటి పలుకుబడి తెచ్చిపెట్టిన వాటిల్లో ముఖ్యమైనదీ— కటువుగా చెప్పాలంటే—అతడి నోరు. కాస్త మృదువుగా చెప్పాలంటే అతడి వాచాలత్వం. మరీ సరళంగా చెప్పాలంటే అతడి వ్యక్తృత్వం.

అన్నగారంతటి వీను మిగిలినవదరుబోతుగదా, మరి తమ్ముడు పెదవి కదపడమే అబ్బురం.

మంచికో చెడ్డకో పదిమంది ఒకచోట సమావేశమై మీటింగన్న పేరుతో ఓ తతంగం జరిపితే చాలు బలరామయ్య తప్పనిసరిగా హాజరు! ఆ సభకు తను అధ్యక్షుడో, లేక ఉపన్యాసకుడో, కాక కేవలం బహుమతులివ్వడానికి రప్పించబడ్డాడో— ఈ ధర్మ సందేహం అతణ్ణి బాధించేదిగాదు. వేదికపైన విల్లుని గొంతు సవరించి (లేదా సకిలించి) అతడు ఉపన్యాసం అందుకోగానే సభాసీనులైన మహాజనులు 'చచ్చామురా బాబూ, అనుకుంటూ' ఏడుపు మొఖం పెట్టేవారు!

బలరామయ్యను ఉపన్యాసకుణ్ణిగా వరించిన ఒకానొక మీటింగులో జరిగిన గమ్మత్తు ఇక్కడ చెప్పుకో తగ్గది. ఆ మీటింగుకు అధ్యక్షుడు నగరంలో ప్రసిద్ధికెక్కిన ఓ ప్లీడరుగారు. ఆయన కుర్చీలోనుంచి లేచి లేనకుండా "ఇప్పుడు బలరామయ్యగారు 'కో ఆపరేషన్'ను గురించి మాట్లాడుతారు." అన్నారు. పరధ్యానంలో ఉన్నాడో ఏమిటో బలరామయ్యకు 'కో ఆపరేషన్' అన్న పదంలో 'కో' మాత్రం వినిపించింది కాదు. వెంటనే అతడు ప్రారంభించేశాడు.

"సోదర సోదరీ మణులారా! 'ఆపరేషన్' అన్న పదం ఆంగ్ల భాషలోనిది. అందువలన కొందరు 'ఆపరేషను' అన్న వైద్య ప్రక్రియగూడా ఆంగ్లేయుల సంసర్గంవల్లనే మనవాళ్లకు తెలిసివచ్చిందని భావిస్తుంటారు. అది కేవలం భ్రమ! చరకుడు తన వైద్య శాస్త్రంలోనే ఈ సంగతి ప్రస్తావించాడు. కానైతే ఈ ఆంగ్ల పదానికి అక్కడ పర్యాయ పదంగా వాడిన సంస్కృతపదం శస్త్ర చికిత్స. ఈ శస్త్రచికిత్సయొక్క ప్రాధాన్యతను మన పూర్వులు ఎంతగా గుర్తించారంటే, దుష్టాంగాన్ని భేదించి మిగిలిన వాటిని రక్షించడం అత్యవసరమన్న భావం కావ్యాలలోకి కికూడా ఎక్కింది...."

సభాసదులు మొదట ఆశ్చర్యపడి, తరువాత తెల్లబోయి, ఆఖరుకు ఘొల్లున నవ్వేశారు.

చెప్ప వచ్చిందేమిటంటే బలరామయ్యకు తెలియని విషయమంటూ ఒకటి లోకంలో లేదు. అతడు నోరు దెరిస్తే నీతులు మణుల్లా ముత్యాల్లా బయట పడడటం పరిపాటి. కానీ అనీతులను స్వంతానికి గాకుండా హితోపదేశానికి మాత్రమే వాడుకోడం బలరామయ్య ప్రత్యేకత!

ఐదారు వందలమంది విద్యార్థులు చదువుకుంటున్న ప్రాథమిక పాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగా బలరామయ్య. 'తన కోపమే తన శత్రువురా వేధవా.....' అంటూ అతడు వో కుర్ర కుంకను చితక బాదేవాడు. 'వేళ తప్పకుండా బడికి రావలెను. అని రూలింగు జారీచేస్తూ ప్రతిరోజూ ఒకటి రెండు గంటలు ఆలస్యంగా పాఠశాలకు విచ్చేసేవాడు. ఒకవైపున చాడీలు చెప్పరాదు అని విద్యార్థులకు ప్రబోధిస్తూ, తన మాత్రం జవాను పుల్లయ్య ఉపాధ్యాయులపైన చెప్పే కొండెలకు చెవి ఒగ్గేవాడు.

ఇలాంటి బలరామయ్యగారికి గోపాలం తమ్ముడంటే చప్పున నమ్మడమే కష్టం!

తనకు సంబంధించిన ప్రతి వస్తువును గురించి గొప్పలు చెప్పుకోడం బలరామయ్య అలవాట్లలో ఒకటి. తన గడియారం నిలిచిపోకుండా పాతికేళ్లనుంచి పనిచేస్తోందనీ, తన అర్ధ రూపాయి వూట కలం పార్కర్ పేనాకంటే బాగా రాస్తుందనీ, తన చెప్పులు మూడేళ్లనుంచీ ఉపయోగిస్తున్నా అరిగి పోలేదనీ అతడెలాగైతే చెప్పుకునేవాడో, అలాగే భార్య పొదుపరితనాన్ని గురించి, కూతురి సంగీత వైశారద్యాన్ని గురించీ, కుమారుల తెలివి తేటల గురించీ చెప్పుకునేవాడు. పై వర్ణనలకు డిటోగా తన స్థిరాస్తి వరాస్థులలో గోపాలాన్నికూడా ఒక చిన్న విభాగంగా క్రింద జమకట్టి "చిన్నవాడుకాదుకదా! పాతి కేళ్లు వచ్చాయి కదా మావాడికి! ఏదీ, ఏనాడైనా నా ఎదుట నిలిచి మాట్లాడి ఎరుగునా! నేను గీచిన గీటు దాటి ఎరుగునా!" అంటూ అతడు తమ్ముడి భ్రాతృభక్తిని గురించి చెప్పుకు పోయేవాడు.

కానీ తన మాటల పునాదులకు వెనుక ఆంతర్యాల వాస్తవాలను గురించి బలరామయ్యకు ఆదినుంచీ అనుమానాలు కద్దు. కూతురి సంగీత విద్యను ఇరుగు పొరుగువారు హృదయపూర్వకంగా మెచ్చుకోడం లేదేమో నన్నది—ఆయన అనుమానాల్లో ఒకటి. పొదుపు ఖర్చులలో మిగిలించిన డబ్బును భార్య తన పుట్టింటికి చేరవేస్తున్నదేమో నన్నది—ఆయన అనుమానాల్లో మరొకటి. బలరామయ్య గొప్పనట వృక్షంలాంటి వాడైతే అందులోని శాఖలన్నీ రకరకాల అనుమాన పిశాచాలకు ఆశ్రయాలు. వాటిలో గోపాలం భ్రాతృ సేవా పరతంత్రతకు సంబంధించిన అనుమాన పిశాచానిది అగ్రస్థానం. అతి వినయం ధూర్త లక్షణమంటారు. అంటే వినయానికి ధూర్తత్వానికీ, భయభక్తులకు తిరుగుబాటుకూ మధ్య అట్టే దూరం లేదన్నమాట! ఇవి అవి గావడం ఏక్షణాన్నయినా సంభవమే! పైగా ఒకసారి చెడిపోయిన పనిముట్టుతో మళ్లీ చివరిదాకా ఇబ్బంది పడక తప్పదు......అందుకనే గోపాలమనే పనిముట్టును ఎంతో జాగ్రత్తగా వాడుకునేవాడు బలరామయ్య. గోపాలాన్ని చిన్న చేతి గడియారంతో పోలిస్తే రోజు కొక్కసారైనా మందలించడం ద్వారా దానికి 'కీ' యిచ్చేవాడు. గోపాలాన్ని కళ్లెలు కొట్టే మచ్చుకత్తితో ఉపమిస్తే అది త్రుప్పు పట్టిపోకుండా ప్రతిరోజూ అవసరమైనంత కాయకష్టం కల్పించేవాడు. తమ్ముణ్ణి పెందలకడనే నిద్రలేచి, పాఠములు శ్రద్ధగా చదువుకుని వేళ దప్పక బడికేగు మంచి కుర్రవాణ్ణిగా మలచడంలో బలరామయ్య కృతకృత్యుడు కాగలిగాడనే చెప్పవచ్చు. గోపాలం ఉదయం అయిదు గంటలకల్లా నిద్ర లేచేవాడు. అన్నగారి పిల్లలకు 'హోంవర్కుల' లాంటివి చేసిపెట్టేవాడు. తరువాత కాలకృత్యాలు తీర్చుకుని, వదినగారిచ్చిన చిల్లరడబ్బులు జేబులో వేసుకుని మార్కెట్టుకు వెళ్లి వచ్చేవాడు. అప్పటికి వదినగారూ, గోడ గడియారమూ పరస్పరం పోటీకి తలపడి ఉండేవారు. ఆ పోటీలో వదినగారు గెలిచి వంట కాస్త త్వరగా ముగిస్తే గోపాలం వేళకు ఆఫీసుకు వెళ్లగలిగేవాడు. అలా కాకుండా వదినగారు వోడిపోయి గోడ గడియారం గెలిస్తే ఆఫీసుకు వెళ్లడంలో ఆలస్యమూ, ఏ తత్ఫలితంగా ఆఫీసరు గారి చివాట్లు గోపాలానికి తప్పేవికావు.

మధ్యాహ్నం విశ్రాంతి సమయంలో స్వల్పంగా ఉపాహారం, వేడిగా ఓ అరకప్పు కాఫీ మాత్రం సేవించి సాయంత్రం ఆరుగంటల వేళకు యిల్లు చేరుకునేసరికి గోపాలానికి కాళ్లు చేతులు ఎక్కడివక్కడే వూడిపోయినంత నీరసంగా ఉండేది. అంత నీరసంలోనూ అతడు లాంధర్లు తుడిచి, దీపాలు వెలిగించి ఒకటి రెండు గంటలసేపు ఒక చిన్న నీతి పలుకూటాన్ని నిర్వహించవలసి వచ్చేది. ఆపిమ్మట వింపాదిగా పిల్లల భోజనం. ఆ పంక్తి లేచిన తర్వాత బలరామయ్యగారు భోజనానికి కూర్చుంటే భార్యతో ఎక్కడలేని లోకాభిరామాయణాలన్నీ వంటగదిలోనే ముచ్చటించబడేవి ! భోజనం కాగానే తాంబూలం సేవించడం బలరామయ్య అలవాటు. ఆ అలవాటు కెక్కడ వేళాతిక్రమణ జరుగుతుందోనని గోపాలం తొందర తొందరగా తిన్నశాస్త్రం ముగించేవాడు. బంకు దగ్గరికి వెళ్లి తమలపాకులు, వక్కపొట్లాలు తీసుకొచ్చేవాడు. అన్నగారు హాల్లో ఉంటే వరాండాలోనూ, వరాండాలో ఉంటే హాల్లోనూ కొంతసేపు పచార్లు చేసి యింక తనకోసం పురమాయించబడే పను లేవీ లేవన్న కచ్చితమైన నిర్ధారణకు రాగలిగిన తర్వాత చాపా, దిండు తీసుకుని డాబాపైకి వెళ్లి పోయేవాడు.

శరీరం సొమ్మసిల్లిపోయిన స్థితిలో ఆలోచనలకు పూనుకునేపాటి ఓపిక మెదడు కుండదు. గోపాలానికి అవాంతంగా నిద్ర ముంచుకొచ్చేసేది. రాత్రి పది గంటల కనగా పట్టిన నిద్ర ఉదయం అయిదు గంటలదాకా అతణ్ణి తన ఒడిలో నుంచీ కదలనిచ్చేదిగాదు. అప్పుడు ఉలికిపడి నిద్రలేచేవాడు. గోపాలం. ఇంట్లో కాఫీపొడి విండుకున్నదేమో ! బాయిలర్‌లోకి బొగ్గులు కావాలేమో ! మార్కెట్టుకు వెళ్లడం ఆలస్యమౌతుందేమో !

ఆశ్చర్యమేమిటంటే ఆ కుటుంబం, ఆ దినచర్య, ఆ జీవితము అవన్నీ ఎలా ఉండాలో అలాగే ఉన్నట్టు, వాటిని గురించి చెప్పుకోవలసిన రిమార్కు లేవీ లేనట్టు భావించేవాడు గోపాలం. ఇంతకంటే ఆశించదగ్గ సుఖ సంతోషాలు పృథ్వీతలంపైన లేక పోలేదన్న స్పృహయినా అతనికి కలిగేది కాదు. ఆవిధంగా అతడి జీవితంలో పాతికేళ్లు గడిచి పోయాయి. ఆ తరువాతనైనా అతనికి ఆత్మజ్ఞానం స్వతహాగా కలిగిందని చెప్పలేము ! ఓ వ్యక్తి గోపాలానికి జ్ఞానోదయం కలగడానికి తోడ్పడింది. ఆమె పేరు పార్వతి.

## 2

పార్వతిని నాలుగైదు విధాలుగా నిర్వచించే వచ్చు. ఆమె ఇంటికి వచ్చిన క్రొత్త కోడలు. ఆ తరువాత బలరామయ్యగారి మరదలు. ఆపైన బలరామయ్యగారి భార్యకు తోడుకోడలు. చిట్టచివర గోపాలం భార్య.

బొద్దు మీసాలతోనూ, ఎర్రటి కళ్లతోనూ పెద్దపులిలా కనిపించే బలరామయ్య కంటికి కనిపించకుండా పార్వతి ఆయింట ఒదుగుల్లపోయేది. తెచ్చిపెట్టుకున్న అనారోగ్యపు చిప్పలతో లేచి తిరగడానికే ఆపసోపాలు పడిపోయే తోడుకోడలికి వొకవైపు సపర్యలు చేస్తూ మరోవైపున గృహకృత్యాల నన్నింటిని తనొక్కతే చక్కబెట్టు

# మెత్తని పులి

కునేది. తల దువ్వమని, చుక్క బెట్టమని, దుస్తులు మార్చమని మారాముచేస్తూ చుట్టుముట్టే బావగారి పిల్లలను సముదాయించేసరికి ఆ అనుభవం లేని యిల్లాలికి తల ప్రాణం తోక కొచ్చినంత పనయ్యేది. తెల్లవారుజామున అయిదు గంటలకంతా ఆ యిల్లు కార్ఖానాలా నిద్రలేస్తుంది. పెరట్లో బాయిలరు. వంట యింట్లో కాఫీ కోసం కుంపటి. అంతలో ఉపాహారం కోసం తహతహ. స్నానాలు చేయించి, బట్టలు మార్చి, ఉపాహారంతో సంతృప్తి పరచి పిల్లల్ని ఆలస్యంగాకుండా ఎనిమిదిన్నరకు బడికి పంపడం ఓ యజ్ఞాన్ని సాకల్యంగా చేసి ముగించినంత తతంగం! ఇక అప్పటినుంచి బలరామయ్యగారికి తమ హెడ్మాష్టరు గిరీ జ్ఞప్తికి వచ్చి—బడికి బయల్దేరే సన్నాహం ప్రారంభమౌతుంది. సమయాని కాయనకు పాదరక్షలు కనిపించవు. గొడుగు కనిపించదు. ఉండినా వూడినా ఒక్కటే అయిన కళ్ళజోడు కనిపించదు. భర్తగారు బడికి ఆయత్తమయ్యే హంగామాలో అందాకా నీరసంగా పడిఉండే గృహిణిలో స్త్రైతం ఎక్కడలేని చైతన్యం పుట్టుకొచ్చేస్తుంది. కనిపించని పుస్తకాల కోసం, కలాలకోసం యిద్దరూ చేరి యిల్లంతా చిందరవందర చేసేస్తారు. అంతటి గగ్గోలులోనూ ఆ యింట్లో కనిపించనిది గోపాలం పాలకువ ఒక్కటే! వినిపించనిది గోపాలం అలికిడి ఒక్కటే!

గోపాలం లేకపోతే తెరలు లేవవు. దీపాలు వెలుగవు. శబ్ద విస్తరణ యంత్రాలు పలుకవు. గృహనిర్వహణ అన్న నాటకంలో అతని పాత్ర ప్రముఖమైనదని నిస్సందేహంగా చెప్పవచ్చు. కాని ఎటొచ్చీ, తెర వెనుకనే ఉండిపోయే పాత్ర అతనిది.

కానీ పార్వతి కాపురానికి వచ్చినప్పటినుంచీ గోపాలంలో కొత్తగా కొన్ని మార్పు లొచ్చాయి. మొదటిది, ఎప్పుడైనది మునుపటిలా అతనికి నిద్ర పట్టడంలేదు. పార్వతి నిద్రపోయి, తానొంటరిగా మేలుకుని పైకప్పుకేసి చూస్తూ పడుకున్న సమయాల్లో అతని మనసులో ఏవేవో ఆలోచనలు రగులుకునేవి—ఈ యిల్లు, ప్రపంచమూ ఒక్కలాంటిదిగా కనిపించడంలేదు. సాయంకాలాల్లో తానింటికి తిరిగి వస్తున్నప్పుడు చేయి చేయి కలుపుకుని వాహ్యాళికి వెళ్తున్న భార్యాభర్తల్ని ఎందర్ని చూడలేదు? సినిమా థియేటరులో కండ్ల ఎదుట కనిపించే వెండి తెరపైని దృశ్యాల కంటే, వెను దిరిగి చూస్తే జంటలు జంటలుగా బారులు దీర్చి కూర్చున్న ఆలు మగల దృశ్యమే తనకు సహజ సుందరంగా, కన్నులకు విందుగా కనిపిస్తుంది. గంటల తరబడి ఎదురెదురుగా కూర్చుని సాగ్వాదాలతోనూ, పరిహాసాలతోనూ కాలంగడిపే దంపతులు గూడా ప్రపంచంలో దండిగానే కనిపిస్తారు. ఆ చైతన్యాన్ని సంభ్రమాన్ని తానెన్నడూ చవిచూడలేదు. చవిచూడలేడేమో! ఎందువల్ల? లోకంలో కోకొల్లలుగా కనిపిస్తున్న సుఖసంతోషాలకూ తనకూ మధ్య అడ్డుగోడ ఎందుకు ఏర్పడింది? ఎవరు ఏర్పరిచారు? దీన్ని కూలదోసి నేలమట్టం చేయాలంటే అందుకు ఉపాయం ఏమిటి?

పెళ్ళయిన క్రొత్తలో ఓ రోజు రాత్రి అంది

పార్వతి—"ఏమండీ ! ఎదురింటావిడ కట్టుకున్న చీర చూచారా ? చాల బాగుందికదూ !"

ఆ మాటల్లో—నాకైతే మరీ బాగుంటుంది. కనుక కొనిపెట్టండి—అన్న ధ్వని వినిపించడంతో చకితుడైపోయాడు గోపాలం.

తనైతే ఎదురింటావిడ కట్టుకున్న క్రొత్త చీరను చూడడం తటస్థించలేదు. బహుశా అది బాగానే ఉంటుంది. వెల గూడా అంత గిరాకీ గాక పోవచ్చు. ముచ్చటపడినప్పుడల్లా పెళ్లాని కొక చీర కొనిపెట్టడం పొరుగింటాయన రివాజు, తన కలాంటి సౌలభ్య మెక్కడిది ?

విద్యా వివేకాలకు, లోకంలో ప్రయోజకుడుగా పరిగణింపబడటానికి సంబంధం ఉన్నట్టు తోచదు. కేవలం ఆర్థిక సంబంధమైన లావాదేవీల వలన మాత్రమే సిద్ధించేది ప్రయోజకత్వం. పాతికేళ్ల జీవితంలో ఒకరిని తను అప్పు అడిగినట్టుగానీ, లేదా ఒకరికి చేబదులు యిచ్చినట్టుగానీ గుర్తు లేదు. తను న్యూసుపేపరు కొన్నాడంటే అది అన్నగారి కోసం ! క్రాపు దువ్వెన కొన్నాడంటే అది అన్నగారి బిడ్డల కోసం !

ప్రీతిపాత్రుడైన శిష్యునితో గురువు "నిన్ను నా అంతటివాణ్ణిగా చేస్తాను" అని చెబుతాడు. ఓ వ్యక్తియొక్క పలుకుబడికి, పరపతికి మొదట అతడి కుటుంబంలోనుంచీ దోహదక్రియలు సమకూరవలసి ఉంటుంది. కుటుంబంలో పూచిక పుల్లతో సమానంగానైనా పరిగణన లేనివాడు యిక లోకంలో ఎలా గుర్తింపబడగలడు ?

గోపాలం కుమిలిపోసాగాడు. తను తెగువచేసి పెళ్లాని కొక చీర కొనిపెట్టలేని అసమర్థుడు; పెళ్లయి ఆరుమాసా లౌతున్నా భార్య నొక్కసారి సినిమాకు తీసికెళ్లని అప్రయోజకుడు. వెయ్యిమాట లెందుకు—ఏవిధంగా చూచినా తను చేతగానివాడు.

"అదేమిటండీ ! ఇటీవల మీరు ఉత్సాహంగా కనిపించడంలేదే !" ఒరోజు పార్వతి రాత్రి గోపాలన్ని ప్రశ్నించింది.

గోపాలాని కొక్కసారి గొంతెత్తి ఏడవా లనిపించింది.

"ఏం చేయమంటావు పార్వతీ ! నా బ్రతు కిలా పరిణమించింది. ఈ యింట్లో గట్టిగా వూపిరి పీల్చి వదలడానికే నాకు భయం. అనవసరంగా నేనెందు కిలా భయపడుతున్నానా అని వితర్కించుకుంటున్నాను. కారణం బోధపడటంలేదు. అకారణమైన భయంతో నేను తాబేలులా నాలో నేనే ముడుచుక పోవడానికి అలవాటు పడిపోయాను" అన్నాడు గోపాలం.

ఈ పరిణామానికి పార్వతి ఎంతగానో సంతోషించింది. ఎలాగైతేనేం, జడ పదార్థంలాంటి ఈ మానవుడిలో ఆలోచన ప్రారంభమైంది. తీవ్రమైన ఆలోచన మానవుణ్ణి కార్యశూరత్వానికి ప్రేరేపిస్తుంది.

సరిగ్గా అదే సమయానికి బలరామయ్య భార్య "ఏమండీ ! నిద్రపోయారా" అంది.

"ఇంకా లేదు" అన్నాడు బలరామయ్య.

"కొద్ది రోజుల నుంచీ మీ తమ్ముడి వాలకం అదొక రకంగా కనిపించడంలేదూ ?"

"ఒక యింటివా డయ్యాడు గదా ! సంసారసాగరాన్ని ఎలా ఈదడమన్న దిగులేమోలే !" అని తన ఛలోక్తికి తానే నవ్వసాగాడు బలరామయ్య.

## 3

గోపాలాని కొక శుభవార్త తెలిసింది—

కొలది మాసాల్లో తాను తండ్రి కాబోతున్నాడు !

అతని కొక సినిమా పాట జ్ఞప్తికి వచ్చింది. 'నేను పుట్టిన కారణ మేమిటో నాకు తెలియక మునుపే నువ్వెందుకు పుట్టావురా బాబూ' అని ఆ చిత్రంలో కథానాయకుడు వాపోతాడు.

గోపాలం వితర్కించుకోసాగాడు—నిజమే ! తా నెందుకు పుట్టినట్టు ? నిస్వార్థంగా అన్నగారికి, ఆయన సంసారానికి సేవలు చేయడానికేనని తాన్నైతే సరిపెట్టుకోగలడు. కానీ తనను కట్టుకున్న నేరానికి ఓ అయినింటి అమ్మాయిని పీడించడం ఏం న్యాయం ?

ఆలోచించినకొద్దీ గోపాలానికి క్రొత్త క్రొత్త విషయాలు బోధపడుతూ వచ్చాయి. తనకు పెళ్లి చేయడంలో గూడా అన్నగారి ఉద్దేశం వేరు.

---

బజార్లో ఏడుస్తున్న ఓ పిల్లను "ఎందుకేడుస్తున్నావు" అని అడిగాడు దారినిపోతున్న పెద్ద మనిషి.

పిల్లవాడు: మా అన్నయ్యకు వేసవి సెలవలిచ్చారు. నాకివ్వ లేదు.

పెద్దమనిషి : ఎందుకని ?

పిల్లవాడు: నే నింకా బడిలో చేరలేదు.

ఆంజనేయులు (రావినూతల)

---

పెళ్లిచేసుకుని తమ్ముడొక ఇంటివాడైతే ఆయనకు ఒరిగేదేమీ లేదు. ఐనా వెట్టి చాకిరీ చేయడానికి శాశ్వతంగా ఓ పనిమనిషి లభించడం మాత్రం అదెంత వెసులుబాటు కాదు? పార్వతిని కానుపు కోసం పంపమని వాళ్ల పుట్టింటివాళ్లు వచ్చి అడిగినప్పుడల్లా యిప్పుడు గాదని బలరామయ్యగారు వాయిదా వేస్తూ రావడంతో గోపాలం వూహ మరింతగా బలపడసాగింది.

ముంత పొగ పెట్టినట్టున్న ఆ కుటుంబ వాతావరణంలో ఉక్కిరిబిక్కిరైపోయిన గోపాలం లేని తెగువ కొనితెచ్చుకుని భార్యతో ఒక్క మాట మాత్రం చెప్పేశాడు— "ఎలాగో నువ్వు కానుపుకు పుట్టింటికి వెళ్తున్నావు గదా పార్వతీ ! నువ్వు తిరిగొచ్చేసరికి మన బ్రతుకిలా ఉండదు. కానీ అది ఎలా పరిణమిస్తుందో నేను స్పష్టంగా వూహించలేకుండా ఉన్నాను ...."

పార్వతి పుట్టింటికి వెళ్లింది.

రోజులు గడిచిపోతున్నాయి.

సాధ్యమైనంతలో గోపాలానికి ఒక్కటే ఉపాయం స్ఫురించింది. అతడు ట్రాన్స్ఫరు కోసం ప్రయత్నించి చూచాడు. కానీ ససేమిరా వీల్లేదన్నాడు ఆఫీసరు—"అదేమిటోయ్ గోపాలం ! ఈ వూరివాడివి. బాగా పనిచేస్తున్న కుర్రాడివి. వృద్ధిలోకి రావలసినవాడివి. 'రోలింగు స్టోను' ను గురించిన సామెత తెలియదా నీకు ! ఏ పరిస్థితిలోనూ నీకు ట్రాన్స్ఫరు వాంఛనీయంగాదు. నా మట్టుకు నేను మాత్రం ఆమోదించను" అంటూ ఆయన గోపాలం ఆశను సమూలంగా తుడిచిపెట్టేశాడు.

మళ్లీ ఉపాయాంతర అన్వేషణ ఒక్కటే శరణ్యమైంది గోపాలానికి !

లీలగా ఒక మార్గం పొడగట్టింది. గానీ అది చాలా కష్టసాధ్యమైన మార్గం. వూహించడానికే వెరపు గొలిపే మార్గం.—కానీ గత్యంతరంలేదు !

గోపాలం లెక్కలేనన్నిసార్లు ధైర్యం చేశాడు. అన్నగారి ఎదుటకు వెళ్లేవాడు. పెదవి కదిలించి గొంతుక సవరించుకునేవాడు. తమ్ముడేదో చెప్పబోతున్నాడని గ్రహించి అతడివైపు చూచీ చూడకుండా 'ఏమిట్రా' అంటూ ముఖం చిట్లించుకునేవాడు బలరామయ్య. అంతటితో గోపాలంలో ధైర్యం దిగజారిపోయేది. "ఏముంది ! ఏంలేదన్నయ్యా" అంటూ అతడు దూరంగా జారుకునేవాడు.

కట్టకడకు ఇలాగైతే లాభంలేదనుకున్నాడు గోపాలం. కానీ ఒకటి మాత్రం నిజం ! తను ముఖాముఖిగా అన్నగారి ఎదుట నిలిచి మాట్లాడలేడు. ఐతే యిప్పుడు ఉపాయం ఏమిటి ? గోపాలం ఓ నిర్ణయానికి వచ్చి రంగనాథం దగ్గరకు బయల్దేరాడు.

ఈ విశాల ప్రపంచంలో బలరామయ్యకు ఆప్తమిత్రులని చెప్పుకోతగ్గ ఇద్దరు ముగ్గురిలో రంగనాథం ఒకడు. వృత్తిరీత్యా అతడు యిన్స్యూరెన్సు ఏజంటు. ఎదుటివాడు తన సలహాకు బొత్తిగా విముఖంగా ఉన్నప్పటికీ నాలుగు మంచి మాటలతో అతణ్ణి సుముఖుణ్ణిగా చేసుకోగల వాక్చాతుర్యం అతడి సొమ్ము.

"ఏమిటోయ్ గోపాలం! రాక రాక ఇలా వచ్చేశావ్! రా, కూర్చో. విశేషాలేమిటి?" అంటూ పరామర్శించాడు రంగనాథం.

"అబ్బే, ఏమున్నాయండి" అంటూ నీళ్లు నమిలి, అయిదు నిమిషాలు మౌనంగా కూర్చున్నాడు గోపాలం.

"విశేషమే లేకుంటే నువ్వు నన్నింత దూరం వెతుక్కుంటూ వచ్చేవాడివే గావు. చెప్పవయ్యా గోపాలం! మొగమాట మెందుకు?" అన్నాడు రంగనాథం.

"మరేం లేదండి! కారణా లేవైతే నేమి! చిన్న ఇల్లొకటి అద్దెకు తీసుకుని వేరుగా ఉండిపోవాలనుకుంటున్నాను............"

"అలాగా గోపాలం! మంచిదే కదూ మరి! ఎన్నాళ్లు కలిసి ఉన్నా ఎప్పుడో ఒకప్పుడు వేరు కావలసిందే. కక్షలూ, కార్పణ్యాలు లేకుండా మూరెడు హెచ్చూ తక్కువగా— ఉన్న ఆస్తిపాస్తులను పంచుకుంటే సరిపోతుంది. బలరామయ్యతో నేను చెబుతానుండు."

ఓ క్లిష్ట సమస్యను పరిష్కరించిన తృప్తితో గోపాలం ఆఫీసుకు వెళ్లాడు. అయిదు గంటలవరకు పనిచేశాడు. ఆ తరువాత మెల్లగా రోడ్డుపైకి

వచ్చాడు. అప్పుడతని బుర్రలో అశనిపాతంలాంటి కదలిక ఒకటి బయల్దేరింది. కొంపదీసి ఈపాటికే రంగనాథం అన్నగారిని కలుసుకున్నాడేమో! అబ్బే, అదెలా సాధ్యమవుతుంది.? చెప్పగానే తన పని చేసి పెట్టడానికి అంతగా పనుల తొందరలేని వాడా రంగనాథం.........

కానీ రంగనాథంయొక్క స్వంత పని ఎప్పుడూ ఇతరుల పనులకు అడ్డు తగలడమేనని గోపాలానికి తెలియదు.

గోపాలం రాకకోసం ఎదురు తెన్నులు చూస్తూ కూర్చున్న బలరామయ్య అతడు కనిపించగానే అగ్రహోదగ్రుడై పైకి లేచాడు—

"ఏమిట్రా! ఆ అడిగేదేదో నా ముఖాన్నే అడగరాదూ! ఆ రంగనాథంగాడి మధ్యవర్తిత్వం కావలసి వచ్చిందా నీకు!"

గోపాలం నేరస్తునిలా తలవంచుకుని స్తంభం చాటున నిల్చున్నాడు.

"వూ! నువ్వు ఆస్తిపాస్తుల పంపిణీ కోసం కాచుక కూర్చున్నావన్న మాట! కథ అందాక వచ్చిందన్నమాట! ఒరేయ్ గోపాలం! రంగనాథం కాదు, అలాంటి వాళ్ళు వెయ్యమంది వచ్చినా సరే నా బొందిలో వూపిరుండగా ఆ పని మాత్రం జరగదు................"

గోపాలం సాహసంచేసి "ఆస్తి సంగతి నేనెత్తలేదన్నయ్యా! ప్రత్యేకంగా ఉండదలచుకున్నానని చెప్పాను........" అన్నాడు.

"ఓహోహో, అలాగట్రా బాబూ! ప్రత్యేకంగా ఉండదలచుకున్న వాడివి నువ్వు మళ్ళీ ఇక్కడికెందుకు రావలసి వచ్చిందని నేనడుగుతున్నాను. నువ్వింక ఒక క్షణం నాయింట్లో ఉండటానికి వీల్లేదు. వెళ్ళు, వెళ్ళిపో................"

పురాణ కాలంనాటి బలరాముడు ఒకప్పుడు హస్తినాపురాన్ని తన నాగేటి కర్రుతో పెకలించ దలచుకున్నాడట.! పెకలించక పోయినా, పెకలించటానికి కావలసినంత కోపావేశంతో ఆతడు ఒడలు మరచిపోయి వుంటాడు. బలరామయ్యక్కూడా సరిగ్గా అంతే కోపం వచ్చింది. అతడు గోపాలాన్ని తోసుకుంటూ వెళ్ళి బయటికి గెంటి వీధి తలుపు దభాలున వేసుకున్నాడు.

దిమ్మెక్కిపోయిన తలలో గోపాలం కాసేపు వసారా గుంజ కానుకుని విగ్రహంలా నిల్చున్నాడు. ఇరుగిండ్లవారు, పొరుగిండ్లవారు కిటికీల్లోనుంచీ అతడి దురవస్థను చూచి జాలిపడుతున్నారు. ఒక్కొక్కప్పుడు సానుభూతిని గూడా భరించడం కష్టం. గోపాలం వీధిలోకివచ్చాడు. చరచరా నాలుగు ఫర్లాంగుల దూరం నడిచాడు. అక్కడొక చిన్న పార్కు, తెరచిన తలుపులతో, చల్లటి గాలితో, రేడియో గానంతో సాదరంగా గోపాలాన్ని లోనికి ఆహ్వానించింది.

అన్నగారి నిష్ఠుర ప్రవర్తనను తలచుకుంటూ గోపాలం ఓ సిమెంటు బెంచీ పైకి వాలిపోయాడు.

ఓ రక్తం పంచుకుని పుట్టిన అన్నదమ్ములు కొన్నాళ్ళ పాటు కలిసి ఉండి, ఏవో యిబ్బందుల మూలంగా వేరు పడడం సాధారణంగా సమిష్టి కుటుంబాల్లో జరిగే మామూలు సంఘటనే. అన్నదమ్ము లన్న తర్వాత ఎన్నాళ్ళు కలిసి ఉన్నా ఎప్పటికైనా వేరుబాటు తప్పదు. ఈ మాత్రం పరిజ్ఞానం లేకుండా ఈయన తనపైమండిపడటా డెందుకు? ఆస్తిలో



వాటా అడగడం మహాపరాధమా! అంతమాటా అడగకముందే ఈయన తనను ఇంట్లోనుంచీ వెళ్ళిపొమ్మంటాడా? అది స్వంత ఇల్లయినా కాదు అద్దె కొంప!...........

ఎడతెగని ఆలోచనల అలజడిలో అలాగే సొమ్మసిల్లి ఆ బెంచీ పైనే నిద్ర పోసాగాడు గోపాలం.

## 4

గోపాలాన్ని యింటినుంచీ వెళ్ళగొట్టిన తర్వాత అయిదారు మాసాలు కాలగర్భంలో కలిసిపోయాయి. అతడేమై పోయాడో బలరామయ్యకు తెలియదు. కనీసం తెలుసుకోవాలనిగూడా అతడు ప్రయత్నించలేదు.

—అప్రయోజకుడు— వాడేమై ఉంటాడు? ఉద్యోగానికి రాజీనామా పెట్టి ఏకంగా అత్తగారింటికి వెళ్ళిపోయాడేమో! లేకుంటే తనంతట తనే కోరి మరొక వూరికి బదిలీ అయిపోయాడేమో! ఏమైతే నేమి? తను వాడికి సరైన శాస్తి చేశాడు. ఇక జీవితంలో వాడు తన ఎదుట నిలిచి ఆస్తి పంచి పెట్టమని అడగలేడు!

అధికారి : ఏమయ్యా రోజూ ఆఫీసుకు లేటుగా వస్తున్నావ్? నీ ఉద్యోగం 'టెంపరరీ' అని తెలీదా!

గుమాస్తా : తెలీకేమండీ! అది 'పర్మనెంట్' కాదని కూడా తెలుసు.

మాధవ్ (తెనాలి)

ఇలా వూహించడంలో బలరామయ్య పొరబడి నట్టు చెప్పలేము. ఎందుకంటే ఆ తరువాత ఎన్నడూ గోపాలం బలరామయ్య ఎదుటకు రాలేదు. లేదంటే ఒకసారి బలరామయ్యే గోపాలం ఎదుటకు వెళ్ళవలసి వచ్చింది.

ఓ రోజు యింటి కామందు బలరామయ్యకు కబురుపెట్టి వారం పది రోజుల్లో యింటిని ఖాళీ చేసేయమన్నాడు.

"అబ్బే అదెలా కుదురుతుందండీ! మీ యింటిని వదలడానికిముందు నేను మరో ఇల్లు చూచుకోవాలి గదా!" అన్నాడు బలరామయ్య.

"ఏం చేయమంటారు పంతులుగారూ! ఇంటిపైన బేరం తగిలింది. అడ్వాన్సుగూడా తీసుకున్నాను. నాలుగు రోజుల్లో రిజిస్ట్రేషను జరుగబోతోంది" అన్నాడు యింటి కామందు.

చేసేది లేక బలరామయ్య భార్యను బిడ్డలతో సహా పుట్టింటికి తరలించి, తనొక మిత్రుడి గృహంలో మకాంపెట్టి యింటిని ఖాళీచేసి యజమానికి అప్పగించేశాడు.

తీరా యిల్లు ఖాళీచేసిన తర్వాత వారం రోజులకు బలరామయ్యకో విషయం జ్ఞప్తికి వచ్చింది. పదహేనేళ్ళనుంచి తన ముఖానికి అలంకార ప్రాయంగా

ఉంటూ తన బాహ్య వేషానికొక హంగును సమకూర్చిన వెల్లద్దాల కళ్ళజోడు పెట్టెలో వెదికినా కనిపించడం లేదు. బహుశా ఖాళీ చేసిన ఇంట్లో ఏ వాసంపైన్నో, లేక ఏ అలమారాలోనో ఉంచి తను మరచి పోయి ఉండాలి.....ఎలాగూ అది మళ్ళీ దొరుకుతుందన్న నమ్మకంలేదు. కానీ ప్రయత్నించడంలో తప్పులేదుగదా!

కళ్ళజోడు పైన మమకారం బలరామయ్యను మళ్ళీ ఒకసారి ఆతడు వదలిపెట్టిన వచ్చిన యింటివైపు లాక్కెళ్ళింది. రాత్రి ఎనిమిది గంటల వేళ. ఇంటి ముంగిట ఎవరూ లేరు. వెల్లవేసిన గోడలు తెల్లగా కళ కళలాడుతున్నాయి. క్రొత్తగా తీర్చిన రంగవల్లికలతో అరుగులు అందంగా ఉన్నాయి. గృహాంతర్భాగం కూడా మునుపటికన్నా పరిశుభ్రంగా, కుర్చీలు బెంచీలు లాంటి క్రొంగ్రొత్త ఫర్నిచరుతో ఆహ్లాదకరంగా కనిపిస్తోంది.

"ఏమండీ.....సార్" అంటూ ఒకటి రెండుసార్లు పిలిచాడు బలరామయ్య. రేడియో సంగీతంలో అతడి పిలుపు లోపలికి వినిపించినట్టు లేదు.

అతడు ద్వారం దాటుకుని గదుల మధ్య దారిలోనుంచీ హాల్లోకి వెళ్ళాడు.

ఆ హాల్లో కనిపించిన దృశ్యం బలరామయ్యను నిశ్చేష్టుణ్నిగా చేసి నిలబెట్టింది.

ఈజీ చేర్లో గోపాలం. క్రింది చాపపైన పార్వతి. భార్య తమలపాకుల చిలకలు చుట్టి భర్త కందిస్తోంది. అతడు తాంబూలం నములుతూ శ్రావ్యమైన దక్షిణాది సంగీతం వింటున్నాడు.

అన్నగారిని చూడగానే విద్యుద్ఘాతం తిన్న వాడిలా తమ్ముడు తటాలున లేచి నిల్చున్నాడు. మరు క్షణాన అతడక్కడ లేదు. హాలుకు వెనుక వంట గదిలో ఉన్నాడు. ఆపాటికే అక్కడ చేరి ఓ మూలగా నక్కి నిల్చున్న పార్వతి వైపు దీనంగా చూస్తూ "బాబ్బాబూ! నీకు పుణ్యముంటుంది. వచ్చి కూర్చోమని చెప్పు పార్వతీ!" అంటూ బతిమాలుకున్నాడు గోపాలం.

ఆ సందిగ్ధ పరిస్థితిలో అబల సబలగాక తప్పింది గాదు. "నిల్చున్నారేం బావా? రండి. కూచోండి" అంటూ వచ్చిన అతిధి కాళ్ళు కడుక్కోటానికి పెద్ద చెంబు నిండుకు నీళ్ళు తీసుకుని ఎదురు వెళ్ళింది పార్వతి.

బలరామయ్య మరబొమ్మలా వాలు కుర్చీలో కూర్చున్నాడు.

తొట్టిలో పడుకున్న బిడ్డను తీసుకొచ్చి పార్వతి పెదనాన్నగారి ఒడిలో పడుకో బెట్టింది.

పది నిమిషాల నీరవ నిశ్శబ్దం తరువాత బిడ్డ లేచి ఏడుపు లంకించుకున్నాడు.

బిడ్డను చేతికి తీసుకుంటూ "లేచి కాళ్ళు కడుక్కోండి బావా! విస్తరి వేశాను" అంది పార్వతి.

"అబ్బే, అవసరం లేదమ్మా! భోజనంచేసే వచ్చాను." అంటూ పైకిలేచి, తిరిగి చూడకుండా బలరామయ్య బయటికి వచ్చేశాడు.

## 5

మనిషైతే వచ్చేశాడు గానీ, మనసు మాత్రం అక్కడే పరిభ్రమిస్తోంది.

ఇంటిని అమ్మివేస్తున్నట్టు చెప్పాడు యజమాని. కొంపదీసి దీన్ని కొనుక్కున్న వాడు గోపాలం కాదు గదా!

బలరామయ్య ఆశ్చర్య సాగరంలో మునిగి అట్టడుక్కు వెళ్లిపోయాడు. అలాగైతే వీడి కెక్కడినుంచి లభ్యమైనట్టు డబ్బు? ఒకవేళ వీడి మామ గారిచ్చారేమో! ఐనా ఒక్కసారిగా కొన్నివేల రూపాయలు ఇచ్చుకోగల స్తోమత ఆ మామగారికి లేదే.

ఈ సందేహం బలరామయ్యను ఒక పట్టాన వదిలింది కాదు. అయిదారు రోజులు అతడు సరిగ్గా తిండీ నిద్రా లేకుండా ఆలోచించాడు. చివరకు అతడి సందేహాన్ని పటాపంచలుచేస్తూ పోస్టులో ఓ రిజిష్టరు నోటీసు వచ్చింది.

భూ స్థితిలో తనకు సంక్రమించవలసిన వాటాను గోపాలం ఎవరికో పదివేల రూపాయలకు అమ్మేశాడు. వాళ్లు తక్షణం వచ్చి కొలతలువేసి భూమిని పంచుకోగోరుతూ బలరామయ్యకు తాఖీదు పంపారు.

బలరామయ్య కళ్ల ఎదుట ప్రపంచం గిర్రున తిరుగ సాగింది. అతడు హఠాత్తుగా కూర్చున్న కుర్చీలోనే కృంగిపోయాడు.






మీరూ అంగీకరిస్తారు

# టాటా-ఫిన్లే
## టీ

సాటిలేని టీ!

### తాజా టీ

తాజాగా వుంచుటకు టాటా-ఫిన్లే టీని ప్రత్యేకమైన ప్యాకింగ్‌లో సురక్షితముగా భద్రపరచుతారు.

### పరిమళమైన టీ

అతి సున్నితమైన పరిమళమిచ్చుటకు కావలసిన కోమలమైన ఆకులను మొగ్గలనే టాటా-ఫిన్లే టీలో ఉపయోగిస్తారు.

### ఉత్తమ టీ

టాటా-ఫిన్లే టీ మిశ్రణ (బ్లెండింగ్) అతి నిపుణతతో చేస్తారు. కనుకనే ఈ టీ చిక్కగా రుచికరంగా వుంటుంది.

**టాటా-ఫిన్లే టీ త్రాగండి;**
**ఆనందము అందుకోండి!**



ఈ క్రింది రకాలలోను, ప్యాకింగ్స్‌లోను టాటా-ఫిన్లే టీ దొరుకుతుంది:-
ప్రెస్టిజ్ డార్జిలింగ్-సుందరమైన టిన్
లలిత్-బంగారు రంగు ప్యాకెట్
మిలాప్-వెండి రంగు ప్యాకెట్
షాన్-పీలి రంగు ప్యాకెట్




BI-TFN-5-TEL

"శశీ నిన్ను చూస్తే జాలి వేస్తోందే! అనవసరంగా మా అన్నయ్యతో నీకు పరిచయం కల్గించి నీకు దుఃఖాన్ని తెచ్చిపెట్టిన దాన్నవుతున్నా!"

"ఏంటి సునీ నీ వనేది?" అర్థం కానట్లు చూసింది.

• "అవును శశి మీ స్నేహం ఇంతవరకు పోతుందని నేననుకోలేదు. ప్చ్! ఇప్పుడు ఏమనుకొని ఏం లాభం! మా అన్నయ్యకూ, మా అత్తయ్య కూతురు రాణికి ఎప్పుడో స్థిరపడిపోయింది అన్నయ్యకు కూడా ఆ అమ్మాయి అంటే చాల ఇష్టం—మరి అన్నయ్య నీతో ఇలా ఎందుకు చేస్తున్నాడో?" డ్రామాల్లో రెండు మూడు పార్లు నటించినందుకుగాను ఆ నటన ఇపుడు మహా బాగా పనికి వచ్చిందనుకున్నా.

దాని మొహం చూస్తూంటే నాకు భలే జాలిగా ఉంది. అయినా తమాషాగా ఉంది!

"నిజమా సునీ! ఇదంతా! అంతా నాటకమేనా? ఇంత మోసమా?" శశి కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి.

నాకో ప్రక్క జాలీ...... ఓ ప్రక్క నవ్వు.... ఏం చేయాలో తోచక చస్తున్న సమయంలో నన్ను రక్షించడానికే అన్నట్లు మా 'బోటని' లెక్చరరు ఆటుపోతూ ఏదో పని ఉందంటూ నన్ను పిల్చింది......బతికించావ్ భగవాన్! అనుకుంటూ "శశీ! అట్టే మనసులో పెట్టుకొని బాధ పడకు.. మళ్ళా నేను కలుస్తా" నని చెప్పేసి మా లెక్చరరుని వెంబడించా ..

రెండు వారాలు శశిని తప్పించుకుని తిరిగా .... బహుశా అన్నయ్య వ్రాస్తే ఉత్తరాలకి జవాబివ్వడం మానేసి ఉంటుంది.......ఇంకా నా 'ప్లాన్' ప్రకారం జరగవలసింది చాల ఉంది. . .అన్నయ్యకు ఇంత కాలానికి మరలా నేను జ్ఞాపకం రాకపోను..... నా సహాయం కావలసి ఉండకపోదు అనుకుంటున్నా......అంతలోనే పోస్ట్ మేన్ ఉత్తరం (ఇంకెవరినుండి) ఇచ్చాడు

అయితే అయ్యగారు దారిలోకి వచ్చారన్నమాట! ఉత్తరంలోని సారాంశం .అన్నయ్య వ్రాసిన (ఈ రెండు వారాల్లో) నాలుగు ఉత్తరాలకీ శశి నుండి జవాబులేదు .. .కారణం బోధపడదు. అందుకని ఆ విషయాల ఆచూకీ భారం నామీద వేశాడు. చివరిగా "చిన్నదానినయినా నన్ను సహాయం అడుగుతున్నందుకు అదోలా ఉందట!"

మొత్తానికి నా ప్లాన్ 'సక్సెస్' అయ్యింది. లేకపోతే వాళ్ళ తెలివి తేటలు నాకు చూపిస్తారా? ఆఖరికి ఆ తమాషా ఏదో నేనే తేల్చి పారేస్తానుగా. ఎలుకకు ప్రాణసంకటమయితే........ఏదో పాత చింత కాయ పచ్చడి సామెత గుర్తు వచ్చింది.

ఆ మరుసటిరోజే శశిని గాలించి పట్టుకున్నాను......చూచి ఆశ్చర్యపోయా! ఎంతగా మారిపోయింది! పిచ్చిపిల్ల! అపుడే అంత వైరాగ్యం పట్టుకుందేంటి? నాకు మాత్రం నవ్వు ఆగడం లేదు.

రానంటూన్నా బలవంతంగా 'కేంటీన్'కి తీసుకెళ్ళా—ఎవరూ లేని చోటు చూచుకుని అక్కడ కూర్చున్నాము.

"నీకో శుభవార్త" అన్నా.

"యిక అదొక్కటే తక్కువ" అంది జాలిగా.

# విరిసిన విరజాజులు

15 వ పేజీ తరువాయి

"మా అన్నయ్య మూడు రోజుల్లో రాబోతున్నాడు?"

ఏ మార్పూలేదు .....ఇంక ఆ విషయాలు తనకెందుకూ అన్నట్లు!

"శశీ......చిట్టితల్లీ కోపగించుకోనని ఒట్టేయి! నీకో సంగతి చెప్తా" కొంచెం కుతూహలం కల్గినట్లుంది. . . .

'ఒట్టేస్తున్నా, చెప్పు' అంది.

"శశీ ఆరోజు నీకు చెప్పిందంతా తమాషాకే! మీ వ్యవహారం ఎలా ఉంటుందోనని ఓ ఊపు ఊపి చూద్దామనుకున్నాను. బాబోయ్! అనుకున్న దానికంటె ఘాటుగా ఉందే తల్లీ మీ". . నమ్మనట్లుగా టపటప లాడించింది కనురెప్పల్ని.

అన్నయ్య ఉత్తరం చూపాను ..సంగతులు వివరించాను. అసలు ఇంతవరకూ మాకు ఓ అత్తయ్యలంటూ ఈ భూమ్మీద లేదని చెప్పాను కావాలంటే ఋజువు చేస్తానన్నాను.. ..ఇలా ఆ సంగతులు ఈ సంగతులు చెప్పి మామూలు మనిషిని చేసాను. బాగా శశిని నవ్వించేను......నేనూ

అందమైన అమ్మాయి : మాకు దొంగల భయం లేదు.

అబ్బాయి : ఎందుకని ?

అమ్మాయి : మా యింటి చుట్టూ ఎప్పుడూ కొంతమంది గూర్ఖాల్లా తిరుగుతూ ఉంటారు.

రత్నపిరన్ (పుంగనూరు)

నవ్వేశాను . నా ప్లాన్ 'సక్సెస్' అయ్యింది అదే నాకు కావలిసింది ...

ఆ రాత్రే అన్నయ్యకు రమ్మనమని ఉత్తరం వ్రాసి మరుసటిరోజు 'పోస్టు' చేసాను.

మూడోనాటికి అన్నయ్య ప్రత్యక్షం!!

ఇంట్లో అందర్కీ ఆశ్చర్యం!!

చెప్పా పెట్టకుండా వచ్చేడేంటా అని! అసలు సంగతి తెలిసినదాన్ని నేను .... సూత్రధారిణివి నేనేగా మరి!

అసలు ఇటు అమ్మకి నాన్నకు శశి కోడలుగా రావడం ఇష్టమేనని—అటు శశి తలిదండ్రులకు కూడ అన్నయ్య అల్లుడవడమంటే అదృష్టంగా భావించుకుంటారని తెలుసు గనుకనే ఈ 'ప్లాన్' అంతా ధైర్యంగా 'వర్క్ అవుట్' చేయగలిగా......

అన్నయ్య వేరేగా తీసికెళ్ళి అడిగాడు అసలు సంగతి ఏంటి అని. . .

"కూపీలన్నీ తీయక ముందు నాకేం బహుమానం ఇస్తావ్" చెప్పు అని నిలదీశా!

"అబ్బ! వూరుకో చెల్లీ! నీకున్నది చీరల పిచ్చేగా... పట్టుచీర కొని పెడతాలే" అన్నాడు......

"అదీ అలా దారిలోకి రా" అని అసలు సంగతి చెప్పుదామంటే భయంగా ఉంది. అయినా ఎలాగోలా "శశి" అని మొదలుబెట్టేలోపున శశీ అక్కడకు వచ్చేసింది....!

"ఏంటి నా గురించి మాట్లాడుకుంటున్నారు?" అంది.

అన్నయ్యే అందుకున్నాడు—"అవును నీ గురించే ఎందుకు మామీద అంత అలక్ష్యం కల్గిందోనని"

"ఆ సంగతి సునీకేం తెలుసుగాని నన్నడగండి"

"ఇంతకీ మీ అత్తయ్య కూతురు రాణి ఎలా ఉంది?" నవ్వు అణుచుకుంటూ అడిగింది.

"ఏంటి శశి నీ వనేది?" అన్నయ్యకు ఆరాటం నాకు భయం.......నవ్వూ"......

"అయితే సుని మీకీ విషయాన్ని చెప్పలేదన్నమాట! చూడండి అన్యాయంగా మీకో అత్తయ్య కూతురు ఉందని సృష్టించి నా ప్రాణం తీసింది . .. అయినా నేనెలా నమ్మానో.....ఎంతయినా స్నేహితురాలుకదా నమ్మించి గొంతుకోసే రకం !"

ఇద్దరూ నవ్వేసారు నాకూ భయం తగ్గి నవ్వేసాను.

"అంతా బాగానే జరిగిందికాని అసలు సంగతి విన్నారా?"

"మీ సంగతి అమ్మకు చెప్పేసా?"

"అ.. య్యా....బా .. బో....య్ .. ." అన్నయ్య మంచంమీదనుండి ఎగిరి కుర్చీలోపడ్డాడు .

"అబ్బ! సునీ చేసేవన్నీ కొంటెవేషాలే!" శశి విసుక్కుంది.

"పూర్తిగా వినండి పెద్దల సంప్రదింపులు జరిగిపోయాయి... ఇక నిశ్చితార్థం చేసుకోవడం లేపేను. . ఇక ఎటొచ్చి శశి . అహా. . కాబోయే మా వదినగారు ఈ ఒక్క సంవత్సరమూ అన్నయ్య చదువు పూర్తి కావడంకోసం వోపిక పట్టాలి" నమ్మీ నమ్మని స్థితిలోనే ఉంటూ చిరునవ్వులు చిందించుకున్నారు

"అయితే ఆగండి ఇంకొక్క సంగతి" అరిచా.

"ఇంకా ఏంటి?" ఇద్దరూ ఒకేసారి ప్రశ్నించారు .

"నేను మిమ్మల్ని ఇంత బాధ పెట్టినందుకుగాను నాకు తప్పక శిక్ష విధించాలి. నేను అందుకు అర్హురాల్ని అర్హురాల్ని" సినిమా డైలాగు వల్లించా. ..

"అబ్బ! నీ హాస్యానికేంగాని కాస్తపోయి కాఫీ పట్టుకురావే చెల్లీ"

"ముందు నే నడిగింది చెయ్యండి—చెయ్యండి" అంటూ నాటక ఫక్కీలో నిలబడ్డా. . ..

"అలా అయితే కథ వ్రాయి అదే నీకు శిక్ష" అంది జవాబుగా శశి.

"అవును గుడ్ ఐడియా" అన్నయ్య వంతపాట.

"చంపేసారు కథ........ కొంపదీసి మీమీద వ్రాయమన్నారు కాదు"

"అవునవును మామీద వ్రాసెయ్ చెల్లీ! అమ్మోయ్ ఎందుకొచ్చిన బాధ మామీద వ్రాయకూ.... ..అయినా నీకు ఏడుపు కథలు తప్ప ఇంకోటిరావుగా......అప్పుడేదో నీకథ 'జీవితం' అనుకుంటాను.....ఉట్టి ఏడ్పు మొహంలా ఉంది . . .అవంటేనే చిరాకు....."

"అలా అన్నావూ...మీమీదే ఖచ్చితంగా వ్రాస్తాను—గాని ఈసారి కామెడీనే భయపడకండి....." అని హామీ ఇచ్చా....

దాని పర్యవసానమే ఈ కథ 




### జరిగిన కథ

మధు, స్నేహితురాలు శారదకు తన బాల్య గాధను చెప్పగా, ఆమె దాన్నంతా నవలగా చిత్రీకరిస్తుంది ... చిన్ననాటనే తల్లిని కోల్పోయిన మధు, తండ్రికికూడా దూరమవుతాడు. తాతగారింట్లోనే అన్నయ్య సూర్యం, చెల్లెలితోను వుంటూవుండగా, జమీందారుగారి ఇరువురు కూతుళ్ల స్నేహం లభిస్తుంది. తాతగారి మరణంతో మధు తాతగారి సొంత వూరు చేర్తాడు. అక్కడి పరిస్థితులు మధుకు బాధాకరంగా ఉంటాయి. జానకిభర్త మనసు మారినందుకు అంతా సంతోషిస్తారు. మధు హైస్కూలులో చేరాలనుకొంటాడు. కాని, మామయ్య మందలించటంతో, అతనికి భంగపాటు కలుగుతుంది.

## 8

తెల్లవారి స్నానం ఫలహారం కానిచ్చి విశ్వనాధం ఎక్కడికో బయల్దేరి వెళ్తోంటే—"విశ్వం" అంటూ పిలిచి సుందరమ్మగారు మనవడి చదువు మాట ఎత్తింది—విశ్వనాధం చిరాగ్గా చూశాడు—

"అయితే వాణ్ణి ఎప్పుడు పెద్ద బడిలో చేర్చాలో కూడా నాకు తెలీదని అడుగుతున్నావా?" అన్నాడు విసురుగా.

"అది కాదు అబ్బాయ్! వాడు బడిలో చేరతానని ఏడుస్తున్నాడు సత్యనారాయణా వాళ్ల ఎలాగూ...."

"ఎద్దెగిరిందని గంత కూడా ఎగిరిందట. అలాగే ఉంది. వేలెడు లేని వెధవకి హైస్కూలు చదువు!" కుర్ర వెధవ తన మాటను వినివూరుకోకుండా ఇంత పంతం పట్టి సాధించడం విశ్వనాధానికి నచ్చలేదు.

"అక్కడ పంతులు గారు వాడి చదువు సరిపోదంటే వాడే మానేస్తాడు"

విశ్వనాధం మాట్లాడలేదు. చిన్నవాడిని బడిలో చేర్చటానికి కొడుకుకింత అయిష్టత ఎందుకో? కన్న బిడ్డలకు చదువులు చెప్పించుకోటానికి తల్లి తండ్రులైతే ఇంత రాద్ధాంతం చేస్తారా? సుందరమ్మ గారికి కొడుకు మీద చాలా రోజులనుంచి కష్టంగా ఉంది. ప్రతి విషయానికీ కలగజేసుకు దెబ్బలాడటం బావుండదని ఆలోచిస్తూ ఎప్పటికప్పుడు ముభావంగా బాధ పడుతూ వచ్చింది. కాని... లక్షణంగా తెలివితేటలుగల మనవడు చదువుకోబోతే ఆటంకాలు పెడుతున్న కొడుకుతో ఖచ్చితంగానే మాట్లాడింది— "వాళ్లెంత గతిలేక నీ ఇంటజేరినా ఇంత తేలిక చెయ్యటం ధర్మం కాదు. కల్యాణే బ్రతికి ఉంటే ఈ నాడు వాణ్ణి బడికి పంపటానికి ఇంత తతంగం జరిగేదా? వాళ్లు నీకు భారంగానే ఉన్నారు. ఈ భారం సంవత్సరాల కొద్దీ నువ్వు మొయ్యటం మాత్రం ఏం సమంజసం? వాళ్ల అమ్మ నగలు అమ్మి కొన్న పొలం నాలుగెకరాలు ఉందిగా? వాళ్లని పెట్టుకొని నేను వేరే ఉంటాను. పెద్దదాన్ని మళ్లీ మళ్లీ అడగక్కర్లేదు."

విశ్వనాధం తీక్షణంగా చూశాడు—"అంటే? నీ ఉద్దేశం ఏమిటి? నీక్కూడా ఏదో ఇమ్మనేనా?"

"అది నీకు తెలియాలి. పెట్టవలసిన వాడివి నువ్వు గాని అడుక్కోడం నా ఉద్దేశ్యం కాదు. ఆయువు లేక చస్తారు గానీ అన్నం లేక చావరు. కష్టమైనా సుఖమైనా ఎవరికొచ్చింది వాళ్లు అనుభవిస్తేనే మంచిది. పసివాళ్లని కాకుల్లా విడిచి పెట్టటానికి వాళ్లు నాకు పరాయి వాళ్లు కారుగా?"

"ఇంతకీ వాణ్ణి బడిలో చేర్చాలనేగా ఈగోలంతా?"

"నీకు గోలగానే ఉంటుంది నాయనా! ఇదే వాడికి బ్రతుకు తెరువు. అమ్మా అయ్యా లేరు. ఆస్తిపాస్తులూ లేవు. ఒళ్లు వంచి నాలుగుముక్కలు వంటపట్టించుకోకపోతే...."

విశ్వనాధానికి బాగా చిరాకు వేసింది. "నన్ను ఎలా చదివించవో చూస్తాను. అన్నట్టు చివరకు పంతం పట్టి గెల్చాడు కుర్ర వెధవ." విసుగ్గా అన్నాడు.

—"అబ్బ! ఏదో ఒకటి చేసుకో అమ్మా! ఆ గొడవేదో సీతాపతికి చెప్పు. మరీ చిన్న సన్నాసిగదా? ఈ ఏటికి ఆపు చేద్దామని చూశానేగాని .. నాకేం బాధ మధ్య? ఈ మాత్రానికే నువ్వింత నిష్ఠూరాలాడటం మరీ బాగుంది"—తర్వాత తల్లి మాటలేమీ వినకుండా కుర్చీ మీది జరీ కండువా పైన వేసుకొని వీధిలోకి వెళ్లిపోయాడు.

సత్యనారాయణనీ, గోపాలాన్ని దాటుకుని స్కూలు వేసి పరిగెత్తాడు మధు పట్ట పగ్గాలు లేని సంబరంతో—ముగ్గురూ కలిసే పరీక్ష రాయటానికి కూర్చున్నారు—

పరీక్షలయ్యాక సీతాపతి ముగ్గుర్నీ కూర్చోబెట్టుకుని ఎలా రాసిందీ ప్రశ్నలు వేశాడు.

"అన్ని లెక్కలు చేసేశాను మామయ్యా! తెలుగు పేపర్లో ఒక్క ప్రశ్నే రాయలేదు." అంటూ కుతూహలంగా ధారాళంగా చెప్పుకు పోయాడు మధు. గోపాలానికి అత్తెసరు మార్కులు రావచ్చని అంచనా వేశాడు సీతాపతి. ఎటొచ్చీ సత్యనారాయణ కాస్త ఆశా భంగం చేశాడు. అన్ని ప్రశ్నలు వాడికి తెలిసే ఉన్నా పెద్ద బడిలో డస్కుల మీద రాయటానికి చేతులు వణికి తడబడి పోయాడు. కూర్చున్న తరువాత అర గంట వరకు వాడికి దడే తగ్గలేదు. నెమ్మదిగా రాతకుపక్రమిస్తే కలం కదలలేదు. ఉక్రోషంతో ఏడ్చుకుని—ఏడవలేకవూరుకుని ఎలాగో అయిందనిపించాడు.

"నాకు భయం వేసింది బాబాయ్!" అన్నాడు అమాయకంగా సీతాపతి మొహంలోకి చూస్తూ.

"వీడుత్త పిరికివాడు మామయ్యా!" అనేశాడు తన ధోరణిలో మధు—గుమ్మంలో నిలబడి చూస్తున్న పార్వతి విరుచుకు పడింది— "నీలా నోరుపెట్టుకు బతకటం వాడి చేత కాదుమరి. అసలు వాడి చదువుకి దిష్టి తగిలిందో ఏంపాడో! వాడు స్కూల్లో చేరతాడంటే ఒకటే ఏడుపయ్యె!"

మధు బిత్తరపోయి మాట్లాడలేక పోయాడు.

*　　　*　　　*

పరీక్షలకు కూర్చున్నవాళ్ల పేస్సైందీ—ఫెయిలయ్యిందీ తెలిసేరోజు! ఫస్టుఫారంలో చేర్చుకుంటారో లేదో చెప్పే రోజు! — సీతాపతి పిల్లలు ముగ్గుర్నీ తీసుకు బయల్దేరాడు. ఫస్టు ఫారంలో చేర్చుకునే వాళ్ల పేర్లూ వాళ్లకి వచ్చిన మార్కులూ రాసిఉన్న బోర్డు దగ్గరికి నడిచాడు. సత్యనారాయణా, మదనగోపాలం పేర్లు రాసి ఉన్నాయి—మధు పేరు... పైనుంచి క్రిందికి ఎక్కడా లేదు, లేదు.

"మామయ్యా .."

"ఏంరా? బాగా రాశానన్నావుగా? నీ పేరేదీ?" సీతాపతికి మధు పేరు లేకపోవడం బాధేవేసిం(ది)

"నిజంగా రాశాను మామయ్యా!" బిక్కమొహం వేశాడు మధు. వాడికి కంఠం వరకూ దుఃఖం నిండి పోయింది.

"మరైతే నీ పేరు లేదేం? గోపాలాన్ని తక్కువ మార్కులు వచ్చినా పాసు చేశారే! నిన్ను...."

"మధుసూధనరావు ఎవరండి? ఫస్టుఫారం కుర్రాడు వచ్చాడా? "పిలక మేష్టారు వరండాలోకి వచ్చి గట్టిగా అరుస్తూ వాకబు చేస్తున్నాడు.

సీతాపతీ మధూ కూడా ఆ మాటలు విన్నారు.

"మామయ్యా!...

"నువ్వుండు. నేను చెప్తాను." సీతాపతి ఎదరుగా ఉన్న పిల్లల్లోంచి ఖాళీ చేసుకుని వెళ్లాడు—

"ఇక్కడే ఉన్నాడండీ! మధుసూధన రావు మా వాడే. వాడి పేరు బోర్డు మీద రాయలేదనే చూస్తున్నామండి?"

"ఆ కుర్రాడు మీ వాడేనాండి? ఓహో! వాణ్ణి హెడ్‌మేష్టారిదగ్గరికి తీసుకు వెళ్లారి"

"అయ్యా! అసలు...వాడు పరీక్ష పేస్సైనాడాండి" విసుగుతూ అడిగాడు సీతాపతి.

పిలక మేష్టారు నవ్వి—" మీ వాడు పరీక్ష పేసవ్వక పోవటమేమిటండి? అన్ని పేపర్లలోను మాటికి తొంభై లు దాటి పోయాయండి మార్కులు. వాడికి ప్రమోషన్ ఇచ్చి సెకండ్ ఫారంలోనే వేసెయ్యాలంటున్నారు హెడ్‌మేష్టారు. అందుకే వాడి పేరు బోర్డు మీద వెయ్య లేదు."

సీతాపతి నిర్ఘాంత పోయాడు. మామయ్య వెనకే వచ్చి నిలబడిన మధు కేమీ అర్థం కాలేదు. అయోమయంగానే పిలక మేష్టారితో పాటు మామయ్య వెనక హెడ్‌మాష్టారి దగ్గరకు నడిచాడు.

పండు తమలపాకు లాంటి ఆ హెడ్‌మాష్టారు నవ్వుతూ కలం మేజా మీద పెట్టి కుర్చీలోంచి లేచారు—" వీడేనా మధుసూధనరావు?"

"అవునండి! వీడి పేరు బోర్డు మీద లేదని కంగారు పడుతున్నారట."

"ఆహా!" ఎర్రగా నవ్వారు పండుతమలపాకు మేష్టారు— "ఇలా రా నాయనా!"

మధు నాలుగడుగులు ముందుకువేసి నించున్నాడు మురుగ్గా చూస్తూ.

"నీకు ప్రైవేటు అదీ ఏమైనా ఉందేమిట్రా?"

"లేదండి!" తల అడ్డంగా వూపాడు మధు.

"లేదూ?" ఆశ్చర్యంగా చూశాడు హెడ్‌మాష్టారు.

"పోనీ అస్తమానూ అదే పనిగా చదువుతూ ఉంటావా?"

"చదవనండి!"

"ఎప్పుడు చదువుకుంటావు?"

"తెల్లారగట్ల మా అమ్మమ్మ మజ్జిగ చెయ్యటూ



వికి లేస్తుందండీ—అప్పుడు చదువుకుంటానండి !"

"అంతేనా రాత్రుళ్ళు చదువుకోవూ?"

"రాత్రుళ్ళు మామయ్యగారింట్లో సత్యనారాయణా, మదనగోపాలం, కృష్ణుడూ వాళ్ళంతా చదువుకొంటూ ఉంటారండీ ! అప్పుడు దీపాలు ఉండవు. అయినా గోలగా ఉంటే నాకు చదవాలనిపించదండీ!"

"అబ్బా! ప్రథమ తరగతి విద్యార్థివే నువ్వు!" హెడ్మాష్టారు సీతాపతికేసి చూస్తూ అన్నారు—

"మీ వాడు చాలా తెలివి గలవాడండీ! మంచి మార్కులు వచ్చాయి. వీణ్ణి చూసి ప్రమోషన్ ఇవ్వాలని అనుకున్నాము—ఇప్పుడు ప్రత్యేకంగా వీడికి కొన్ని ప్రశ్నలు ఇస్తాను—ఒక్క గంట పని—ఆ పేపరు చూసి సెకండ్ ఫారంలోకి వేయించేస్తాను"

సీతాపతికి సంతోషం కలిగింది — "అలాగే మేష్టారూ!" మధు అక్కడే ఒక బల్ల మీద కూర్చున్నాడు.

హెడ్‌మాష్టారు మధుకి తెల్ల కాయితం కలం యిస్తూ అన్నారు—"వాలాగే ప్రశ్నలు. నీకేం భయంలేదు. తెలిసినంత వరకే రాయి."—

మధు ప్రశ్నలు చదివాడు. ఏమంత బోధ పడి వట్టు లేవు. ఎల్లా చదివాడు—మూడోసారి చదివాడు, కాస్త ధైర్యం వచ్చింది—రిగె నా చెయ్య

# కూలిన గోడలు

గలననే ధైర్యం వాడికి మొదటనుంచి ఉంది—

వరండాలో హెడ్‌మాష్టారు సీతాపతితో మాట్లాడుతూ వింటున్నారు. సీతాపతి దగ్గిరే సత్యనారాయణా, మదన గోపాలం కూర్చున్నారు.

మధు కాయితాలు పట్టుకుని నిలబడ్డాడు.

"రాశాను మేష్టారూ!"

"అయిందా? ఇంకా ఏమన్నా రాస్తావేమో ఆలోచించుకోక పోయావా?"

"నాకింకా రాదండీ!"

నవ్వారు హెడ్‌మాష్టారు. "ఎంత ఖచ్చితంగా మాట్లాడుతాడండీ మీ వాడు?" అన్నారు సీతాపతి నుద్దేశించి—— మధు రాసిన కాయితాలు ఆయన పైనుంచి క్రిందికి చదివేశారు—మేష్టారి మొహంలో సంతృప్తి కొట్టవచ్చినట్టే కన్పించింది అందరికీ.

"భేష్! మా స్కూలుకే అలంకారమండి మీ వాడు సెకండ్ ఫారంలో చేర్చుకుంటాం. ఆ పుస్తకాలే కొనండి."

"చాలా సంతోషమండీ! వస్తాము" నమస్కారం చేసి వెనక్కి తిరిగాడు సీతాపతి—నిజంగా సీతాపతికి చాలా సంతోషంగా ఉంది. మధు పరాయ్ వాడేం కాదుగా? వాడు అభివృద్ధిలోకి వెళ్తోంటే తనకు సంతోషం కాదూ?

ఇంటి కెళ్ళే సరికి అప్పుడే భోంచేసి వాకిట్లోకి వస్తున్నాడు విశ్వనాథం — గోపాలం అందరికంటే ముందుగా పరుగెత్తుకు వెళ్ళి చెప్పేశాడు— "పెదనాన్నోయ్ మరేమో... మధుని.. సెకండ్ ఫారంలో వేసేశారు." కడుపుబ్బ తీరి పోయి ఒగురుస్తూ నిలబడ్డాడు.

"ఏడిశావ్‌లే. వెర్రి వెధవా! సెకండ్ ఫారంలో వెయ్యటం ఏమిటీ" పై తుండుతో చేతులు తుడుచుకుంటూ వీధి గుమ్మం కేసి నడిచాడు విశ్వనాథం.

—సీతాపతి ఎదురు పడ్డాడు—"మధుని ప్రమోషన్ ఇచ్చి సెకండ్ ఫారంలో వేశారన్నయ్యా!"

విశ్వనాథం నొసలు చిట్లించాడు.

సవిస్తరంగా చెప్పాడు సీతాపతి.

విశ్వనాథం మొహంలో రంగులు మారుతున్న సంగతి ఎవరూ పట్టించుకో లేదు — అప్పుడే గోపాలంద్వారా వంటింట్లోనే వినేసిన పార్వతి, సావిత్రీ విస్తుపోయారు—"అమ్మా అయ్యా లేనివాడని జాలి పడ్డాడో ఏవిటో పంతులు" బుగ్గలు నొక్కుకుంది సావిత్రి

"అంత పెద్ద చదువు ఎలా వచ్చిందబ్బా?" సత్యనారాయణ చదివిందాంట్లో సగమైనా చదివాడా [illegible] నట్టు చూసింది పార్వతి.

[illegible] గారు మాత్రం సంతోషమేమీ పైకి కన్పించనీయకుండా తిరిగింది. మధుకేమిటో సిగ్గు సిగ్గుగా ఉంది. అమ్మమ్మని కావిలించుకొని మొహం దాచేసుకున్నాడు

ఎప్పుడూ అల్లరి చిల్లరిగా తిరిగే వెధవకి అన్ని తెలివితేటలెలా వచ్చాయని లోలోపల విస్తుపోతూ మధన పడ్డాడు విశ్వనాథం. మధుని సెకండ్ ఫారంలో చేర్చుకోవటం చాల అవమానకరంగా భావించి బాధ పడ్డాడు.

"నన్ను ఫస్టు ఫారంలో చేర్చుకోరన్నారు. సెకండ్ ఫారంలోనే చేర్చుకున్నారుగా మామయ్యా?" అని మధు పెంకిగా అడిగేస్తాడేమోనని కొన్ని రోజులు తప్పుకుని తిరిగాడు కూడా. ఒక రోజు తనకై తనే కలగజేసుకొని అన్నాడు." ఒరేయ్! ఎక్కువ మార్కులు వచ్చాయని ఎగిరెగిరి పడక శ్రద్ధగా చదువుకో."

పెద్ద మామయ్య అంత సామరస్యంగా మాట్లాడటం మధుకి విచిత్రంగా తోచింది.

కృష్ణుణ్ని కూడా ఫస్టు ఫారంలో చేర్చటానికి అన్న గారు ప్రయత్నాలు చేస్తున్నాడనితెలుసుకున్న సీతాపతి అన్నాడు—"కృష్ణుడు చాలా తక్కువ స్టాండర్డుతో ఉన్నాడన్నయ్యా వాణ్ణి ఫస్టు ఫారంలో చేర్చినా తలకు మించిన బరువే అవుతుంది. ఈ ఏడాదికి శ్రద్ధగా చదివేస్తే కాస్త నయంగా ఉంటాడు. ఇన్నాళ్ళూ మనం నిర్లక్ష్యం చేశాం ఇప్పుడు తొందరపడితే...."

"నీకు తెలీదు.వూరుకో. అందరితో పాటుకలిపి ఉంచక పోతేబొత్తిగా ఆకతాయిగా తిరుగుతాడు.వచ్చే ఏడాదికి మధుగాడు థర్డుఫారంలోకి పోతోంటే అప్పుడా వీణ్ణి ఫస్టుఫారంలో కూర్చోబెట్టేది?"

విశ్వనాథం తన ప్రయత్నాలు మానలేదు లంచం ఇచ్చి కృష్ణుణ్ణి ఫస్టుఫారంలో చేర్పించిన విషయం సీతాపతికి తప్పితే ఎవరికీ తెలీదు

"నువ్వు ఇంకో తరగతిలోకి వెళ్ళి పోతున్నావురా




"ఏమయ్యా! నా దగ్గర అప్పుతీసుకున్న డబ్బు పంపమని పాతిక ఉత్తరాలేసినా ఒక్కదానికన్న జవాబు వ్రాయలేదే!"

"ఓ-సారీ! క్షమించండి. మీకు జవాబు కావాలంటుంటే అలా చెప్పరే? ఈ సారి ఉత్తరం వేసేప్పుడు రిప్లై కార్డు వెయ్యండి తప్పకుండా జవాబు వ్రాస్తాను."

మధూ!" గోపాలం దిగులుగా అన్నాడు.

మధుకి కూడా దిగులుగానే ఉంది—"నిజంగా నాకూబాగా లేదురా మదనా! మనందరం ఒక్క తరగతిలోనే చదువుకుంటే చక్కగా ఉంటుంది. మరి నేను ఏం చెయ్యనురా?"

"పోనీలే. నన్ను మర్చిపోకుండా ఉంటావా మరి?"

"అదేవిట్రా గోపాలం? అలా మాట్లాడుతున్నావ్. నేను ఎక్కడ చదువుకున్నా నీజట్టే ఉంటాను కదూ?"

"నాకు తెలీని పాఠాలు అవీ కూడా నీతో చెప్పించుకుంటాను"

"నాకు తెలిస్తే అలాగే చెప్తాను. మనకి రాకపోతే చిన్న మామయ్య ఉన్నాడు కదా?"

మధూ మదనుడూ చాలా సేపు మాట్లాడుకున్నారు.

*　　*　　*

అందరూ దీపం చుట్టూ చేరి శ్రద్ధగానో అశ్రద్ధగానో చదువుకొంటున్నారు. సత్యనారాయణ ఇంగ్లీషు పద్యం కంఠతా పడుతున్నాడు. సూర్యం నోట్సేదో రాసుకుంటున్నాడు. గోపాలం శ్రమ అనుకోకుండా మనస్సుని మంచి చేసుకుని సైన్సు పాఠాలు వల్లె వేస్తున్నాడు. మధు తెలివైన వాడని అందరూ అనుకున్న దగ్గర్నుంచీ కృష్ణుడు కూడా పుస్తకాలు తిరగెయ్యటం నేర్చుకున్నాడు—సుధ కూడా పలక మీద పిచ్చి పిచ్చి బొమ్మలు గీస్తూ కూర్చుంది.

మధు మాత్రం అందరికీ దూరంగా సుశీలకు కథలు చెప్పటంలో మునిగి పోయాడు—"మరి చీకటి జీబూతం కథ అయిందిగా? ఇంకేం కథ కావాలి సుశీ?" అన్నాడు.

సుశీల ఏడు వేళ్ళు చూపించింది.

"ఏడుగురు రాజకుమారులు కథా అదే నీకు బాగా ఇష్టం కదూ? అయితే బాగా విను."

"అనగా అనగా ఒక రాజుగారు ఉన్నారు. ఎక్కడ? వాళ్ళ వూళ్ళో—ఆ రాజుగారికి ఎంత మంది కొడుకులు? ఏడుగురు—"మాట్లాడలేని చెల్లెలు తరఫున కూడా తనే మాట్లాడుకొంటూ కథ ప్రారంభించాడు—"ఒక రోజున...."

సుధ బొమ్మలు గియ్యటం చాలించి నెమ్మదిగా మధు దగ్గరికి వచ్చి కూర్చుంది—"మరి ఆ రాజా గారికి కూతుళ్ళు లేరా బావా?"

"కూతుళ్ళు ఉంటే మాత్రం వేటకి వెళ్తారేమిటి?

"అయితే చెప్పు."

"ఒక రోజున రాణిగారు కొడుకులందర్నిపిలచి—"మనకి కూర వండుకోటానికి ఏమీ లేవు అబ్బాయిలూ! మీరు తొందరగా వెళ్లి ఏదైనా తెచ్చి పెట్టండి. వండుతాను." అని చెప్పింది."

"అవును నాకు తెలుసుబావా! అప్పుడు చేపలు వస్తాయి కదూ?" సుధ కుతూహలంగా అంది.

సుశీల మధు చేతిమీద చెయ్యి వేసి ప్రాధేయపూర్వకంగా చూసింది—మధు సుధా మాట్లాడుకొంటూ తన ఉనికి మర్చి పోయారేమోనని సుశీల ఆరాటం! మధు సుశీల మొహంలోకి చూస్తూ అన్నాడు—"కథ నీకే చెప్తున్నాను సుశీ! సుధకి కాదు"

సుధకి కోపం వచ్చింది—బుంగమూతి పెట్టుకొని దూరంగా జరిగింది—"నాకేం చెప్పక్కర్లా!"

"నువ్వేం వినక్కర్లా— అసలు నీకు నేను చెప్తే కదా? మరేమో సుశీ! అప్పుడు....ఎంతవరకూ వచ్చిందబ్బా.... రాజుగారికి కొడుకులని చెప్పాను కదూ

సుధ ఉండబట్టలేక పోయింది—"అది చెప్పేశావు. రాణిగారు కూర తెమ్మనలా?" అనేసింది.

"అవునవును. అప్పుడేమో... ఏడుగురు రాజకుమారులు.....

పార్వతి హడావిడిగా చావిట్లోకి వచ్చింది.

పిల్లలు రణగొణ ధ్వనిలా అరుచుకొంటున్నారు..

"పదమూడు పద్నాలుగులు నూట ఎనభై రెండు. పధ్నాలుగు పధ్నాలుగులు నూట తొంభై ఆరు. నూట తొంభై...ఆరు."

"ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్!
హౌ ఐ వండర్ వాట్ యు ఆర్
ట్వింకిల్ ట్వింకిల్...."

"అప్పుడు అశోక చక్రవర్తి బౌద్ధ భిక్షుకులను ఆహ్వానించెను. కళింగయుద్ధానంతరము....."

"విమానము పక్షివలె ఎగురును. విమానము యొక్క రెక్కలు బోలుగా గాలి పోసుకొనుటకు వీలుగా చేయబడియుండును. విమానము యొక్క..."

"రాజకుమారులందరు చాలా కష్టపడ్డారు కదూ పాపం వాళ్లకి అప్పుడు ఏడు చేపలు దొరికాయి.."

ఒక్క మధు తప్పితే అందరూ చదువుకుంటున్నారు. పార్వతి మధు దగ్గరికి వచ్చింది—"దుకాణానికి వెళ్లి శేరు ఉప్పు తీసుకురా! తీరా ఇప్పుడు చూశాను. ఉప్పు నిండుకొంది. మీ మామయ్య

భార్య భర్తతో : నిన్న మనము వెళ్లిన పెళ్లిలో మీరు ఆ పచ్చచీర కట్టుకున్న అమ్మాయిని అలా తదేకంగా చూశారేమిటీ సంగతి ?

భర్త : అబ్బే ! ఏమిలేదు. ఆ అమ్మాయి మెళ్ళో ఉన్న నెక్లేసు నీకు చేయించుదామని.

ఆర్. శ్రీనివిల్ (సికింద్రాబాదు)

భోజనానికి వస్తున్నారు."—మధు కథ ఆపేసి పార్వతి కేసి చూశాడు.

"ఎవర్నయినా జతపంపు అత్తా! కలిసివెళ్తాం."

"వాళ్ళంతాచదువుకొంటున్నారు. ఎలా వస్తారు?"

"ఇప్పుడే వచ్చేస్తాం కదా?"

"అలా కుదరదు గాని నువ్వు వెళ్లి రా!"

"నేను వెళ్లను."—మధుకి కోపం వచ్చింది.

"వెళ్లవూ?"

"ఎలాగేమిటి? బాగాచీకటిపడిపోయింది. దుకాణం బోలెడు దూరం. గోపాలాన్ని పంపు."

"తానుచెడ్డ కోతి వనమంతా చెరిపిందట. నువ్వు దర్జాగా కూర్చుని వాళ్లనికూడా చదువుకోవద్దంటావు కదూ?"

సూర్యం పుస్తకం మూసేస్తూ అన్నాడు —"నేను వెళ్తానత్తా! డబ్బులియ్యి"

"నీ తమ్మునికా పెంకి తనం ఏమిటి? నేనుచెప్పానని కూడా లేకుండా భీష్మించుకు కూర్చున్నాడు. వెళ్ళకేం చేస్తాడో నేనూ చూస్తాను."

పార్వతి గిరుక్కున తిరిగి లోపలికి వెళ్లి పోయింది.

మధు లెక్కే లేనట్టు తిరిగి కథలోకి వెళ్లిపోయాడు—"రాజకుమారులందరూ నేమో చేపల్ని ఎండ వేశారు. అప్పుడు...."

సుధకో ధర్మ సందేహం వచ్చింది—"రాణి గారి కూర వండదా బావా?"

సుధకేసి చూశాడు మధు—వాడికేం తోచలేదు. కథలో ప్రశ్నలు వేస్తే ఎలా—"అంతకు ముందే రాజుగారు మంచి వంకాయలు తెచ్చి రాణిగారికి ఇచ్చివేశారు. రాణిగారు కూర కూడా వండేసింది."

"ఒరేయ్ మధూ!"

మధు ఉలిక్కి పడ్డాడు.

"ఆ కబుర్లు కట్టి పెట్టి లేచిరారా!"

విశ్వనాథం స్నానం చేసివచ్చి ఒళ్లు తడుచుకొంటూ నిలబడ్డాడు—"ఉప్పు తెమ్మంటే వెళ్లనన్నావట ?"

పార్వతి గుమ్మంలో హుందాగా నిలబడి ఉంది.

"వెళ్లకేంచేస్తాడు? డబ్బులూ సంచీ ఇలాపడేయ్"

విశ్వనాథం గర్జనతో మధు కొంత జంకాడు.

"మధూ!" సుందరమ్మ గారు మృదువుగా పిల్చింది.

"నీకేం భయంలేదు వెళ్లిరా. లేమరి." ఆవిడ మాటల్లో రహస్యమైన మందలింపు—సున్నితమైన ఆజ్ఞాపనా ఇమిడి ఉన్నాయి. మధు చటుక్కున లేచి నిలబడ్డాడు. మాట్లాడకుండా సంచీ డబ్బులూ తీసుకున్నాడు.

"పెంకి వెధవా! నీకేదైనా పని చెప్పాలంటే పెద్ద తతంగం జరగాలన్న మాట. నిన్నే లొంగదియ్యలేకపోతే నేనెందుకురా?" అహంకారం ప్రదర్శించాడు విశ్వనాథం. మధు కసితో నిర్భయంగా—"నాకేం భయమా? ఒక్క చిటికెలో తెచ్చేస్తాను. సత్తిగాడు, కిష్టిగాడు అయితే పిరికి వెధవలు. వాళ్లని ఒక్కళ్లనీ వెళ్లి రమ్మను చూద్దాం." అనేసి బాణంలా దూసుకు పోయాడు.

"చూశారా? వెళ్లేవాడు వెళ్లకూడదూ? సత్తిగాడు సత్తిగాడు అంటూ వాణ్ణి ఏడిపించని ఘడియ లేదు. ఆ సుధని తన్నిన వాడు తన్నినట్టే ఉంటాడు. ఎంత చిన్నతనం అయితే మాత్రం ఏవిటా మొండి బ్రతుకు?" పార్వతి రుసరుస లాడింది.

తన ఎదురుగానే మధు అంత నిర్లక్ష్యంగా మాట్లాడి పరుగెత్తటంతో విశ్వనాథం పెద్దరికం చిన్నబోయింది. మధు ఎప్పటికప్పుడు ఇంట్లో పిల్లల్ని ఏడిపించటం— పెద్దవాళ్లంటే భయంభక్తీ లేకుండా ధిక్కరించటం— కింద పడ్డా మీదివాడినే నన్నట్టు కబుర్లు చెప్పటం విశ్వ నాథానికి ఒళ్ళు మండిస్తూనే ఉన్నాయి. అందుకే అల్లుణ్ణి ఒంచి మంచి మార్గంలోనికి తేవటానికి కంకణం కట్టుకున్నాడు.

"రానీ వెధవని" పళ్ళు నూరుకున్నాడు. అప్పటికి గాని పార్వతికి తృప్తి కలగ లేదు.

ఇంట్లో వస్తువులేవైనా అయిపోతే వెంటనే తెప్పించటం — ఎక్కడివక్కడ సర్దటం లాంటి పనులు సావిత్రే చేస్తుంది—కాని మళ్లా సావిత్రి కూతుర్ని కని పురిటిమంచం మీద కూర్చోవటంతో పార్వతే కాస్త శ్రద్ధ చెయ్యాల్సి వచ్చింది. సరిగ్గా వంట చేసే ముందే పుల్లి పాయలు లేవని— దీపాలు వెలిగించే ముందు కిరసనాయిలు లేదనీ — అన్నాలకు వచ్చేస్తోంటే నెయ్యి నిండుకుందని—దేనికో ఓ దానికి హడావుడి పడుతూ కనిపించిన వాళ్లనల్లా దుకాణానికి పంపేస్తుంది. ఆ కంగారులో మధు లాంటి వాడు ససేమిరా వెళ్లనని మొండికేస్తే

## కూలిన గోడలు

మొగుడితో ఫిర్యాదు చేసి మరీ సాధిస్తుంది.

మధు వెళ్ళి అరగంటపైనే అయింది. పెరుగులో ఉప్పు వేసుకునే అలవాటు లేని విశ్వనాథం భోజనం కూడా చేసి లేచాడు.

"వెధవ! ఎక్కడ చోద్యంచూస్తూ నిలబడ్డాడో!"

"ఇంతసేపు రాలేదేమిటి వీడు? ఏమైంది చెప్మా?" సుందరమ్మ గారు ఆతృతగా వీధి గుమ్మంకేసి వెళ్ళేసరికి మధు సంచి ఈడుస్తూ— కాలు కుంటుతూ బాధపడుతున్నవాడిలా నడిచి రావటం కన్పించింది. సుందరమ్మగారు కంగారుగా చీడీలు దిగి వెళ్ళింది.

—"ఏమైంది బాబూ? కుంటుతున్నావ్. ఏమైందిరా?" మనవడి చేతిలో సంచి అందుకుని వాడి రెక్క పట్టుకొంది—

"చీకట్లో కన్పించలేదు అమ్మమ్మా! గుర్రబ్బండి వచ్చేస్తోంటే గబుక్కుని తప్పుకోపోయి రాతి మీద పడ్డాను."

"అయ్యో! దెబ్బలేమైనా తగిలాయేమిట్రా?"

మధు కుడి కాలు చూపించాడు చీకట్లో అంత బాగా కన్పించక పోయినా సుందరమ్మ చేతికి మధు మోకాలి మీద కొట్టుకు పోయిన చోట తడి తడిగా తగిలింది—"అమ్మో నెత్తురే! లోపలికి పద. బాగా చూస్తాను ఈ చీకట్లో ఎక్కడ పడ్డావురా నాయనా"

"అమ్మమ్మా!" భయంగా అన్నాడు మధు—'ఉప్పు ఒలిగి పోతే ఎత్తి తీసుకు వచ్చాను. దుమ్ము కలిసి పోయింది అమ్మమ్మా!"

"పోతే పోయిందిలే వెధవ ఉప్పు అసలా బండి కిందపడి తే ఏమై పోదువో కదా? ముందు లోపలికి పద" నెమ్మదిగా మనవణ్ణి చీడీలు ఎక్కించింది సుందరమ్మగారు

"ఏంరా అప్పుడే వచ్చావ్? ఇంకో గంట ఆడుకోలేక పోయావా?" విశ్వనాథం కటువుగా అన్నాడు.

మధు బెదిరి సుందరమ్మ గారి చెయ్యి పట్టుకున్నాడు. ఆవిడ కోపంగా అంది—"చాల్లేవూరుకో. బండి కింద పడబోయి ప్రాణాలు దక్కించుకొని వస్తే ఆటలాడుతున్నాడా? మోకాలంతా చెక్కు లేచి పోయింది. 'వరదలా నెత్తురు కారుతూంటే కుంటు కుంటూ వచ్చాడు"

విశ్వనాథం వెటకారంగా అన్నాడు—"నేలమీద కాళ్ళు మోపి నడిస్తేగా? కన్ను మిన్నూ కానకుండా గంతులేస్తే ఏమవుతుంది మరి?—బుద్ధి మంతుడిలా నించున్నావుగాని ఆ ఉప్పు ముందు మీ అత్తకిచ్చిరా!"

"ఉప్పు దారిలో ఒలికి పోతే ఎత్తాడట దుమ్ము కలిసి పోయింది రేపొద్దున్నే సూర్యం తెస్తాడు"

విశ్వనాధానికి చాలా కోపం వచ్చింది. మధుని దగ్గిరికి లాగి జుట్టు గుంజుతూ అడిగాడు—"నిజం చెప్పు నిన్నే పంపానని కోపంతో ఉప్పులో దుమ్ము కలుపుకొచ్చావు కదూ? అవునా మాట్లాడవేం?"

"కాదు ..మావయ్యా! పడి...పోయాను."

"ఛీ! అబద్ధాల వెధవా!" విశ్వనాథం గెంటిన గెంటుకి మధు వెల్లకిలా పడి తల నేలకు కొట్టుకున్నాడు సూర్యం చటుక్కున లేచి తమ్ముణ్ణి లేవదియ్యబోతే మధు కెవ్వుమని అరిచాడు. సూర్యం చెయ్యి మధు మోకాలి మీద రాసుకుంది అరిచేతి మేర చెక్కుపూడిన మోకాలు ఎర్రగా రక్తం చిమ్ముతోంది. మధు బట్టలూ ఒళ్ళూ దుమ్ము కొట్టుకు పోయాయి.

సుందరమ్మగారు ఇక ఓర్పు చూపించలేక పోయింది— కొడుకుకేసి చూస్తూ తీక్షణంగా అంది:

"ఇలా చీటికీ మాటికీ చావగొడుతూంటే వాడు ఉంటాడనుకున్నావా? చస్తాడనుకున్నావా? నీకంత కంటకింపుగా ఉంటే చెప్పు కూడదూ? అడుక్కునైనా తింటాడు. పుట్టెడు చీకట్లో పసివాణ్ణి పంపింది గాక పైగా కొట్టటం ఒకటా? నేను బ్రతికే ఉన్నానన్న బుద్ధి ఏమైనా ఉంటే ఇలా చేస్తావా?"

తీరా మధుని గెంటాక విశ్వనాథం కాస్త కంగారు పడక పోలేదు ముఖ్యంగా తల్లి గొడవ చేస్తుందనే జడిశాడు—మధు గాడి మోకాలు నిజంగానే చెక్కుపూడి రక్తం కారడం చూశాడు. అయినా తన పొరపాటు కప్పి పుచ్చుకొంటూ నిర్లక్ష్యంగా అన్నాడు.

"—ఎదురు తిరిగి జవాబు చెప్పటానికి లేని పసితనం పనులు చేయటానికే వస్తుందా? చీకట్లో వెన్నెల్లో—పని తగిలితే చేసుకోవద్దంటావా?"

సుందరమ్మగారికి కొడుకు మీద అసహ్యం ముంచుకువచ్చింది—"ఇంట్లో తింటున్నది వాడొక్కడేనా? దిక్కులేని వాడనా వాణ్ణి పంపావు? పోనీ కాస్త పెద్దవాడు సూర్యం వెళ్తానంటే వాణ్ణి వెళ్ళనివ్వ కూడదూ? ఉప్పు తేవటమా కావలసింది? పసి వెధవమీద పంతం పట్టడమా?—కొడితే కొడుతున్నాడా? తిడితే తిడుతున్నాడా? వాడేం పాపం చేసుకున్నాడని మీకందరికీ ద్వేషం?"

విశ్వనాథం వ్యంగ్యంగా అన్నాడు—"పుణ్యానికి పోతే పాపం ఎదురైందట. వాడికి కాస్త భయభక్తులు నేర్పుదామనుకొంటే నీ నిష్ఠూరాలు బాగానే ఉన్నాయి అయితే ఇక మనవాడు బాగుపడ్డట్టే."

"పోతే పోతాళ్ళే" సుందరమ్మ గారికి ఎన్నడూ రాని కోపం వచ్చింది—"నీ చేతుల్లో వాడు ప్రాణాలు వదలకుండా ఉంటే చాలు నువ్వు పుణ్యానికీ పోవద్దు. నేను నిష్ఠూరాలూ అనొద్దు"

విశ్వనాదం విసురుగా గది తలుపులు తోసుకుని వెళ్ళి పోయాడు

సుందరమ్మ కోడళ్ళమీద పేరుకుంటున్న కోపం అసహ్యం మిళితం చేస్తూ అంది—"ఏళ్ళ తరబడి కాపరాలు చేస్తున్నారు—ఏ సరుకు అయిందో— ఏ సరుకు ఉందో వేళ పట్టుకు చూసుకోవటం లేదు గదా? మహా రాణిల్లా జరిగిపోతోంటే తంటాలు పడటం ఏం ఖర్మ? నోరు తెరిస్తే నాది తప్పు అత్త అరిస్తేగాని కోడలి కొంటెతనం కన్పించదట"

"ఇది మరీ బాగుంది మధ్య మా మీద నిరుచుకు పడటం ఏమిటి? మీ అంత నేర్పుగా ఓర్పుగా సంసారాలు చక్క దిద్దుకోలేక పోయినా ఎలాగో ఉడకేసుకు తినకపోము మీ తరం గడిచి పోయిందిగా?" ఎవరెలా ఏడిస్తే మీకెందుకు? మా ఇష్టం మాది. అడగటానికి నువ్వెవరవి? అన్నట్టే మాట్లాడింది పార్వతి. చిలికి చిలికి గాలి వానే అయింది. అత్తా కోడళ్ళ మధ్య మధ్య పెద్ద ఘర్షణే జరిగింది. సుందరమ్మగారు అన్నం తినబుద్ధి కాక పడుకొంది.

కాలి దెబ్బతో రెండు రోజులు మధు మంచం దిగలేకపోయాడు కాలంతా వాచి కొద్దిగా జ్వరం కూడా తగిలింది. ఆ విషయం ఇంట్లో ఎవ్వరూ పట్టించుకోనూ లేదు— మధుకిలా ఉందని సుందరమ్మగారెవ్వరి దగ్గిరా అననూ లేదు. నాలుగు రోజులు ఆవిడే గచ్చాకు పుచ్చాకు నూరి మనవడి కాలికి కట్టుకట్టింది. (సశేషం)





















# ఒకే ఒక సారిడన్ 'రోష్'

## నొప్పులను పోగొట్టును!

నొప్పిని పోగొట్టును, సేదదేర్చును, నవోత్సాహమును కలిగించును

నొప్పికి ఉపశమనకారిగా ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన సారిడన్ నొప్పులనుంచి త్వరితముగా, నిరపాయముగా మరియు నిశ్చయముగా ఉపశమనము కలిగించును. తలనొప్పి, పంటినొప్పి, ఒంటినొప్పి, జ్వర చిహ్నములు మరియు జలుబులకు, సారిడన్ వేసుకోండి. పెద్దవారికి ఒక బిళ్ల పూర్తియైన మోతాదు. పిల్లలకు ½ నుండి 1 బిళ్ల వరకు చాలును.

'రోష్' తయారు
ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: వాల్టాస్ లిమిటెడ్




ఒకే సారిడన్ బిళ్లే చాలును
ఒక బిళ్ల ధర 13 నయా పైసలు

JWTVT-1845 A

# రామచరిత మానస్

తులసీదాసు



తెలుగు ముంగర శంకరరాజు

## 37

లవణాసురుని తమ్ముడు కైటభుడు మూడు వేల మంది జాతుధాన యోధులతో యెత్తి వచ్చి సాకేత సేనపై విరుచుక పడెను. కైటభుడు కాలుని వలె విక్రమించి శూలముతో యూపకేతుని క్రింద బడునట్లు చేసి రణ గర్జన చేసెను. శూలాహతుడై పడిన సోదరుని గాంచి— వైరి దుర్వార గర్వ నిర్వాపణ కుశలుడగు సుబాహుడు పరాక్రమించి మూడు వేల బాణములతో ముష్కర సమూహము— తుత్తునియలగునట్లు ఖండించి, ఒక్క విశితాస్త్రముతో కైటభుని హృదయము గాఢముగా కొట్టెను. మూర్ఛనుండి లేచిన లవణుడు కైటభుని రథముపై బెట్టుకొని గృహోన్ముఖుడాయెను.

కైటభుడా రాత్రి మూర్ఛనుండి లేచి యుద్ధము విరమించి సంధి చేసుకొనుట శ్రేయస్కరమని అన్నకు బోధించెను. యుద్ధోన్మాది లవణుడు సోదరుని హితవు గర్హించి వైరి బలమును యమునములో త్రొక్కివేసెదనని వీరములు పలికెను. మరు దినము లవణుడు సోదరునితో సుతులతో దనుజ బలముతో శస్త్రాస్త్రములతో స్యందన మధిష్ఠించి రోషావేశుడై రణక్షోణికి వచ్చెను.

ఇటువైపు యూపకేతు సుబాహులు సమర సన్నద్ధులై రాక్షసుల నెదుర్కొనిరి. గరుడా! రఘు బలమునకు రాక్షస దళమునకు దివారాత్రములు సంకుల సమరము జరిగెను. హోరాహోరి బాహాబాహి భయంకర యుద్ధ మాయెను. దేవతలు కిన్నరులు గరుడులు నరులు భయాశ్చర్యములతో ఆ తుముల సంగ్రామమును వీక్షించుచుండిరి. క్షత నిహతుల రుధిరధారలతో ఖండిత సైనిక కాయములతో ఆర్తుల ఆక్రందనలతో రణాంగణము భీభత్సముగా నుండెను.

రక్షో వీరుడు రోషవ్యగ్రుడై— కాలాంతకుని వలె బిట్టార్చి, శివుని స్మరించి, త్రిశూలముతో శత్రుఘ్నుని వక్షము గురిచూచి కొట్టెను. ఆ శూలాపతికి లక్ష్మణానుజుడు గిరగిర తిరిగి నేల కొరిగెను. దేవ ఘాతకుడంత కత్తి పైకెత్తి శత్రుఘ్న శరీరమును ముక్కలుగా నరుకుటకై ముందుకు దూకెను. ఇంతలో సుబాహుడు ఆ దుష్టుని దుండగము పసిగట్టి— రోషోగ్రుడై పండ్లు పటపట గీటి ఒక్క దూకుతో వాని రథముపై బడి, వాని హయ రథములను నుగ్గుచేసి విరథుడగునట్లొనర్చెను.

శత్రుఘ్నుడింతలో తేరుకొని, పైకి లేచి రోష కషాయిత నేత్రుడై, రఘువీరు డిచ్చి యుండిన రెండు మహాస్త్రములు సంధించి, ప్రభును స్మరించి, మంత్రించి మధుసూనునిపై ప్రయోగించెను. ఆశర ద్వయము శిఖా జ్వాలలతో పయనించి లవణాసురుని దాకి వాని శరీరమును ముక్కలు ముక్కలుగా త్రెగగొట్టి హతమార్చెను. దైత్య నాథుడు ధర్మితుడై ధరాతలమున కొరుగుట కైటభుడు చూచెను. వాడు రోషోగ్రుడై ఒక మహా వృక్షమును పెకలించుకొని శత్రుఘ్నునిపై కురికెను. సుబాహుడు వాని గమనమున కడ్డువచ్చి, నూరు బాణములు ఏక ముహూర్తమున వదలి వృక్షమును, కైటభుని బాహువులను పిమ్మట వాని మహా కాయమును క్రమముగా ఖండించి నేల బడగొట్టెను. ఇవ్విధముగా శత్రుఘ్నుడు లోక కంటకులగు లవణ కైటభులను నిర్జించి శంఖ ధ్వానము చేసెను.

దేవతాగణము దుందుభులు మ్రోగించి శత్రుఘ్నాదులపై సుమన వర్షము కురిపించిరి. ఇంద్ర బృహస్పతులాది స్వర్లోక వాసులు క్రిందికి దిగివచ్చి శత్రుఘ్నుని అతని పుత్రులను అనేక రీతుల స్తుతించిరి. దేవ బృంద మచట నుండి సాకేతపురికి పోయి రామాదులకు లవణాసురుని చావు సంగతి తెలియజేసి సకల లోకవాసులకు సంతోషము కలుగ జేసిరి.

శత్రుఘ్నుడక్కడ లవణుని రాజ్యము రెండుగా చేసి, మధుర పట్టణమునకు సుబాహుని, విశ్వనగరికి యూపకేతుని రాజుగా చేసెను, రామానుజుడు కతిపయ దినములచట ఉండి, కుమారులను నీతిపరులై ధర్మ సమ్మతముగా రాజ్యము చేయుచుండుడని ఆశీర్వదించి, దిగ్విజయార్థమై యజ్ఞాశ్వము వెంట బయలు దేరెను. విజయ సూచకముగా శంఖారావము చేసి, యమునకు భక్తితో శద్ధాంజలి ఘటించి సాకేతసైన్యము సంరంభోత్సాహముతో దక్షిణ దిశకు ప్రస్థానము కావించెను.

## కుశలవులు గుఱ్ఱమును పట్టుకొనుట

హవనాశ్వము నిరాటంకముగా నానా దేశములు త్రిమ్మరుచూ వాల్మీకి మహర్షి నివసించు వన ప్రాంతము చేరుకొనెను. అప్పుడా వనభూములందు సంచరించు చుండిన లవకుశులు ఆ గుఱ్ఱమును చూచుట తటస్థించెను.

లవకుశులు సీతాదేవి కుమారులు, ముని పల్లెలో పుట్టి మహర్షి వద్ద శస్త్రము శాస్త్రమునకు సంబంధించిన సకల విద్యలు అభ్యసించిన ప్రవర్ధ మానులు వారు. రవికుల సంజాతులగు ఆ రాకుమారులు సూర్యుని వలె తేజోవంతులై బల పరాక్రమములతో శోభించుచుండిరి. అప్పుడప్పటికి వచ్చిన అందమగు హవనాశ్వముపై ఆకిశోరుల దృష్టి పడెను. లవకుశులు దాని లలాటము నున్న లేఖా పత్రము కుతూహలముతో చదువుకొనిరి. ఆ పైన బాలకులు ఉత్సాహముతో గుఱ్ఱమును పట్టుకొని, దానిని ఒక చెట్టుకు కట్టి యేమి జరుగునో చూతమని విల్లంబులు తీసుకొని నిలబడిరి.

అరువదివేల మంది అయోధ్య భటులు అశ్వమునను సరించి వెంటవచ్చు చుండిరి. ఇద్దరు బాలురు యజ్ఞాశ్వమును చెట్టుకు కట్టి, విల్లంబులతో నిలబడి యుండుట చూచి ఆశ్చర్యపడిరి. వారా పిల్లలను చూచి కినుక వహించక ముచ్చట పడి ప్రేమతో— "బాలకులారా! మీ వంటి తేజోవంతులను కనిన తల్లిదండ్రులెవరో ధన్యులు. ఈ గుఱ్ఱము నెందుకు పట్టుకొంటిరి! ఇది యజ్ఞాశ్వము. మీబోటి పిల్లలు దాని జోలికి పోతగదు. గుఱ్ఱమును వదలిపెట్టి ఇంటికి పోయి ఆడుకొనుడు—" అని పలికిరి.

సాధుపూర్వకమైన సైనికుల సంభాషణ సరళి గావించి తాపస బాలురు వినోదించిరి — వారంతట రక్షక భటాళిని లక్షించి— "భటులారా! మీరు సైనికులు, వీరులు, పైగా క్షత్రియులు అది గాక యుద్ధాపేక్షలో అశ్వము వెంట వచ్చితిరి. మీ వంటి సమర వీరులు ఇట్లు భిక్షాటనకు దిగుట సిగ్గు చేటు కదా! ఈ భూమండలము నిర్వీర్యమైనదని భావించి గుఱ్ఱమునకు పట్టము గట్టి దేశము మీదికి వదలి వచ్చినట్లున్నది. బాగున్నది మీ ఆలోచన!" అని పలికి పరిహసించిరి.

కుమారుల మాటలు భటులకు కోపవమును తెప్పించెను. వీరెంత! వీరి బలమెంత! వీరు భయపెట్టడమెంత! అని భావించి సైనికులు తిరస్కార భావముతో గుఱ్ఱమును విడిపించుకొని పోవుటకై ముందుకు వచ్చిరి. వీరుల వైఖరికి లవుడు చిన్నగ నవ్వుకొని, చురుకైన బాణములు

కొన్ని వింట సంధించి, గురిపెట్టి వారి పైకి వదలెను. ఆ శరాహతికి సైనికులు అనేకులు క్షతులై హతులై మూర్ఛితులైరి. చావుతప్పి కన్ను లొట్టపోయిన మరి కొంత మంది పరుగు పరుగున శత్రుఘ్నుని యొద్దకు పోయి "—రాజా ! ఏమి చెప్పుదుము ! ఇద్దరు ముని బాలురు మన సైంధవమును బంధించి, సైనికులను క్షత విక్షతులగునట్లు కొట్టి, రణోత్సాహముతో రంగమున నిలిచియున్నారు—" అని చెప్పి మొర పెట్టు కొనిరి.

రామానుజుడు వారి మాటలకు ఆశ్చర్యాగ్రహము ప్రకటించి హుటాహుటి బయలు దేరెను. అచ్చట శరచాపధరులై నిలుచున్న కిశోర ద్వయమును గాంచి మధురోక్తుల ఇట్లు ప్రసంగించెను—

"కుమారులారా ! తాపస బాలకులైన మీరు క్షాత్రము ప్రదర్శించుటకేల ప్రయత్నించుచుంటిరి ! కోప తాపములతో మీకు నిమిత్తమేమి ! చూచుటకు సుందరముగా బాల మరాళములవలె కనబడుచున్నారు. బిడ్డలారా ! హయనాశ్వమునకు అడ్డు పడక ఆశ్రమములకు మరలి పొండు. పూజింప దగిన ఋషి బాలకులతో పోరు సలుపు మాకు సమ్మతము గాదు."

అందుకు శరచాపధారులయిన సీతా సుతులు ధీర గంభీరులై దశరథ సుతుని కిట్లు సమాధానమిచ్చిరి—

"శూరుడా ! నీ పేరేమి ? వూరెక్కడ ? సైన్యము వెంట బెట్టుకొని ఇట్లు దేశములపై సంచార మెందుకు చేయుచుంటివి ? వీరునివలె ఈ వనములో వాని నెందుకు త్రిప్పుచున్నావు ? దాని లలాటమున గట్టిన ఆ ఫలకమున కర్థమేమి? మీరు వచ్చిన పనికీ, చెప్పెడు మాటలకు పొంతన లేకున్నది ! మీకు బలపౌరుషములు లేకున్న ఎడల ఆ ప్రతిజ్ఞా పత్రము గుర్రమున కెందుకు గట్టితిరి ! అయ్యో ! వృథా ప్రసంగ మెందుకు ! మొదట ఆ గుర్రమునకు కట్టిన పట్టము తీసివేయుడు లేదా యుద్ధములో మమ్ము వోడించి గుర్రమును విడిపించుకొనుడు."

శత్రుఘ్నుడు వారి ప్రసంగమునకించుక మందస్మితుడై సైనికులను చూచి — "వీరులారా! శస్త్ర సన్నద్ధులు కండి—" అని తన వారిని హెచ్చరించెను. అందు మొదట మునిబాలుడు— ఓహో! ఈ వీరుడు గొప్ప శూరుడుగా కనబడుచున్నాడు. హెచ్చరికలతో మమ్ము భయపెట్ట చూచుచున్నాడు. చప్పట్లకు సింగపు కొదమలు బెదరి చెదరిపోవునా !— అని తలపోసి, లవకుశులు కోదండము లెక్కుపెట్టి, మహర్షిని మనస్సులో స్మరించుకొని శతశత నిశిత సాయక పరంపరలను శత్రుఘ్ను సేనపై వర్షింప జేసిరి. ఆ బాణ పరంపరలకు త్రుటిలో కటక మంతయు కలగుండు జెందెను. పక్షులవలె వేలాది భటులు నేలకూలిరి. రెప్ప పాటులో శత్రుఘ్నుడు హయ రథములను కోల్పోయి, క్షతగాత్రుడై నేల కొరిగిపోగా మిగిలిన వారు కొందరు భయభ్రాంతులై అయోధ్య మార్గము బట్టి పరుగులెత్తిరి.

## లక్ష్మణ భరతాదులు కుశలవులచే పరాభూతులగుట

సాకేతపతి శ్రీరాముడు సైనికుల వలన సమాచార మంతయు తెలుసుకొని ఆనందాశ్చర్య విచార మగ్నుడాయెను. బాలురు కల్పించిన యజ్ఞావరోధమునకు కించిత్ వ్యసన వ్యగ్రుడై తమ్ముని బిలచి— "లక్ష్మణా ! సత్వరమే సమర సన్నద్ధుడవై బయలు దేరుము. శాత్రవులు బాలకులని వినుటకు వింతగా నున్నది. తాపసులను దండించుట గానీ వధించుటగానీ ధర్మము కాదు. ఎవ్విధముగనైనా వారిని ప్రాణములతో బంధించి, యజ్ఞాశ్వమును విడిపించుకొని రమ్ము." అని ఆదేశించెను.

సౌమిత్రి స్యందన మారోహించి, సమరాయత్తుడై సేనా సమేతముగా సంగర భూమి చేరుకొనెను. రామానుజు డక్కడ రణాంగణములో నిలబడి యున్న వీరకిశోరులను వీక్షించి ఇట్లు పలికెను—

"కుమారులారా ! మీ శౌర్యోత్సాహములు ప్రసంశనీయములు. అయినా బాలురకు పౌరుష భావ మెందుకు ! మేము దినకర కులజులము. దివిజులను — ద్విజులను పోషించు వారము. వారితో పోరుటకు మేము ఇచ్చగించము. మీరు దృష్టిపథము నుండి తొలగి పోవలసినది. మీరు కన

రాము : ఏంవిట్రోయ్ పరీక్ష అయిపోయాక కూడా ఈ రాత్రప్పుడు పుస్తకం చదువుతున్నావ్?

గోపీ : పుస్తకం పెట్టుకుంటేనే గాని నిద్ర రావడం లేదురా. కాలేజీలో చదువుతున్నప్పుడు ఇదొక అలవాటైపోయింది.

పర్వేశ్వరరావు (హింజిలీకట్)

బడుచుండ నా శరీరము క్రోధముతో కంపించి పోవుచున్నది."

ఆ వీరపుత్రులు విల్లంబులు క్రింద బెట్టుటకు విముఖులై "అయ్యా ! అక్కడ మీ సోదరుడు సూర్య కుల క్షత్రియుడు సుషుప్తావస్థలో ఉన్నాడు. అతని గతి ఇంచుక గమనించితిరా !" వ్యంగ్య బాణములతో వారు సౌమిత్రి హృదయము గ్రుచ్చినట్లు మాట్లాడిరి.

రామానుజుడా మాటలకు రోషస్ఫాంతుడై "—కుర్రలారా ! ఇదిగో, ఇక మీకెవడు సహాయపడెదరో వారిని ఇప్పుడే పిలువ నంపుకొనుడు" అని పచించి లక్ష్మణుడు శరసంధానము చేసెను. మరు క్షణము కుశుడు క్రోధోన్మత్తుడై ముందు కురికి, తేరు కడ్డుపడి లక్ష్మణుని దాకొనెను. అప్పుడు సుమిత్ర తనయునికి సీతాసుతులకు లోక భయంకరమగు సంగ్రామము సంఘటించెను.

లవకుశల శరలాఘవము వారి బాణ ప్రయోగము అపూర్వము. మింటికీ మంటికీ విస్తరిల్లిన వారి సాయకావళిచే — సూర్యబింబమే కప్పబడిపోయెను. అప్రతి హతములగు వారి అంబుల ధాటికి రామానుజుడు రోషోగ్రుడై రొప్పుచూ ఒక గద తీసుకొని గిర గిర త్రిప్పి — దానిని కుశుని వక్షమునకు గురి చూచి కొట్టెను. ఆ గదాఘాతమునకు అతడు క్రింద బడి తెలివి గోల్పోయెను. సోదరుని వక్షము క్షత మగుట జూచి లవుడు అవుడుగరచి, ఒక్క ఉదుటున కుప్పళించి సౌమిత్రిపై దూకెను. ఆ ఇరువురికి బాహా బాహీ ముష్టా ముష్టి మల్లయుద్ధమాయెను. పిడుగుల వలె బడుచున్న లవుని పిడిగ్రుద్దులు సహించి, లక్ష్మణుడు ఆ బాలుని బలమును ప్రశంసించు కొనెను. లక్ష్మణు డాపిమ్మట రోష వివశుడై రెట్టించిన కోపముతో లవుడు సొమ్మసిల్లి నేల బడునట్లు ఒక్క బాణముతో కొట్టెను. ఇంతలో కుశుడు పైకి లేచి, వీరావేశముతో ముందుకు వచ్చి మహర్షి ప్రదత్తమగు మోహనాస్త్రము వింట సంధించెను. ముల్లోకవాసులు... ముఖ్యముగా ముపూరుమూర్తులతో సహా ముల్లోకవాసులు ఆ మహాస్త్రమునకు కట్టుబడ వలసినదే. గురువును స్మరించి కుశుడా దివ్యాస్త్రమును సౌమిత్రిపై ప్రయోగించెను. ఆ బాణాహతికి రామానుజుడు ధరాగతుడై స్పృహ కోల్పోయెను.

దశరథ సూనుడు ధరాశాయి అగుట చూచి సైన్యము కకావికలై ధృతిచెడి దిసెలకు పరుగులెత్తను భటులు కొద్దిమంది అయోధ్యకు పరుగు తీసిరి.

వార్తాహరుల వలన శ్రీరాముడు సమరగతీ, సౌమిత్రి పరాజయమూ, బాలుర బల పరాక్రమములు మున్నగు సమాచార మంతయు తెలుసుకొని చింతాక్రాంతు డయ్యెను. "అన్నయ్యా ! వైదేహిని వనముల పాలు చేసినందుకు మనకీ అశుభము సంఘటించెను." అని పలికి భరతుడు వగచెను.

తదుపరి కౌసల్యా సుతుడు సత్వరమే కార్యోన్ముఖుడై కపివీరులను విభీషణాది రాక్షస యోధులను భరతునికితోడిచ్చి, ముని పుత్రులను బంధించి హయనాశ్వము విడిపించి కొని రమ్మని ఆజ్ఞాపించెను. భరతాది సాకేత బలము సమర భూమి సమీపించి, అక్కడ పరాజితులై పడియున్న తమ వీరుల దుర్దశ గాంచి క్షోభించి పోయెను.

భరతుడు — సుగ్రీవుడు — విభీషణుడు — జాంబవంతుడు — హనుమంతుడు — అంగదుడు — మొదలగు యోధులు లవకుశ బాలకులకు అనేక ప్రకారముల బోధించి వారిని యుద్ధ విముఖులనుగా జేయుటకు ప్రయత్నించిరి. కుశలవులు వారి శాంతి బోధనలు లక్షించక పూర్వమువలె రణోత్సాహము ప్రకటించిరి. గత్యంతరము లేనందున — వర వానర రాక్షస యోధులు మూక ఉమ్మడిగా ముని బాలురతో తలపడుటకు సిద్ధమైరి. రెప్ప పాటులో రణాంగణము రణ గొణ ధ్వనితో ప్రతిధ్వనించెను.

రాక్షస వానర వీరుల ఒకప్పుడు ఒక్కొక్కరుగా మరొకప్పుడు కలసి కట్టుగా తమ యుద్ధ నైపుణ్యమును ప్రదర్శించి కిశోరులతో ఘర్షించిరి. గదలతో ప్రహరించి, వృక్షములు గుప్పించి, కొండలు దొర్లించి, భూమిపై నిలబడి, ఆకాశమున కెగసి, వివిధ రీతుల, విభిన్న గతుల, ప్రాణ ప్రణయముగా పోరాడిరి. బాల భానుని భంగి ఆ వీర సోదరులు ప్రకోపించి ఖరతర బాణ ప్రయోగములతో కపివీరుల ఆట కట్టించిరి. లవకుశల రణ కౌశలము వారి శౌర్య ధైర్యములు వర్ణింపనలవికాదు. వారి శర ధాటికి ఖండితములైన రథకేతనములతో, తెగి పడిన సైనికుల శరీర శకలములతో, రక్తధారలతో గజాశ్వముల కళేబరములతో రణాంగణము ప్రళయాంగణమై భాసించెను. కుశలవులు క్రోధ దుర్ని

తీక్షణులై ప్రకోపించి, వానర మూకను వేయి విధ ములనొప్పించి, సైన్యమును చిందర వందర చేసి, భరతుని గదా ఘాతముతో ప్రహరించి భూమిపై బడునట్లు చేసిరి. దాశరధి దండు క్షతహతమై, దిమ్మ తిరిగి, దిక్కు తోచక తిరోగమించి పారిపోయెను

## తండ్రీ తనయుల సమాగమము

అట్లు బాలురకు పరాఙ్ముఖులై పారిపోయి వచ్చిన పదాతులు రఘు ప్రవరుని సంధించి — "ప్రభూ! సోదరులు సేనా సమేతముగా సమ రాంగణమున సొమ్మసిల్లిరి." అని మూడు ముక్కలతో ముక్తసరిగా చెప్పి ముఖములు దించు కొనిరి. అపజయ వార్తకు అవధేశుని మనస్సు క్షోభించెను. నిమేష కాల మతడు నిశ్చేతనుడై నిలబడి పోయెను. మరుక్షణమే తెప్పరిల్లుకొని మఖ మంటపము వదలి, సీతాపతి సేనా సమేతముగా సత్వర ప్రయాణము సాగించి సమర క్షోణి సమీపించెను.

యుద్ధ రంగము భీభత్సమై హృదయ విదారకముగా కన్పట్టెను. ఖండితమై కుప్ప తిప్పలుగా పడి యున్న రథాశ్వదజ కోటిని, హతమై యున్న సేనా నికాయమును, క్షతులై మూల్గుచున్న భట వర్గమును, తెలివి కోల్పోయి నెత్తుట బడియున్న లక్ష్మణ భరత శత్రుఘ్నుల దీనస్థితి గాంచి అవధేశుని హృదయము క్షోభించి వికలశకల మాయెను. దాశరధి అంతట దీనస్వరముతో ఓ సుగ్రీవా! ఓ విభీషణా! ఓ హనుమా! ఓ జాంబవంతా! ఓ శత్రుఘ్నా! అని పేరు పేరున ప్రియ జనులను పిలిచెను. అమృత తుల్యమగు ప్రభువు కంఠ ధ్వని చెవుల సోకగానే భూమిపై పడియుండిన స్వామి సోదరులు, సఖులు, సైనికులు నిద్రనుండి మేల్కొని నట్లు పైకి లేచి పరుగు పరుగున వచ్చి — ప్రభువుకు ప్రణమిల్లిరి. పిమ్మట సీతాపతి సోదర సేనా పరి వృతుడై అక్కడ నుండి కుశలవులు ఉన్న చోటికి వచ్చెను.

తేజోవంతులు ధృతిమంతులగు కుమారులను చూడగనే స్వామి స్వాంతము సంతోషాశ్చర్యములలో మునిగి తేలెను. పిమ్మట రఘూద్వహుడు ప్రియో క్తుల పుత్రులతో ఇట్లు ప్రసంగించెను —

"కుమారులారా! మీ పేరెయ్యది! వూరె య్యది! మీ జననీ జనకు లెవ్వరు? మీ పరా క్రమము ప్రశంసనీయ మైనది. మీ సంగతి సందర్భ ములు, కుల గోత్రములు తెలియకనే మీతో యుద్ధ మెట్లు చేయ గలను!"

లవకుశుల ముఖమండలము హాసరోషములతో ప్రకాశించెను. కోమల కాఠిన్య స్వరముతో వారిట్లు సమాధాన మిచ్చిరి — "రాజా! మా తల్లి పేరు పేరు జానకి, తండ్రి యెవరో తెలియదు. మహర్షి మమ్ము పెంచి పెద్ద చేసెను. మా పేర్లు లవకుశులు. కోసలేశా! ఒక్కమాటడుగు చుంటిమి ఇంతకూ మీరిక్కడకు వేంచేసినది కయ్యమునకా లేక కథ నడుగుటకా! వూరు పేరులనూ సెందుక! సమరాంగణ ములో నిలబడి సంభాషణలకు దిగుట శూరుల లక్ష ణము కాదని తెలియదా! కాలయాపన యెందుకు! శక్తి ప్రదర్శించి బలా బలము తేల్చు కొనుడు."

అని పలికి ఆ ధీర స్వాంతులు ధనుర్బాణములు సవ రించుకొని సమర సన్నద్ధులైరి.

రామమూర్తి వారి మాటలు విని, ఇంచుక యోచించి, శిరః కంపనముచేసి, వీరు వధార్హులు కారని నిశ్చయించుకొనినెను. పిమ్మట మందస్మితుడై లవకుశులను వీక్షించి — "బాలకులారా! మీ బల వీర్య పరాక్రమము లేపాటివో మావీరులు పరీక్షించెదరు —" అని పలికి రఘు వీరుడు తన వారిని సాభిప్రాయముగా ఒక మారు చూచి, సత్వ రమే అచ్చోటు వదిలి ప్రక్కకు పోయెను.

అవధేశుని అభిప్రాయము ఆదేశముగా భావించి వనచర నిశాచర సాకేత వీరులు యుద్ధ భూమి దద్దరిల్లునట్లు కిలారించి చెట్లు గుట్టలు పెకరించుకొని పెడబొబ్బ లిడిచూ కుశలవులపై దూకిరి. వారు ప్రయోగించిన గదలను శూలములను వృక్షములను పర్వతములను బాల వీరులు పుంఖాను పుంఖములుగా బాణములు గుప్పించి, వారి ఉధృత మును త్రుటిలో తగ్గించి వానర భల్లూక రాక్షసుల ఆక్రమణను అడ్డు కొనిరి. వేలాది మహా యోధులు ఒక వైపు — వరవీర కిశోర ద్వయము మరొకవైపు. ఉభయులకు తుముల యుద్ధము జరిగెను. తాపస బాలుర తీవ్ర ప్రకోపము లైరి. సమూహమును తల్లడిల్ల జేసెను.

లవుడప్పుడు రోష భీషణుడై రొప్పి, నిశిత సాయక మొకదానిని ప్రయోగించి సుగ్రీవుడు యోజన దూరము యెగిరి పోవునట్లు కొట్టెను. కుశుడు కుప్పళించి భల్లూక నాథునిపై దూకి అతనితో ముమ్మరముగా మల్లయుద్ధము చేసి, తుదకా వృద్ధ వీరుని క్రిందబడవైచి కాలు చేతులు కట్టి వైచెను. పిమ్మట కుమారు లిరువురు వాయు నందనుని చుట్టుకొని, కొంత తడవు అతనితో పెనుగులాడి కడకు మహావీరుని కూడా బంధించి వేసిరి. అట్లు బంధించిన వానర భల్లూక వీరులను గుర్రము ఉన్న చోటికి తీసుకొని పోయిరి లవుని వారి యొద్ద ఉంచి కుశుడు రాముని వెదకుచూ రంగమునకు పోయెను. కానీ అక్కడ రథముపై రాఘవుడు మూర్ఛిల్లి యుండుట చూచి కుశుడు సిగ్గుతో వెను దిరిగి వచ్చెను.

వనజ: ఇంతకూ! ఆ అబ్బాయ్ నిన్ను ప్రేమిస్తున్నా డనేందుకు నిదర్శనా లేమిటి?

సరోజ: బోలెడు. ఒకటి నా అటోగ్రాఫ్ తీసుకొని చూసి మురిసిపోయాడు.

రెండు: మా పప్పీ నిముద్దెట్టు కున్నాడు.

మూడు: మా చిట్టి తమ్ముని కి చాక్లెట్లు కొనిచ్చాడు.

ఎ. కృష్ణయ్య (మద్రాసు)

అనంతరము సీతాసుతులు — సమర స్థలిపై మూర్ఛితులై పడియున్న వీరులనుండి ఖడ్గములను కిరీటములను మణి రత్నములను వస్త్రములను రాజ ముద్రికలను సంగ్రహించుకొని, హనుమజ్జాంబవంతు లను వెంటబెట్టుకొని ఆశ్రమమునకు పోయి తల్లిని దర్శించిరి. ఆ బిడ్డలు భక్తితో భూమిజ పాద పద్మ ములకు ప్రణమిల్లి "— అమ్మా! నీకై మేము అమూల్యమైన కానుకలు తెచ్చితిమి —" అని చెప్పి తాము తెచ్చిన మణి రత్నాభరణాదులు మైథిలి ముందు పెట్టి, జరిగిన సంగతంతయూ సవిస్తరముగా తల్లికి నివేదించిరి. సీత రాజ చిహ్నితము లైన రఘువీరుల కరముద్రికా ఖడ్గ కేతనములను పరీక్షించి, హనుమజ్జాంబవంతులను గుర్తించి "అయ్యో! ఎంత పని జరిగెను!" అని ఆర్తస్వర మున కేకపెట్టి శోక వ్యాకులితయై నేల బడెను. పిమ్మట ఆమె ఘోరున యేడ్చుచూ దీన దృష్టుల బిడ్డలను గాంచి—"బిడ్డలారా! ఎంత అకృత్యమునకు ఒడిగట్టితిరి ఈ వస్త్రాభరణాదులు సాకేత నృపులవే! వీరు మనకు పరమాత్మీయ బంధువులైన కపి శ్రేష్టులే! హనుమజ్జాంబ వంతులారా! నన్ను చూచి నా బిడ్డల దుష్కృత్యములను మన్నింపుడు! నా జీవితేశుడు తనయుల చేతులలో తనువు చాలిం చెనా! హతవిధీ! ఎంత ఘోరము సంఘటించెను! బాల్య చాపల్య మెంతటిపరిణామమునకు దారి తీసెను! కుశలవులారా! మీ విజయము మన కులమునకు కళంకము, నాకు వైధవ్యము, మీకు దిక్కులేని తనము ఘటిల్ల జేసెను. పుత్రా! ఇక ఆలస్య మెందుకు, కుంకుమ చందన కర్పూరాది ద్రవ్యములు సేకరింపుము, సత్వరమే చితి పేర్చుటకు ప్రయత్నించుము, నేను నాధునితో చితిలో పడి సహగమనము చేసెదను."

ఇట్లు దుఃఖాక్రాంతయై ధరణిజ దురపిల్లు చున్నప్పుడు వాల్మీకి మహర్షి లచటకి వచ్చెను. ఆ త్రికాలజ్ఞుడు సకల సంగతులు యోగ దృష్టితో తెలుసు కొనెను. అనంతర మా ముని పుంగ వుడు హనుమంతునికి జాంబవంతునికి నమస్కరించి సత్కరించి సుఖాసీనుల జేసి, పిమ్మట సీతాదేవి సంబోధించి — "అమ్మా! అవధేశుడు అవతార మూర్తి, అతని లీలలు వాచామ గోచరములు ఆ శుభం కరునికై నీవు చింతించ వలదు." అని భూపుత్రిని వూరడించెను. తదనంతరము తాపస వరుడు కుశలవు లను వెంట నిడుకొని రాఘవుడు పడియున్న రణ స్థలికి పోయెను

కుశలవుల అపూర్వ బల శౌర్యములను ప్రకటించు చున్న రణ భూమిని చూచినప్పుడు వాల్మీకి హర్షా శ్చర్యములకు లోనయ్యెను. ఆపైన వాల్మీకి రఘుపతి పడియున్న రథము దగ్గరకు వచ్చి — "ఓ కోస లేశా! కుమారులు వచ్చి యున్నారు, వారు నిన్ను దర్శించుకొని పాదాభివందనము చేయుటకై ఆత్ర ముతో నున్నారు రామా! లేచి చూడుము!" అని గొంతెత్తి పిలిచెను. లీలా మానుషుడగు సీతా నాథుడు తాపసి పిలువగానే నిద్ర పోయిన వానివ లె దిగ్గున పైకి లేచి ముకుళిత హస్తుడై మందహా సముతో రథము దిగి క్రిందికి వచ్చెను. వాల్మీకి శ్రీరా ముడు ఒకరి నొకరు గాఢాలింగనము చేసుకొనిరి. ఆయపూర్వ సమ్మేళన సందర్భమున

రఘు రాజ మునిరాజుల నయనములు అశ్రుపూరితము లయ్యెను.

'అప్పుడు మహర్షి రఘుపతికి — సౌమిత్రి సీతను వనములో వదిలిపెట్టి పోయినది, లవకుశుల జననము మొదలగు వృత్తాంత మంతయు శ్రుత పరచి., — "రామా! ఆ దినకరుని సాక్షిగా ఈ చిరంజీవులు నీ తనయులు, వీరిని ఆశీర్వదించి అనుగ్రహింపుము" అని అభ్యర్థించెను. దాశరధి హర్షపులకిత గాత్రుడై వీర పుత్రులను చేరదీసి, గాఢాలింగనము చేసుకొని, వారి మూర్ధము మూర్కొని, వాత్సల్యానందమున మునిగి తేలెను. ఆ శుభ సమయమున దేవతలు దివి నుండి అమృతమును వర్షింప జేసిరి. ఆ సుధావృష్టికి ఆ హవభూమిపై హతులై మూర్ఛితులై పడియున్న భరత లక్ష్మణ శత్రుఘ్నులాది సకల వీరులు సజీవులై పైకి లేచిరి.

## భూదేవి సీతను తీసుకొని పోవుట

అవధేశుడప్పుడు లక్ష్మణుని బిలచి "తమ్ముడూ! సీత మరొకమారు సప్రమాణకముగ శపథము చేయ వలసియుండును. అందుకామె అంగీకరించునేమో తెలుసుకొని—తోడ్కొని రమ్ము." అని చెప్పి పంపెను.

సౌమిత్రి ఆశ్రమములో నున్న అవనిజయొద్దకు పోయి ఆ తల్లి పాదములకు ప్రణమిల్లి, కుశలమడిగి, అన్నగారి ఆదేశము తెలియజేసి, ఆమెను తోడ్కొని రాఘవాదులున్న చోటుకు వచ్చెను. జనకజ అప్పుడు సర్వులసమక్షములో చేతులు జోడించి దృఢస్వరముతో — "ఓ జనులారా! మునులారా! దేవతలారా! త్రికరణ శుద్ధిగా చెప్పుచున్నాను, శ్రీ రాముడే నా భర్త. ఇక్ష్వాకుని తప్ప ఇతర పురుషులను కలలో కూడా భావించి యెరుగను." అని శపథము గావించెను.

ఆ వెంటనే భూపుత్రి ఆత్మక్షోభతో అవనత వదనయై గద్గద కంఠముతో "అమ్మా భూదేవీ! ఇక నీవు నన్ను నీలోనికి తీసుకొని పొమ్ము—" అని ప్రార్థించెను. త్రుటిలో అక్కడ ఫెళఫెళమను ధ్వనితో భూమి చీలెను. అందులోనుంచి ఒక సింహాసనము పైకి లేచెను. ఆ స్వర్ణ సింహాసనము మణిరత్నమయమై పాము పడగలపై అమరియుండెను. భూపుత్రి బద్ధ శ్రద్ధాంజలియై ఆ స్వర్ణాసనముపై కూర్చుండెను. అందరూ చూచుచుండ ఆ సింహాసనము సీతాదేవితో పాతాళమునకు పోయెను.

మైథిలి మహనీయ చరిత్ర నాటితో ముగిసి, ముల్లోకముల వ్యాపించెను. అశేష జనసమూహము ఆ దృశ్యము గాంచి అశ్రువులు రాల్చెను. సీతాపతి శ్రీరాముడు వికల మనస్కుడై—"సీత పరమ సాధ్వి, ఆమె నా స్వాంతమెరిగి తదనుసారము నడచుకొనెను." అని చింతించి సాశ్రులోచనుడయ్యెను.

## యజ్ఞ సమాప్తి

జానకీ వియోగ వ్యాకులితుడైన దశరథాత్మజుని, వాల్మీకి విభీషణాదులు ఊరడింపజేసిరి. అనంతరము సాకేతపతి సుతులను తోడ్కొని సచివ సోదరసేనా సమేతముగా సాకేతపురికి వచ్చి సకల లోక వాసుల సమక్షమున శాస్త్రసమ్మతముగా అశ్వమేధయజ్ఞము లోక కల్యాణ కరముగా పూర్తి చెసెను. తదనంతరము వసిష్ఠ విశ్వామిత్ర శతానందాది మునీశ్వరులను పూజించి, జనక విభీషణ సుగ్రీవాది రాజన్యులను సత్కరించి, గోభూ హిరణ్యాది దానాదులతో బ్రాహ్మణ సమాజమును సమాదరించి, యాచక కోటిని వస్త్రాన్నములతో సంతోష పరచి సత్కీర్తి నొందెను. యజ్ఞమునకు వచ్చిన అతిథిలోకమును సాకేతపతి సాదరపూర్వకముగ వీడ్కొలిపెను.

అనంతరము రఘూద్వహుడు నిత్యమూ పురాణేతిహాసములువినుచూ, పుణ్యజనులను దర్శించుకొనుచూ సజ్జనులతో ధర్మాధర్మచర్చ చేయుచూ, ప్రజానురంజకముగా మరి కొన్నియేండ్లు రాజ్య పాలన చేసెను.

(సశేషం)

---

# మనసున మల్లెలు

23 వ పేజీ తరువాయి

నా అవస్థ చెప్పాను. ఆయన చాలా మంచివాడు. ఆయన పేరు కరుణాకరంగారు. నాకూ ఆయనికీ స్నేహం ఎలా కలిసిందో భగవంతునికే ఎరుక. వడ్డీ లేకుండా డబ్బు అప్పిస్తాననీ, వ్యాపారం చెయ్యమనీ ప్రోత్సహించారు. వెంటనే వ్యాపారం ప్రారంభించాను. చిన్న మిల్లుకొన్నాను. తరువాత ఆయిల్ కంపెనీ ఏజన్సీ సంపాదించాను. నా అదృష్టం బాగుండి ఏడాదిలో నా పెట్టుబడి నాకు వచ్చేసింది. ఆయన అప్పు ఆయనకు తీర్చేశాను. అప్పుడు ఆయన సహాయంతో, కొద్ది మదుపుతో ప్రారంభించిన వ్యాపారం ఇప్పుడు లక్షల మీద నడుస్తోంది. కరుణాకరం గార్ని మట్టుకు నేను ఎప్పుడూ తల్చుకుంటూంటాను."

"ఆయన ఇప్పుడు ఎక్కడ ఉన్నారు ?"

"అదే తెలియదు. నా దురదృష్టం కొద్దీ నేను వ్యాపారం ప్రారంభించిన మరుసటి సంవత్సరమే ఆయనకు మా వూరి నుంచి బదిలీ అయిపోయింది. ఆ సమయంలో నేను మద్రాసులో ఉన్నాను, వ్యాపారం పని మీద. ఆయనకు హఠాత్తుగా బదిలీ ఉత్తరువులు వచ్చాయట. మేమిద్దరం కలుసుకోకుండా ఆయన వెళ్లిపోయారు. ఆయన కుటుంబానికీ, మాకుటుంబానికీ పరిచయం ఉంది. నా భార్య, ఆయన భార్యకు వీడ్కోలిస్తూ ఎంతో బాధ పడిందిట. నేను వచ్చాక చెప్పింది. ఆయన తరువాత చాలా వూళ్లు తిరిగి, కలకత్తా వెళ్లిపోయారనీ, అక్కడే రిటైరయ్యారనీ తెలిసింది. తరువాత ఎంత ప్రయత్నించినా ఆయన సంగతి గాని, ఆయన కుటుంబం సంగతి గాని తెలియలేదు. అది నా దురదృష్టం."

"ఆయనకేమైనా పిల్లలా ?"

"అప్పటికి, రెండేళ్ల మగపిల్లవాడు ఉండేవాడు. తరువాత ఎంతమందో తెలియదు. అప్పుడు మా ఆవిడ మా పెద్దమ్మాయిని కడుపుతో ఉంది. ఆయన భార్య, తనకు కోడల్ని కనిమ్మని మా ఆవిడతో అంటూండేది. చాలా దొడ్డ ఇల్లాలు. నేను చాలాసార్లు కలకత్తా వెళ్లాను గాని, వాళ్ల భోగట్టా నాకు దొరకలేదు." అన్నారు విచారంగా. రామారావు అవునన్నట్లు తల వూపాడు.

సుబ్బయ్యగారు గడియారం వైపు చూసి, తనకు మిల్లుకు వెళ్లవలసిన టైమైందనీ, రామారావుగారు మర్చిపోకుండా ఆ పూట తమ ఇంటికే భోజనానికి రావాలనీ చెప్పి బయల్దేరారు. ఆయనను సాగనంపాక రామారావు తన గదిలో కిటికీ దగ్గరకు వచ్చి, అప్పుడే బట్టలారవేస్తున్న విమలను చూసాడు. అతని మనసులో విమల అంటే విపరీతమైన సానుభూతి ఉంది. ఆమెకు సంప్రాప్తించిన వైధవ్యం వల్ల, ఆమె అందం, తెలివితేటలూ, అడవిని కాచిన వెన్నెలలా నిష్ప్రయోజనం అయిపోతున్నాయని విచారించాడు. చాలా కాలం నుండి అతని మనసులో వివాహానికి వ్యతిరిక్తంగా ఉన్న భావాలు క్రమంగా మారసాగాయి. విమల లాంటి స్త్రీ తటస్థిస్తే తను ఎందుకు వివాహం చేసుకోకూడదూ ? మనసును ఒక కల్పనా ప్రపంచంలో విహరింపజేసే ఆమెకళ్ళూ, ఆ కళ్లలోని చూపూ అతనిలో ఎన్నో నూతన భావతరంగాల్ని కల్పింపజేసేవి. ప్రకృతి చిత్రాల్ని తను గీసినప్పుడు, ప్రకృతిలో తనకు కల్పించిన సౌందర్యం స్తబ్ద సౌందర్యంలా కన్పించేది. ౦ విమల రూపంలో మొట్టమొదటిసారిగా అతను చైతన్యంతో కూడిన సౌందర్యాన్ని చూసి, దాన్ని చిత్రించడం తనకు సాధ్యం కాదనుకున్నాడు. ఆమె రూపాన్ని చిత్రించడంలో ఆమెలో ఉన్న బాహ్య సౌందర్యాన్ని చిత్రించవచ్చు గాని, ఆమె అంతరంగంలో ఉన్న ఒక ప్రత్యేకతను చిత్రించలేడు. ఆమెతో తనకెంత మాత్రం పరిచయం లేక పోయినా రామారావు, ఆమె మనసులోని భావాలన్నీ తనకు తెలుసుకోసాగాడు. విమల మేడదిగి ఇంట్లోకి వెళ్లిపోయింది.

విమల అదృశ్య మయ్యాక రామారావు మెల్లిగా బట్టలు వేసుకుని బయటుకు బయల్దేరాడు. ఒకసారి తన ఆఫీసుకు వెళ్దామని, ఈ లోపల స్టేషనులో దుర్గయ్య హోటలులో ఒక కప్పు కాఫీ తాగుదామనీ, స్టేషను వైపుకు నడక సాగించాడు. దుర్గయ్య కాఫీ చాలా బాగుంటుందని ప్రతీతి.

ఆ సమయంలో ప్రసాద్ హోటల్లో కూర్చుని తీవ్రంగా దినపత్రిక పఠిస్తున్నాడు. ప్రొద్దుటి రైలు వెళ్లిపోవడం వల్ల, రద్దీ తగ్గి దుర్గయ్యకు బల్లమీద కూర్చోడానికి తీరుబాటు లభించింది. లోపల, పొయ్యి దగ్గర రామం, రెండో సర్వరుతో, తను ప్రేమించిన నళిని యొక్క రూపం వర్ణిస్తూ, సినిమాలో నటించే నటీమణులెవరూ ఆమె కాలిగోటికి పనికిరారని చెప్పాడు పైగా నళినికి సినిమాలలో చేరాలని ఉందనీ, తను ఆమెను మద్రాసు తీసికెళ్లి సినిమాలలో జేర్పిద్దా మనుకొంటూండగానే, ఆమె హఠాత్తుగా మాయమైందనీ చెప్పి, మళ్లీ నళినిని తను ఈ జన్మలో చూడగల్గుతానో లేదోనని విచారించాడు. రెండో సర్వరు అప్పన్న, రామాన్ని ఓదారుస్తూ, అధైర్య పడవద్దనీ, ప్రేమకు అడ్డంకులు వస్తూనే ఉంటాయనీ, నళిని బహుశా ఏ చుట్టాలింటికో వెళ్లిఉంటుం దనీ, మళ్లీ త్వరలో రావడానికి కారణాంతరాల వల్ల వీలులేక పోయుండవచ్చనీ, ఏ నాటికైనా తిరిగి రాక తప్పదనీ చెప్పాడు. అప్పన్న మాటలు విన్నాక రామానికి కొంత ధైర్యం వచ్చింది. నిజమే ననుకున్నాడు తను అనవసరంగా బాధపడుతున్నాడు గాని, నళిని పరారి అయి ఉండదనీ, మళ్లీ తిరిగి రావచ్చునీ అనిపించింది. అతని హృదయంలో

ఆశాలత చిగిర్చింది. అతని మొహంలో విచారం క్రమంగా మాయమైంది.

"తమ్ముడూ, కలెక్టరు ఉద్యోగాలేవన్నా ఖాళీ ఉన్నాయా ?" అని అడిగాడు దుర్గయ్య, బెంచీ మీద కూర్చొని, వెనకాల గోడకి శరీరం చేరవేసి.

"లేవు. ఉన్నా పేపర్లో వెయ్యరు" అన్నాడు ప్రసాద్.

"ఎందుచేతా ? అందరికీ తెలిసి పోతుందనా ?"

"అబ్బే, అందుకొక పరీక్ష ఉంది. ఆ పరీక్షకు కట్టి పాసయిన వాళ్ళకే కలక్టరు ఉద్యోగం ఇస్తారు."

"అదేదో కట్టేసి, తొందరగా పాసయిపోదూ. ఈ ఉద్యోగాలన్నిటికన్నా నన్నడిగితే అదే మంచిది" అన్నాడు దుర్గయ్య, ప్రసాద్‌కి కలెక్టరు ఉద్యోగం తప్పకుండా వస్తుందనే, ఆశతో. ప్రసాద్ అతనికి సమాధానం ఇచ్చేలోగానే రామారావు వచ్చి, కాఫీ కావాలనడం, అతనికి కాఫీ తయారు చేసివ్వడానికి దుర్గయ్య లేచి లోపలికి వెళ్లడం జరిగింది.

"పేపరు ఇవాళ్టిదేనా ?" అని రామారావు, ప్రసాద్‌ని అడిగాడు. తరుచూ అతను ప్రసాద్‌ని హొటలులో చూస్తున్నాడు గాని అతనెవరో అతనికి తెలియదు. ఆ చిన్న వూళ్లో, చదువుకున్న వాళ్లు తక్కువ కాబట్టి ఇంగ్లీషు పేపర్లెక్కువగా రావు, అది చదివిన వాడెక్కువ మంది ఉండరు. రామారావుకు ప్రసాద్ బాగా చదువుకున్నాడని తోచింది.

"అవును. చూడండి" అని మర్యాదగా తన చేతిలోని పేపరు, రామారావు చేతికిచ్చాడు ప్రసాద్.

"ఈ హోటలు ప్రొపయిటరు మీరేనా ?"

"అబ్బే కాదండీ. దుర్గయ్యగారు దీని ప్రొప్రయిటరు."

"మీరేం చేస్తున్నారు ?"

"బి. ఏ. పాసయ్యాను. ప్రస్తుతం ఉద్యోగ ప్రయత్నంలో ఉన్నాను."

"అలాగా." అన్నాడు రామారావు. ఇంతలో దుర్గయ్య కాఫీ తేవడం, అది త్రాగి రామారావు వెళ్లిపోవడం జరిగింది. అప్పటి నుంచి రోజూ ఏదో ఒక సమయంలో రామారావు, ప్రసాద్ కలుసు

# మనసున మల్లెలు

కుంటూ ఉండడం, పలకరించుకుని మాట్లాడకుంటూండటం ప్రారంభమైంది. ఇద్దరికీ ఒకరి యందొకరికి, స్నేహపాత్రులనే సదభిప్రాయం ఏర్పడింది.

మధ్యాహ్నం రామారావు సుబ్బయ్యగారింట్లో భోజనం చేశాక, సుబ్బయ్యగారూ, ఆయనా, రవికుమార్, సుబ్బయ్యగారి సావిట్లో కూర్చుని సంతోషంగా మాట్లాడుకో సాగారు.

"చూడండి రామారావుగారూ, నేను పొండు ఇంజనీరింగ్, ఫొటోగ్రఫీ నేర్చుకుంటాననంటే మా నాన్నగారు ఒప్పుకోవటం లేదు. ఒక సినిమా డైరక్టరు నవ్వాలని నా కెంతో కోరికగా ఉంది." అన్నాడు రవికుమార్.

"ఫరవాలేదు. ఈ రోజుల్లో సినిమా కూడా ఒక వ్యాపారమే. అందుకని అతన్ని పంపించండి." అన్నాడు రామారావు నవ్వుతూ.

"సినిమా, వ్యాపారమే అన్న విషయం నేనూ ఒప్పుకుంటాను అందుకనే, వ్యాపారం ఎలా చెయ్యాలో నేర్చుకున్నాక అందులో దిగమంటున్నాను. నేను నాలుగు రకాల వ్యాపారాలు చేస్తున్నాను. అందులో ఏదో ఒకరకమైన వ్యాపారం తనకు నచ్చిన దాన్ని, నడిపి, లాభం గణించి చూపించమనండి. తరువాత సినిమాలు తియ్యడానికి పెట్టుబడి పెడ్తాను." అన్నారు సుబ్బయ్యగారు.

"అదీ సబబుగానే ఉంది." అన్నారు రామారావు.

"మరి ఫొటోగ్రఫీ నేర్చుకోవడమో ?"

"దానికోసం బొంబాయి వెళ్లడం దేనికి ? రంగంలో దిగుతే అదే పట్టుబడుతుంది. అంత దాకా ఈ కెమెరా చాల్లే" అన్నారు సుబ్బయ్యగారు

"మొత్తానికి మీరు వ్యాపారస్థులనిపించుకున్నారు. మీకు జవాబు చెప్పడం మావల్ల కాదు" అన్నాడు రామారావు నవ్వుతూ.

"మాటలకేమిటి లెండి. ఏదైనా దూరపుకొండలు నునుపు. దేనికున్న సాధక బాధకాలు దానికి ఉన్నాయి. సినిమా అంటే ఏదో పెద్ద గొప్ప విషయం, అనుకుంటాం. మొన్న మా స్నేహితుడొకడు, మంచి 'క్లాసు' పిక్చరొకటి తీశాడు. అందరూ బావుందన్నారట గాని, దమ్మిడీ లాభం రాకపోగా అసలుకే మోసం వచ్చిందిట. వ్యాపార పద్ధతులలో నడిపినప్పుడే అది రాణిస్తుంది."

రవికుమార్‌కి తన ఆశయాల్ని ఇలా వ్యాపారపు తక్కెడలోవేసి, విలువలేనివిగా నిర్ణయించడం చాలా కష్టం వేసింది. ఎంతసేపూ తన తండ్రి, నష్టం గురించే ఆలోచిస్తూంటారు గాని లాభాల విషయం ఆలోచించరు. సొంత వ్యాపారంలో ఎంత లాభం వచ్చినా, 'అబ్బే చాలా నష్టం వచ్చింది' ఇలా అయితే తొందరగానే దివాలా తియ్యవచ్చు ననడం ఆయన కలవాటు ఏమైనా తనకు బాగా స్వతంత్రం వచ్చాక గాని లాభం లేదు, అని ఆ ప్రసక్తి వదిలేశాడు.

"మీకు ఈ వూళ్లో ఎలా తోస్తోంది ?" అని రామారావు నడిగాడు.

"తోచడానికేముంది. ఆఫీసు పని ఉంది కదా, సాయంకాలాలు కాస్త మందకొడిగా గడుస్తున్నాయి. ఇతర వూళ్లల్లో అయితే క్లబ్బులుండేవి"

"ఇక్కడ క్లబ్బు నడపడం కష్టం. ఎవరూ రారు"

"ఈ మధ్య హిందీ చదువుతో కొంత కాలక్షేపం అవుతోంది."

"ఎవరైనా ట్యూటర్ని పెట్టారా ?"

"పెట్టాలని చూస్తున్నాను కొంతకొంత అర్థం కావడం లేదు."

"వేరే ట్యూటరెందుకు ? మా అమ్మాయి విమల ఉందిగా. దానికి మీరు ఇంగ్లీషూ, లెక్కలూ బోధ పరచండి" అన్నారు సుబ్బయ్యగారు.

రామారావు హృదయం ఒక గెంతు గెంతింది ఇంతటి అద్భుత అవకాశం లభిస్తుందని అతను ఎన్నడూ వూహించలేదు.

"అలాగే తప్పకుండా" అన్నాడు.

"అమ్మా ! విమలా !" అని కూతుర్ని పిల్చి, "మన రామారావు గారికి నువ్వు హిందీ చెప్తే, ఆయన నీకు లెక్కలూ, ఇంగ్లీషూ చెప్తారట... నీ కిష్టమేనా ?" అని అడిగారు సుబ్బయ్యగారు. విమల అలాగేనంది.

"మీరు కూడా మా ఇంట్లో ఒకరిలాంటి వారే మీకు తీరికున్నప్పుడు వచ్చి, మా విమలకు చెప్తూండండి." అన్నారు సుబ్బయ్యగారు రామారావుగారితో.

తరువాత రామారావు తన గదిలో కూర్చుని సుబ్బయ్యగారు తన యందు చూపిస్తున్న అభిమానం చాలా గొప్పదనుకున్నాడు. తనయందెంతో నమ్మకం ఉండబట్టే ఆయన ఈ విధమైన ఏర్పాటు చేశారు. ఏది ఏమైనా రోజూ కొంత సేపు విమల సాన్నిధ్యంలో గడిపే అవకాశం లభిస్తుందని ఆయన తృప్తి పడ్డాడు.

(సశేషం)



బాధకు లెక్కచేయని చిన్న పిల్లలకు కూడా

# బ్యాండ్-ఎయిడ్*

## ప్రథమ చికిత్స పట్టీలు అవసరమే



వాడుట ఎంతో సులభము: పట్టీయొక్క మందు గుడ్డ వైపు గాయముమీద పెట్టి, సెలోఫేన్‌ను తీసివేసి, బాగా అంటేలా నొక్కండి

ఈ చిన్న పిల్లవాడు బాధకు లెక్కచేయడు. కాని ఆ చిన్న దెబ్బను ఉపేక్షచేయకూడదు! దెబ్బకు బ్యాండ్-ఎయిడ్ ప్రథమ చికిత్స పట్టీని వెంటనే వేస్తే దానికి శుభ్రమైన, ఆరోగ్యరక్షకమైన రక్షణ కలుగుతుంది. పూర్తిగా వాటర్‌ప్రూఫ్‌వైన బ్యాండ్-ఎయిడ్ ప్రథమ చికిత్స పట్టీలు వీలుగా ఉండేలా ఒక్కొక్కటే విడివిడిగా ప్యాకుచేయబడినవి.

* ట్రేడ్ మార్క్

**జాన్సన్ & జాన్సన్**

ఆఫ్ ఇండియా లిమిటెడ్

30 ఫోర్జెట్ స్ట్రీట్, బొంబాయి 26




AWT-II. 2504




పొలంనుంచి ఇంటికి తిరిగి వస్తున్న రైతుకు దారిలో ఒక రాళ్ళగుట్ట కనిపించింది. ఆ రాళ్లగుట్ట వెనక పులితోక చివరకూడా కనిపించింది. రైతుకి భయంవేసింది! తనకోసమే గుట్టఅవతల పులిపొంచి ఉంటుందని ఊహించాడు. ఏమిటి చెయ్యటం?

అమాంతంగా వెళ్ళి పులితోక పట్టుకున్నాడు. పులి విడిపించుకుందామని పెనుగులాడింది, కాని రైతు తోకవదల్లేదు. పులి గాండ్రించి పంజాలని విదిలించింది. రైతు మాత్రం తనపట్టు విడవలేదు!

ఇలా కొన్ని నిముషాలు గడిచాయి. ఇంతలో అటుకేసి ఒక సన్యాసిరావటం గమనించాడు రైతు.

"నిజంగా నిన్ను దేవుడే పంపాడు!" అని అరిచాడు "అదిగో, నా కొడవలి తీసుకుని ఈ పులిని చంపెయ్యి, నేనేమో గట్టిగా పట్టుకుంటాను!"

సన్యాసి గంభీరంగా చూశాడు, "ఎలా చంపను? జీవహింస చెయ్యలేనే?" అన్నాడు.

"అదేంమాటని? ఈ తోకనిలా ఎంతకాలం పట్టుకునుండను? వదలగానే నన్ను చంపెయ్యదా పులి?" అని గోలపెట్టాడు రైతు. కాని ఏంలాభం! సన్యాసి వినిపించుకోలేదు. అహింస తన పరమధర్మం అన్నాడు, అసలే బలహీనంగా ఉన్న రైతు ఇక లాభం లేదనుకుని "పోనీ తోక నువుపట్టుకో, నేనే పులిని చంపుతా," నన్నాడు.

సన్యాసికి ఇందులో తన ధర్మానికి విరుద్ధంగా ఏమీ కనిపించలేదు, తోక పట్టుకున్నాడు

"గట్టిగా పట్టుకున్నావా?" అని అడిగాడు రైతు

"ఆహా!" అని సన్యాసి సమాధానం ఇవ్వగానే రైతు తోకని వదిలేశాడు ఒంటికి పట్టినచెమట అంతా తుడుచుకుని, కొడవలి తీసుకుని ఇంటిముఖం పట్టాడు.

"అయ్యా, రైతుగారూ! పులిని చంపరేం?" అని కేకవేశాడు సన్యాసి కంగారుగా. అప్పటికే పులి పెనుగులాడటం ప్రారంభించింది.

రైతు జవాబులేకుండా నడిచి వెళ్లిపోవటంచూసి సన్యాసి మరింత కంగారుగా "ఇంక పట్టుకోలేను, త్వరగా చంపెయి!" అని అరిచాడు.

రైతు ఆగి వెనక్కి తిరిగి అన్నాడు: "సన్యాసిగారూ! మీ అహింసా ధర్మ బోధన నామనస్సునే మార్చేసింది. నేనిక ఏ ప్రాణినీ చంపలేను! ఇంకొంచెం ఓపిక పట్టండి. ఈ దారి వెంబడి వచ్చేవారెవరైనా చంపుతారు" అని నింపాదిగా చెప్పి తన దారిన తను వెళ్ళిపోయాడు. ★

బాలసాహితి : ఏ
ఇండోనీషియా కథ

అందమైన, సువాసనగల జుట్టు
కొరకు
**టాటావారి హేర్ ఆయిల్స్**
కోకోనట్ లేక కేస్టర్

## నవభారతి గురుకులం

రాజమండ్రి-2.

స్థాపితం: 1940.

**ప్రారంభము 15—6—64.**

చక్కని వసతి పాఠశాల 6, 7 తరగతు
లలో ఇంగ్లీషు మీడియం సెక్షన్ను కలవు.
ప్రాస్పెక్టస్‌కొరకు వెంటనే వ్రాయండి.

కరస్పాండెంటు.

**నెలకు రు. 400 సంపాదించండి**

డ్రాయింగ్ & పెయింటింగ్ గైడ్. ఫ్రీహాండ్ డ్రాయింగ్, స్టెంసిల్స్ పనులు, కలర్స్‌తో పెయింటింగ్, ఇతర డ్రాయింగ్‌పనులకు 400 చిత్రాలుగల ఈ పూర్తి గైడ్ మీకు సహకరించును. డ్రాయింగ్ మాస్టర్, డ్రాఫ్ట్స్‌మెన్, డిజైనర్(ఆర్టిస్ట్)లకు ఉపయోగకరమైనది. ధర రు. 6/– చిత్రపటాలుగల ట్రాన్సిస్టర్ రేడియోగైడ్ రు. 4/– ఫోటోగ్రఫీటీచర్ రు. 4/– టైలరింగ్ & కటింగ్ రు. 5/– వివాహజీవితం (100 పటాలుగలది) రు. 5/– ఒక్కొక్కపుస్తకానికీ పోస్టేజి రు. 1–25 అదనం.

**ILFA Book Depot (APL) Rafatganj,**
**ALIGARH (U. P.)**

## డాక్టర్ వృత్తి చేయండి

విరామకాలంలో ఇంటిలో పోస్టల్ ట్యూషన్‌ద్వారా హోమియోపతి చదివి, గవర్నమెంటు రిజిష్టర్డు కాలేజిద్వారా డిప్లొమా పొందండి. ప్రాస్పెక్టస్ ఉచితం. వెంటనే వ్రాయండి

**Indian Homoeopathic College,**
(APW), JULLUNDUR CITY

## స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములకు

# లోధ్ర

**కేసరి కుటీరం**
**(ప్రైవేట్) లిమిటెడ్**
*రాయపేట, మద్రాసు-14*

విజయాలు:
సీతారామ జనరల్ స్టోర్సు (ఏజన్సీస్)
విజయవాడ . సికిందరాబాదు . మధుర . బరహంపురం . బెంగుళూరు

పెరిగే
పిల్లలకు
కావాలి

# KALZANA

Kalzana

GRKD.

## కుట్టుపని నేర్వండి

గురువు లేకుండా అన్నిరకము లను స్వయంగా కత్తిరించి కుట్టుటకు 266 పేజీ 180 బొమ్మల పుస్తకము రు. 5/– బట్ట యేమీ వృధాపోకుండా కత్తిరించుటకు డ్రాయింగ్ బొమ్మలతో 60 ప్లానుల్ల పుస్తకం రు. 4-50. 2 తెలుగు. 2 ఫుల్ క్యాలికో బైండుల్లు. వి. పి. అదనము.

జి. పున్నారావుచౌదరి, మోపర్రు, తెనాలితా

# సరాగమాల



వి.ఎ.కె. రంగారావు

'జక్కన్న'లో రెండు ప్రణయ యుగళ గీతాలున్నవి. 'ఏదో గిలిగింత' (జి. ఇ. 35410) "నిలువుమా నిలువుమా నీలవేణీ" (జి. ఇ. 35376) ఇందులో మొదటిది సింధుభైరవి రాగం. "వలపు తలుపుతీసె, కమ్మని తలపు నిదురలేచె, నీవు తాకిన నిమిషమందె హాయౌ వనమ్ము పూచె" అని సి నా రే. రచన వరసలో ప్రత్యేకత లేదుగాని వాద్యగోష్ఠిలో జనార్దన్ వాయించిన సితారుల జలతారుల మిలమిలలు ఉన్నవి. రెండవది సీనియర్ సముద్రాల రచన. 'దాచెలి నిను మది దాచుకోనీ, నీ కనుల నీడనీడ నా మనసూ నిదురపోనీ' అని వారి ముద్ర రాగం తిలంగ్ సుశీల కంఠంలో తిప్పిన సుతారపు వంపులు ఇందులో సొంపులు.

దాశరథి రచన విషాదగీతం 'ఎచటికోయి ఈ పయనం'' (ఎన్. 69771) అన్ని విధాలా సాధారణమైన గీతం. ఛాయాగ్రహణం మాత్రం కన్నుల పండువుగా ఉన్నది. పై పాట అసావేరి రాగం. రెండు సరదా నృత్య గీతాలు 'ఝుంతర్ మంతర్ ఆటరా' (జి ఇ. 35410) "మల్లెపూల చెండు వంటి చిన్నదానా (జి. ఇ. 35386) మొదటిది కొసరాజు సాహిత్యం. 'అమ్మాయిలకు గుట్టు ఎక్కువ, అబ్బాయిలకు బెట్టు తక్కువ'' ఇందులోని మెరుపు రాగం పీలూ అనుకోవచ్చేమో! పాడిన స్వర్ణలత మాధవపెద్ది కంఠాలలోను, వరస, వాద్య గోష్ఠులలోను నిరుపమానమైన ఉత్సాహం ఉంది "మల్లెపూల" పాట, సముద్రాల రచన; గొల్లసుద్దు వరస, వసంత మాధవపెద్ది గానం చల్లని జానపద పరిమళం. రెండింటికీ నృత్యం నిర్వహించినది చోప్రా. గిరిజ చాలా శ్రమ తీసుకొని చేసింది. హీరోయిను చేయని ని హాస్యతార చేయడం ముదావహం.

చిత్రంలో సంగీత సాహిత్యాల రీత్యా, చిత్రీకరణ రీత్యా మణిమకుటం వంటిది ఆరు రాగాల ద్విపద మాలిక కమాచ్, సింధుభైరవి, భూప్, కాపి, దుర, యమన్ కల్యాణి రాగాలు ఇందులో ఉన్నవి 'నీ రూపు గనినకే పారవశ్యాలా, మా రాజా మనసేలు మదని తంత్రాలు' అన్న పదము మధురాతి మధురం ఇది ఇంకా రికార్డుగా రాలేదు.

చివరి స్తోత్రం సముద్రాల రచన (ఎన్. 69809) శహన రాగంలో కొంత వేరు ఉంది. పతాక సన్నివేశంలో హృదయ వీణను మీటే విధాన రాగరచన చేయబడినది. ఈ పాటలు కాక కమాస్ రాగాలలో తిల్లానా ఒకటి ఉన్నది చేసిన రాజశ్రీ, శకుంతల చేయించిన సరస నక్రమైన శ్రద్ధ తీసుకున్నారు నృత్యం కూడ శాస్త్రీయమైన పద్ధతిలో ఉంది. నాయకునికి ఇదేపనిలేదంటే నాయికపై మోజే కాని నాట్యకళపై ప్రీతికాదు.

చివరి మాట. సంగీత, సాహిత్యాలపై ఈ విధంగా శల్యపరీక్ష చేయటానికి కారణం తక్కిన సినిమాల పాటలకన్న ఇవి తక్కువ స్థాయిలో ఉన్నాయని కాదు. చాల యెక్కువ స్థాయిలో ఉన్నవనే. అసలు 'జక్కన్న'లో పాటల సాహిత్యానిది పై చేయి.

చాలామంది పాఠకులు ప్రత్యక్షంగానూ, పరోక్షంగా ఉత్తరాల ద్వారానూ అడిగే ప్రశ్న ఒక్కటి ఉంది. అది 'పాట మొదట వ్రాసి, తరువాత దానికి వరస కడతారా లేక మొదట వరస చేసి, దానికి మాటలు వ్రాస్తారా' అన్నది. అందరూ సర్వసాధారణంగా చెప్పే జవాబు అవసరాన్నిబట్టి, సౌకర్యాన్ని బట్టి రెండు విధాలా జరుగుతుంది అని.

నిజానికి మాటికి తొంభై వంతులు రెండు విధాలా జరుగదు. పాట వ్రాసి వరస చేయక, వరసచేసి మాటలు కూర్చక యిక పాట యెలా తయారవుతుంది అని అడుగుతారేమో. ఈవిధంగా అని చెప్పేముందు ఈ సూత్రాన్ని అతిక్రమించే కొద్దిపాటి వాటిని గురించి తెలుసుకుందాం.

"అమరశిల్పి జక్కన్న" లో "ఈ నల్లని రాలలో" ఉన్నది. ఈ పాట 'రామప్ప' సంగీత రూపకానికి సి. నారాయణరెడ్డి ఏనాడో వ్రాసినది. వచ్చినది నిర్మాతలకు యథాతథంగా అరువు తీసుకొని యిష్టం వచ్చినట్లు వరస మలచుకొని ఉపయోగించుకున్నారు. ఇక ఇటువంటి కోవలోకి వచ్చేవే సినిమాలో మాటికో కోటికో వినిపించే ప్రఖ్యాత కవుల విఖ్యాత రచనలు. ఒకోమారు క్షేత్రయ, సారంగపాణి, అన్నమయ్య మొదలగువారి పదాలు తీసుకున్నా రాగం మార్చకుండా వరస మార్చటం మొదలగు 'తేలికపరచటాలు' జరుగుతుంటాయి. ఎప్పుడో ఒకప్పుడు గాని సాహిత్యం జోలికి ("పూజాఫలం" లో "శివదీక్షాపరురాలనురా" మార్చినట్లు) పోరు.

ఇక సాహిత్యాన్ని మార్చి వరసలను ఉన్న దున్నట్టుగా ఉంచడం ఇంకా అరుదు. ఒకోసారి పెద పదే తిల్లానా దరువులు మారినా వరస పాతదే అయిఉంటుంది. అలానే 'పోతన' సినిమాలో త్యాగరాజకృతుల ననుసరించి చేయబడిన రెండు పాటలు. వరస త్యాగరాజుదే. మాటలు కొత్తగా వ్రాసుకున్నవి.

పై రెండు తెగలకు చెందిన పాటలు మాటికి ఒకటి రెండుకి మించి ఉండవు ఇక తక్కిన పాటలు ఎలా చేస్తారో వినండి నిర్మాత, దర్శకుడు, వారితోబాటు స్థానం ఉన్నచోట రచయితా (సాధారణంగా పింగళి, ఆత్రేయ) ఆ సన్నివేశంలో పాట వరస ముఖ్యమా, మాటలు ముఖ్యమా అన్నది నిర్ణయిస్తారు వరసే ముఖ్యమనుకుంటే సంగీతదర్శకుని పిలిపించి కథనూ, సన్నివేశానికి అందులో గల స్థానాన్నీ వివరించి, తమకున్న ఉద్దేశాన్ని చెప్పి ఒక వరసను చేయమంటారు. ఆరోజో మరునటిదినమో సంగీతదర్శకుడు మూడో నాలుగో వరసలు పల్లవుల వరకు వినిపిస్తాడు. నిర్మాత, దర్శకులకు నచ్చిన దానిని రచయితకు వినిపిస్తారు. రచయిత పల్లవి వ్రాయటం ఆరోజో తక్కిన వరస సంగీత దర్శకుడు చేయగా చరణాలు వ్రాయటం రెండు మూడు రోజుల్లోనూ పూర్తి చేస్తాడు. ఒకవేళ సన్నివేశానికి మాటలే ముఖ్యమనుకుంటే పాటే ముందు పూర్తిగా వ్రాయించి నిర్మాత, దర్శకులు సరేనన్న తరువాత సంగీతదర్శకునికి యిస్తారు. ఒకరోజు ఆలోచించి రెండవరోజు రెండు మూడు వరసలు ఆ మాటలతో వినిపించడం, నచ్చిన పల్లవి పద్ధతిలోనే



హైదరాబాదులో "మూగమనసులు" శతదినోత్సవం సందర్భంలో తీసిన ఈ చిత్రంలో మం॥ శ్రీ భాస్కర్ వెంకారెడ్డి, దర్శకులు శ్రీ ఆదుర్తిని చూడవచ్చును.



# రాజా టాల్కమ్ పౌడరు

అందాన్ని ఇచ్చే ఉత్తమమైన టాల్కు. సున్నితమైన సువాసనతో అందరికి ఆకర్షణీయమైనది. పసిపాపల శరీరాలకు ఇది ఒక ప్రత్యేకత.

శేలికగా బట్టలు ఉతుకుటకు: రాజా బార్ సోప్
దివ్యమైన స్నానమునకు: రాజా కస్తూరి సోప్
పెద్ద స్టోరులన్నింటిలో దొరకును.

మణ్యం & కంపెనీ, బెంగుళూరు

GP

---

కండ్ల రక్షణకు, అందానికి

# దర్బార్ కాటుక







రాంవీర్ కంపెనీ, బొంబాయి-4.

---

# శిరోజాలురాలుచున్నవా?

శిరోజాలు కురచగా బిరుసుగా నున్నవా?



వాడండి



# ఝరిన్

అది ఎట్లు చర్యజరుపునో చూడండి!

మీ కిష్టమైన ఏనూనెలోనైనా దానిని కలపండి! అది ఎంత త్వరగా శిరోజాలు రాలుటను ఆపి సొగసైన పొడవగు శిరోజాలను ఎట్లు పెంచునో మీకు ఆశ్చర్యమగును.

ఏకైక డిస్ట్రిబ్యూటర్లు: సుగంధ ఘర్ అహమదాబాద్-1
ఏజెంట్లు: సి. నరోత్తమ్ అండ్ కం, బొంబాయి-2

MPS TEL

స్టాకిస్టులు:
మెస్సర్సు జె. బలాబాయ్ & కం॥ 260, చైనాబజార్, మద్రాసు-1

---

'ఆంధ్రసచిత్ర వారపత్రిక'లో ప్రచురణకు ఇండియన్ ఇంక్ తో వేసిన కార్టూనులు మాత్రమే పంపాలి. సాధారణంగా 4" × 2", 4" × 4" చిత్రాలు పత్రికలో సహితూ ఉంటాయి.

---

# ఉజ్జీటాన్

మకరధ్వజ చేరినది

నీరసము, బలహీనత, ధాతునష్టము, సుఖవ్యాధులచేతను, దీర్ఘవ్యాధులచేతను శరీరము కృశించుట, రక్తహీనత, దడ, పాలువారలిక, రక్తపోటు, మతిస్థిమితము లేకుండుట హరించి బలము, రక్తవృద్ధి, ధాతుపుష్టి, జీర్ణశక్తి కలిగించు

శాస్త్రీయ ఆయుర్వేద రసాయనము

8 ఔన్సుల సీసా రు. 6-50 పోస్టేజి రు. 2/-

చరకాశ్రమం ఫార్మసి (ఫోన్: 240)

తాలుకా ఆఫీసు: ఏలూరు విజయవాడ-3.

---

పండిత
డి. గోపాలాచార్యులవారి

# జీవామృతం

ఆరోగ్యానికి బలానికి

ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేట్) లిమిటెడ్
మదరాసు-17

---

# పాదాలలో ఆనెలు

పాదాలలో ఆనెలు, కండలు పెరిగి, నొప్పి పోతుకుపోను పాదము నేలపై పెట్టలేక రాళ్ళు తగిలిన ట్లుల్లిపడు వారు పైపూతగా వాడిన శీఘ్రముగా నయం చేయగల సంజీవి. వెల పోస్టు ఖర్చులతో రు. 4-25న.పై

కొక్కోకము చిత్రపటములు గలది. రు. 1-5(
దాంపత్య రహస్యములు ... రు. 3-0(
తెలుగు హిందీ స్వయంశిక్ష రు. 4-5(

పోస్టు ఖర్చులు ప్రత్యేకము.

ప్రభ అండ్ కో.

3, మలయపెరుమాళ్ వీధి, మద్రాసు-1.

---

RATNAM'S N-OIL

(పైపూతకు మాత్రమే)

అంగవరములు బలహీనత చెంది, చిన్నదై నచో తిరిగి యథాప్రకారం అయిపూర్తి సౌఖ్య మనుభవించుటకు 50 సం॥ ప్రఖ్యాతి గలది. 1 సీసా రూ. 10/-లు వి. పి. 1-50. కావలసినవారు ఎడ్రెస్సు పంపేది. ఇందులో స్పెషల్ రకం అర్జంటు గుణమునకు రూ. 25-00 లు వి. పి. రూ. 2-00.

డాక్టర్ రత్నం సన్స్, (Estd 1904)
మలకపేట బిల్డింగ్, అజంపూరా మార్కెట్ వద్ద,
హైదరాబాద్-24 (ఆంధ్రప్రదేశ్)

## అవీ - ఇవీ - అన్నీ

### అమలాపురంలో "మూగ మనసులు" శతదినోత్సవం

అమలాపురంలో ఇటీవలనే జరిగిన "మూగ మనసులు" శత దినోత్సవ సభలో శ్రీమతి సావిత్రి, జమున, సూర్యకాంతం, గుమ్మడి, అల్లు రామలింగయ్య, పద్మనాభం, దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు, శ్రీ దాశరథి తదితరులు పాల్గొన్నారు. ...శ్వర టాకీస్‌లో జరిగిన ఈ సభకు స్థానిక ...మూర్తులు శ్రీ కె. యం. కృష్ణమూర్తి ...త వహించారు.

...చలేశ్వర టాకీస్ అధిపతి శ్రీ తాతరాజు ...టులకు, సాంకేతిక నిపుణులకు స్వాగతం ...రు.

...ధ్యక్షులు శ్రీ కృష్ణమూర్తి ప్రసంగిస్తూ, ...'మూగమనసులు' చిత్రంలో నటించిన నటీ... ప్రతిభా విశేషాలను కొనియాడారు. ...దాశరథి ప్రసంగిస్తూ, గోదావరి నదిని ...ని వారికీ, దర్శకులు శ్రీ ఆదుర్తి ఆ నదిని ...రని అన్నారు. శ్రీమతి సావిత్రి తమ ప్రసం... "సభలో నాగేశ్వరరావుగారు లేనిలోటు కొట్ట...వచ్చినట్లు కనపడుతోందనీ, ఈ చిత్రం రజతోత్స...వం కూడా చేసుకోగలదని ఆశిస్తున్నాననీ" అన్నారు. ...జమున, తమకు లభించిన 'గౌరి' పాత్ర ఔచిత్యాన్ని వివరించారు. దర్శకులు ...ఆదుర్తి ప్రసంగిస్తూ, ఈ చిత్ర నిర్మా...ణ సాధక బాధకాలను విశదీకరించారు. ...శ్రీమతి సూర్యకాంతం, శ్రీయుతులు ...అల్లు రామలింగయ్య, పద్మనాభం గారలు ప్రసంగించారు.

...నటులకు, సాంకేతిక నిపుణులకు సన్మాన ప...త్రాలు సమర్పించారు. స్థానిక కళాశాల ప్రిన్సి...పాల్ శ్రీ సుబ్బరాజు ట్రోఫీలను బహూకరించారు. ...శత దినోత్సవ సభ జయప్రదంగావాలని శ్రీ నాగే...శ్వరరావు అమెరికానుంచి పంపిన సందేశాన్ని, ...ఇతర సందేశాలను సభలో చదివారు.

శ్రీ పెన్మెత్స నరసింహరాజు వందన సమర్పణతో ...సభ ముగిసింది.

—కూచి గోపాలకృష్ణరావు.

### పి. పుల్లయ్యగారి కుమార్తె వివాహం

ప్రముఖ సినిమా దర్శకులు శ్రీ పి. పుల్లయ్య, ...గారి ద్వితీయ కుమార్తె చి. సౌ. రథ వివాహం, ...మద్రాసు వాస్తవ్యులు శ్రీ ఎ. వి. రామానుజులు ...నాయుడుగారి జ్యేష్ఠపుత్రులు శ్రీ లోకప్రియుతో, ...గతనెల 12 వ తేదీన మద్రాసులో జరిపించారు.

వివాహానికి నగరంలోని పలువురు ప్రముఖులు, ...సినిమా కళాకారులు, ఇతర పెద్దలు విచ్చేశారు.

ఈ సందర్భంలో కుమారి యామిని కృష్ణమూర్తి శాస్త్రీయ నృత్య ప్రదర్శన జరిగింది.

## సినీ మిరపకాయలు

సాహిల్

"రాముడు—భీముడు" చిత్రంలో పెండ్యాల సంగీతం గనుక, అతి అందంగా ఉందని ఒక విఖ్యాత వ్యాఖ్యాత వ్రాస్తాడనుకుంటాము! ఈ విషయంతో బాటే మరొకటీను. ఆరుద్ర "అన్నపూర్ణ" లోనూ, ఆత్రేయ "ఆత్మబలం" లోను అశ్లీలార్థం వచ్చిన పాటలు వ్రాశారనటానికి నోరు, వ్రాయటానికి కలం రాలేదా? ఎప్పుడూ ప్రైవేటు రికార్డులపై పడకపోతే, వారిని మందలించరాదూ?

* * *

పోటీపడి, ఒక చిత్రాన్ని యిద్దరు తీసినప్పుడంతా, ఒకరు పెద్ద దెబ్బ, మరొకరు కొంత దెబ్బ తింటున్నారు. "ద్రౌపదీవస్త్రాపహరణం", 'ద్రౌపదీ మానసంరక్షణం', "బాలనాగమ్మ", "శాంత బాల నాగమ్మ", "శ్రీలక్ష్మమ్మ కథ", "లక్ష్మమ్మ" ఉదాహరణలు. బాగా బాగుపడినది జెమినీయే గాని, తక్కినవారంతా యేదోవిధంగా నష్టపోయారు. ఆమధ్య అయిదు పొడి అక్షరాల కంపెనీవారు, జి. వరలక్ష్మి ద్రౌపదిగా "నర్తనశాల" తో పోటీ పడాలనుకోవటం, కర్ణాటకా నుంచి కృష్ణ, అభిమన్యు పాత్రల వరకూ, మీ కేది కావలిస్తే, అది తీసికొనివేయండని, గుమ్మడిని అడగటం, అతను ఆ సినిమా ఉద్దేశ్యమే వారికి మానిపించ ప్రయత్నించి, కృతకృత్యుడవటం జరిగింది. ఇప్పుడు మాధవి వారు, "పాండవ వనవాసం" కథ తియ్యాలనుకుంటుంటే, మరొక కంపెనీ దానినే వేరొకపేరుతో తియ్యాలని సంకల్పిస్తున్నారట. మరొక పంపిణీ సంస్థ దానికి చేయూత నివ్వ ప్రయత్నిస్తున్నదట. పాపం!

* * *

ఏ ప్రసిద్ధ నటీమణి శుక్రవారంనాడు అయిదువేలు నల్లడబ్బు పుచ్చుకొని తిరిగి లేదన్నది? మాటాడకుండా మరొక అయిదు వేలు యిచ్చిన ఆ దర్శక నిర్మాత యెవరు? శుకసప్తతి ప్రశ్నలలో యిది మొదటి ప్రశ్న.

* * *

విశాలాచార్య "లడ్డూ లడ్డూ" సి. నారాయణ రెడ్డి తయారు చేశారట. మరి మీరా కిరా హోహాగా? అయినా భానుమతి అన్ని భాషల్లో పాడిన పాటను వితలు జంతువుల భాషల్లో రాయించలేరు కదా?

Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty St
Madras-1. Phone: 22244 & 23713. Chief Editor S. Sambhu Prasad




శారద

అందమైన ముఖ వర్చస్సునకు
ఎక్కువ కాలం నిలిచే పరిమళమునకు

# రెమి

టాల్కమ్ పౌడరు